గుంజిలి—2.

# నాట్యోత్పలము.

పురాణం సూరిశాస్త్రి.



విద్యానిలయము, బందరు.




బందరు, సుధర్మ ముద్రాక్షరశాలయందు,

ముద్రింపబడియె.

1924




[ వెల రు. [illegible]

# కృతిసమర్పణము.

శా॥ ప్రాకన్నేరని నాఁటనుండియు ననున్ । బాలించుచో మాతగా ।
శ్రీకాంతామృతశారద రాదృతయశ । శ్రీగూర్చుచో జన్మదా ।
స్త్రీ కంజాతవిశాలనేత్రగ; ధరా । సీతార్థమున్ బెంచుచో ।
నాకున్ దోఁచెడు లోకమాతృ పరత । త్వమ్మాత్మ భావించెదన్ ॥

మ॥ మురిపెంపు న్నిరి పెంపునించి యనయమ్మున్ బ్రోచుచో దండ్రియై ।
సరసార్థప్రసరన్న శాస్త్రితముని । చ్చల్ గూర్చుచో నొజ్జయై
పరతత్త్వాత్మక భోగభాగ్యముల సం । భావించుచో ధాతయై
యరయ న్మూఁడుజగమ్ములన్ వెలయు నా । ద్యన్మూర్తి భావించెదన్ ॥

ఉ॥ శ్రీరఘురామచంద్రుని యు । శేషకృపామహిమాతిరేక వి
స్తారిత ధీవిశేషమున శాస్త్రములం గళలం దొకింత చే
కూరిన నేర్పు పెంపున నకుంఠిత దేశహితమ్ముఁ గోరి యు
య్యూ! రచియించి మత్కృతుల నర్పణ జేసెద [illegible] దవాపుడీ ॥

# నాట్యోత్పలములోని

## ద్వాదశాధ్యాయములు.





# ప్రస్తావన.

"నాట్యాంబుజము" వెనువెంట నాంధ్రుల నవీన కవితావిలాసముల దెలిపెడి, "కావ్యాంబుజము" ముద్రింప నెంచితిమి. కాని మావిద్యానిలయ కుసుమాంజలిలోని మొదటి మొగ్గమీఁద నరుదెంచిన విమర్శనంబుల బరికింపఁగావ్యాంబుజ ప్రచురణకు బూర్వము మరికొన్ని గ్రంథముల నాంధ్ర పాఠకలోకమున కందించవలసిన యవసరమగుపడినది. నాట్యాంబుజ కావ్యాంబుజములు నా స్వకీయ సంస్కారసమష్టిని దెలుపు స్వతంత్రరచనలై యున్నవి. ఈసంస్కార మెట్టు లేర్పడినదో తెలుగుచదువరు లెఱింగినఁగాని పైగ్రంథములం దగుపడెడి విమర్శక రీతులు ఫలింపనేరవు. మరియు కావ్య నాటక రచనలం దశేషముగ గృషిసలుపు తెలుగువారల కీ విషయములం దన్యభాషలలో జరుగు ప్రయత్నము తెలియ పరచుట యగత్యముగ దోఁచినది. అందుచేత విదేశరూపక మర్యాదలను విస్తరించుకొఱకు "నాట్యోత్పలము" అను ప్రకృతగ్రంథమును రచించితిమి. కావ్యప్రపంచ వృత్తాంతమును దెలుపుకొఱకు "కావ్యసంతానము" అను గ్రంథ మచిర కాలమున వెలిబుచ్చనున్నాము. మరియు, గావ్యనాటక విమర్శపద్ధతులను సిద్ధాంతములను వెల్లడించుటకు "విమర్శక పారిజాతము", "రూపకరసాలము", అను రెండు పుస్తకముల నూహించి రచించి ప్రస్తుత మచ్చొత్తించు చున్నాము. ఈ

మూడు పుస్తకములు వెలువడిన తరువాత, ప్రాచీనాంధ్ర మహాకవులు, నవీనాంధ్రకవులు, తెలుగు పత్రికలకావ్యసేవ, ఆంధ్రుల గ్రామ్యసారస్వతము అను నాలుగు ప్రధానశీర్షికలలో నా కావ్యాభినందనము కావ్యాంబుజరూపమున నేను ఆంధ్రుల విజ్ఞాన విస్తరణకేర్పరచదలచిన, విమర్శక సౌధశిఖరముగ, బ్రకటింపదలచినాను.

కవులు, విమర్శకులు, శాస్త్రపరిశోధకులు స్వకీయ ప్రతిభావిలాసముననే మెప్పొందగలుగుదురుగాని యితరుల రచనలాధారపరచుకొని యుద్గ్రంథముల రచింపనేరరు. నాకు నేనే ప్రమాణము. నాయింద్రియములు చూడగలిగిన విషయములే నాప్రపంచము. నామానసమున కవబోధమగు భావములెవరివైనను నావట్ల నుపయోగించు భావజగత్తు. నేననుభవించునదే రసము. నాయంతరాత్మ తెలుసుకొనగలిగినదే భగవత్స్వరూపము. అందుచేత నే నెన్నిపుస్తకముల జదివినను నెందరి గురుపాదముల గొలచినను కుల క్రమాగతమగు నింద్రియవికాస మేపరకు నాకేర్పడినదో జననాంతర వాసనాఫలితముగ నెట్టి మానసాధ్యాత్మిక వికాసము నాయందగుపడునో అందుకుతగిన విజ్ఞానమే, సంస్కారమే, భావములే కరుణాప్రవృత్తులే ననుజేరగలవు. నావలన వెలువడగలవు. ఈ జన్మములో నేను విద్యాభ్యాసమున కుపయోగించిన ముప్పది సంవత్సరముల భూరికాలావకాశములో నిక్కముగ రెండు సంవత్సరముల కాలమే విజ్ఞాన సంపాదన కుపయోగపడియుండును. ఇంతటి యల్పకృషి నావిజ్ఞానమహత్వమునకు గారణము కానేరదు. "బహూని మే వ్యతీతానిజన్మాని"

వందలకొలది జననాంతరములలో నేననుభవించిన రసభావపరంపరలు నావంశమందనేకతరములలో బరిణమించి నన్నుజేరిన యింద్రియవికాసము నావిజ్ఞానమున కాధారమగునేకాని యిహమందు సంపాదించిన రెండుసంవత్సరముల విజ్ఞానము, నామానసతత్త్వ మేర్పరచజాలదు. మరియు నిప్పటికృషికి గూడ ప్రాక్తన సంస్కారమే యాధారమగుచు, నది తెరచిన దారులనే యది యవకాశమిచ్చెడి పరిమాణముననే ప్రకృతి నవలోకించిగాని గ్రంథముల పఠించిగాని విజ్ఞానసంపాదన మొనర్ప గలుగుచున్నాను. అందుచే రసానుభవమునకు, లోకానుభవమునకు, భావప్రదీపనమునకు నాకు నేనే ప్రమాణము. నారచనలకు సంబంధించినంతవరకు, నేనే సృష్టిలోని పరమాధికారిని, సర్వద్రష్టను, కూటస్థానమును. నా రచనలు నామానసతత్త్వమును నాస్వకీయానుభవములను, వెలిబుచ్చు నంతవరకే రుచింపగలవు; యుపయోగింపగలవు; అందగింపగలవు; దార్ద్రొక్కెడి ప్రతిభాప్రభావమున రాజిల్లగలవు. కాని నాప్రకటనలు యెంతవరకు లోకానుభవముతో నేకభవించునో అంతవరకే యాదరింపబడును.

దేశకాల విపర్యాసముల నొందక తరతరములలో కానుభవముతో జాలవర కేకీభవించుచు, నల్ప ధీయుతలగు జనసామాన్యమునకు భావప్రకోప మొనగూర్చెడి రచనలు కావ్యరూపక విమర్శనాదులందు, లోకప్రఖ్యాతి వడసి చిరంజీవులై యున్నవి. ఇట్టి రచనలొనర్చిన కవులు, పండితులు, పరిశోధకులు, విమర్శకులు మాననీయులై యున్నారు. తుదకు నాసంస్కారమే నాకు పరమ ప్రమాణమైనను నాస్వ

కీయ భావములే, నాయందపేక్షింపదగిన, పరమైశ్వర్యమైనను జగమున చిరంజీవులై నిలచిన మేటిపొత్తముల యంతస్సారమును దేటపరచి వానితో నాయనుభవ మెంతవర కేకీభవించునో యేపట్ల స్వాతంత్రించునో దెలిపినగాని విమర్శక ప్రపంచమున గృతార్థుడను గానేరను. మరియు నాంధ్రకవులకు కావ్యప్రపంచమున లభ్యమగు స్థానమును, రూపక లోకమున నాంధ్రనాటకోద్యమ మనుభవించెడి పదవిని, విమర్శక జగత్తునందు నాయనుభవము లాక్రమించెడి నైచ్యోన్నతులను, విశదపరచినపుడే నారచనలు ఫలసిద్ధి నొందగలవు. ఇట్టి యుద్దేశ్యముతో నాయా విషయములందు విశ్వావలోకన మొనర్చు నాట్యోత్పలము, కావ్యసంతానము, విమర్శక పారిజాతము, రూపకరసాలము మున్నుగ ప్రకటింప నిశ్చయించినాను. నా కవిమిత్రు లనేకులు కావ్యాంబుజమున కెదురుచూచుచున్నారు. వారి జాగు మన్నించెదరుగాక! వారి కావ్యప్రయత్నములకు నేనొనర్పదలచిన విమర్శక సహాయమును సార్థకపరచుటకే యింతటి పునాదు లేర్పరచుచున్నాను.

తెలుగుభాష భారతీయుల విజ్ఞాన సర్వస్వ మెరుంగుటకు సంస్కృత పాలీభాషలమీదను, పాశ్చాత్యాద్యన్య దేశ వాఙ్మయవిభూతు లెరుంగుటకు నాంగ్లభాషమీదను, ఆధారపడవలసియున్నది. అనగా ఆంగ్లగీర్వాణ పాళీభాషలనే, విజ్ఞానసర్వస్వమును సంపాదించుట కాధారముగ విశ్వసించెదను. నేను గీర్వాణాంగ్లముల నవలంబించి, నాపొత్తముల గూర్చుచున్నాను. ఈదినములలో గ్రమ్మర హైందవజాతీయతనే ప్రాచీనభారతీయ కళాస్వరూపములనే నిలువబెట్టు

దమను కూపస్థమండూకాభిప్రాయము లుండకూడదు. మన స్వరాజ్యాపేక్ష యెట్టిదైనను, విజ్ఞాన నిర్మాతలను జగదుపకారకులగునీశ్వరాంశములుగ దలచి వారొసంగిన విజ్ఞానప్రసాదము, మానవప్రపంచ మెల్ల నుపయోగింప నుద్దేశింపబడినదిగ భావించి తెలుగువారలు ప్రపంచములోని సమస్తదేశముల ప్రకృతిశాస్త్రములను, కావ్యాదికళారహస్యములను గుర్తించి వానివెలుగున తమరచనల నభివృద్ధి జేసుకొనవలెనని నాతలంపు. నాట్యోత్పలము ప్రపంచములోని రూపకవృత్తాంతముల దెలియపరచును.

పురాణం సూరిశాస్త్రి.



# విషయసూచిక.

## I నెలపొడుపు.



## II ఆట మొలకలు.



## III ఆటవిరుల విప్పాటందములు.

రూపకములనెడి మిస్టరీలు, మిరకిలులు, మొరాలిటీలు— ఆపిరా యను గేయరూపకము - మెలోడ్రామా - మూకాభినయము - మాస్కులు-మారియొనెట్టులు అను బొమ్మలాటలు - ఫార్సుప్రహసనము - బాలెట్టు నృత్తరూపకము- ( పుటలు 21—44 )

IV తెల్లతెలుపులు తీగయల్లికలు.

ఇందు పాశ్చాత్య నాగరిక చరిత్రము, ముఖ్యముగ సారస్వతవికాసమునకు సంబంధించినది సంగ్రహముగ దెలుపబడినవి- పాశ్చాత్య చరిత్రములు- ఆర్యకులముల పశ్చిమ సంచారము- యవన పురముల లౌకిక కళావైభవములు- రోమక సామ్రాజ్యము- 6-16 శతాబ్దములు విద్యాగిహీనములు— అరబ్బుల విద్యాప్రచారము- రినేసెన్సు అను ప్రాచీన విద్యోద్ధారక మహోద్యమము- నవ్య యుగారంభము- ఇటలీ, స్పెయిను, బెల్జియము దేశముల వర్తక వ్యాపార విజృంభణము- స్పెయిను సామ్రాజ్యము- ఎలిజబెత్తు మహారాణి పరిపాలనలో నాంగ్ల సామ్రాజ్యోదయము- ఫ్రెంచి సమాజ్య వికాసము- 18వ శతాబ్దపు నవ్యభావోదయము- 19లో సర్వదేశములు స్వతంత్రులై సాహితీ వికాస మనుభవించుట. ( పుటలు 45-60 )

V ఆటకైతల పూలసరము.

ఇందు పాశ్చాత్య రూపకకవుల జీవితములు—— వారి ప్రఖ్యాతరూపకములు, వారినాట్యకళా సేవయు ముచ్చటించబడినవి.B.C. 6వ శతాబ్దము మొదలు నేటివరకును ప్రభవిల్లిన

రూపకావిర్భావ తరంగములను 13 ప్రకరణములుగ విభజించి విస్తరించినాము. (పుటలు 61-134)

1. యవన రూపకము— తీస్పీజు— ఇస్కిలను— సోఫోక్లీజు— యురిపిడీజు— అరిస్టాఫనీసు— యవనులనాట్యకలాభిలాష— శిక్షాక్రమములు— పరీక్షలు.

2. రోమక రూపకములు— ఇటలీలోని ఆటెల్లా ప్రహసనము— ప్లాటను మహాకవి— టెరెన్సు— సెనీకా—

3. మధ్యకాలమునందు విలసిల్లిన క్రైస్తవమత ప్రచారక నాటకములు- సంచారీ సమాజములు- ఆపెరాలు-

4. నవీన నాట్యకవితారంభము- సోఫానిస్బా-నికాలను యుడల్- క్రిష్టఫర్ మార్లో-

5. ఎలిజబత్తునాటి ఆంగ్లరూపక విలసనము—డెక్కరు- బెన్ జాన్సను - వెబ్బరు - మెస్సెంజరు - బోమాన్ ఫ్లెచ్చరు జంటకవులు-

6. ఆంగ్ల రూపకముల సంపూర్ణ వికాసము- విలియము షేక్స్పియరు- జీవితము- రచనలు- కామెడీలు- చరిత్రనాటకములు— ట్రాజెడీలు- షేక్స్పియరు మానస వికాసము- వీని సంసార విమర్శము- పాశ్చాత్య ట్రాజెడీలని జతత్వము-

7. స్పెయిను దేశపు రూపకావిర్భావము — డవేగా — కాల్డెరాన్.

8. ఫ్రెంచినాటక విజృంభణ — ప్యార్ కార్నెల్లీ — మాల్యేరు — రాసీను.

9. కాలసంధి — డ్రైడెను — కాన్‌గ్రీవు — గోల్డు స్మిత్తు — షూఫీ — హ్యూమ్.

10. 18 వ శతాబ్దపు రూపకరచనము — హోలాల్ బర్గు — మరివో — బొమార్కియసు — గాల్డోనీ — మోల్ ఫెరీ — షెరిడను — వాల్టేరు — డిడరాటు.

11. జర్మనీలోని భావరూపక మహోదయము — లెస్సింగు మహాకవి — షిల్లరు — గెటీ — వీలాండు — గ్రిల్ ప్రాజరు — 19 వ శతాబ్దపు సారస్వతరీతులు — ప్రాచ్య విజ్ఞానసంపాదనము.

12. 19 వ శతాబ్దము — విక్టరహ్యూగో — డూమా తండ్రికొడుకులు — మూసెట్టు — ఆగేరు — గోపీ — గాగాల్ — క్రాసింస్కీ — ఫ్రైటాగు — ఆస్ట్రివిస్కీ — అచాగరే.

13. ఆధునిక నాటకకవిత్వము - ఇబ్సెను - రాబర్ట్సను - హెన్రీఆర్థరుజోన్సు - మాటర్‌లింకు - హాట్‌మన్ - బర్నార్డుషా - జోర్న్‌సన్ - తామస్‌హార్డీ - జేమ్సుబారీ - సింగా-ఈట్సు - పర్యాలోచనము.

VI ఆటకోలను.

ఇందు నాట్యనిలయమగు థియేటరు అభినయ మర్యాదలు తెలుపబడినవి - థియేటరు - యుపనరంగములు - మధ్యకాలముల రంగము - ప్రసిద్ధ నాట్యాలయములు అభినయము యొక్క యుత్పత్తి వికాసములు - షేక్సుపియరుకాలము - బర్బేజి - గారిక్కు - వివిధనటుల యభినయా దర్శములు -

నటలక్షణములు - శిక్షాక్రమము - ప్రస్తుతపద్ధతులు - స్వాభావిక సాంకేతిక అభినయ వైఖరులు - నటస్వాతంత్ర్యము. ( పుటలు 135-152 )

VII ఆటరిక్కలు.

మహానటులు — బర్బేజీ - బెట్టరుటను - గారిక్కు - ఫాసిటు - ఇర్వింగు తండ్రి కొడుకులు - బెర్నహార్టు - రాబర్టుసను - సిడ్డన్సు - టాల్మా-కీను - మాక్రెడీ - ఫెల్ప్సు - హెర్బర్టుట్రీ - రాషేలు - ఫోర్బ్సురాబర్టుసను - యెల్లెను టెర్రీ - జార్జి అలెక్జాండరు - సజీవ నటశేఖరులు. ( పుటలు 153-166 )

VIII ఆటలోటల కమ్మతెమ్మరలు.

ఇందు మచ్చునకు కొన్ని రూపకవిమర్శనము లుదాహరింపబడినవి. మారిసు మాటర్లింకు రచించిన నవ్యనాటకములను వ్యాసమునకు అనువాదము - ఇబ్సెను మహాకవిని గూర్చి ఆర్థరుజోన్సు చేసిన ప్రశంస - ఆర్థరుజోన్సుగారి నవ్యనాటకధర్మములను యుపన్యాసమునకు అనువాదము. ( పుటలు 167-202 )

IX ఆటకుదురులు.

ఇందు యూరపులోని నాట్యశాలా పరిపాలనపద్ధతుల మున్నగు లౌకికసందర్భములు ప్రశంసింపబడినవి - నాట్యకళాపోషణము - వ్యాపార నాట్యశాలలు - రాజ్య నాట్యాలయములు - ధర్మశాలలు - చందాకంపెనీలు - ప్రజానాట్యమందిరములు - [illegible]శ్రీవుల వృత్తిసంఘములు - రిపర్టరీథియేటరు -



# నెలపొడుపు

నాటకకళ యేవిధమున నుత్పన్నమై యెట్లు వికశించినది? దేశభేదమున, కాలపరిణామమున, నిది యెట్టిమార్పుల జెందియున్నది? నానాదేశముల జాతీయస్వభావములు, చారిత్రానుభవములు రూపకరూపముల నెవ్విధి శాసించినవి? కాలక్రమములో రూపకకల్పలనయందు క్రమవికాశ మగుపడుచున్నదా? దేశకాలపరిస్థితులతో సంబంధములేని కవిప్రతిభయే, కళాస్వరూపమును నిర్ణయింప స్వతంత్రించెనా? నాట్యాదికళల భూతచరిత్ర పరిశోధనమువలన, ప్రస్తుతపై ఖరులగుర్తించుటవలన, భావిపరిణామ మూహించి సత్వరసత్ఫల ప్రాప్తికి దారి త్రొక్కగలమా? ఇదివరకు ఉండిన నాటకరూపములను, నటాచారములను విమర్శించి భావికళామర్యాదలను శాసింపగలమా?

మున్నగు సంప్రశ్నములు లోతు బాతు లరయ జూచెదము.

భరతవర్షమున బలుతెఱంగుల వాసికెక్కిన శాస్త్రముల చరిత్రలులేవు. కాలక్రమములో నెవరివెనుక నెవ్వరరుదెంచి, యంతకు పూర్వముండిన భావముల నేగతి మార్చినదియు తెలిసికొను ఆధారములు తక్కువ. కృతికర్తల దేశ కాల శిక్షాదివిశేషము లగుపడవు. అందుచేత గ్రంథమందలి విషయమునుబట్టి, విషయ సంకీర్ణతను గమనించి వీని క్రమవికాస మూహింపవలసి యుండును. ప్రతిశాస్త్రము అనాదిగ వేదములనుండి ప్రణవబీజములనుండి యుత్పన్నమై, శివునిచే పార్వతికి లోకహితార్థమై యుపదేశించబడి, మహర్షులచే దేశమందు ప్రవర్తింపబడినట్లు ఈ నాడు వ్రాయువారలుకూడ చెప్పి కొందురు. నిజమే! దివ్యస్ఫురణ లందికొనియే, నదృష్టసంస్కారోపదేశముల ప్రోత్సాహముననే గ్రంథవిరచన మేర్పడుచున్నది. కాని ఇట్టి స్ఫురణోపదేశముల నందికొని యిదివరకు వ్రాసిన మానవుల గ్రంథాధారమునను, వారి ప్రతిభావ్యుత్పత్తియునను దేశమందేర్పడిన కళాసంప్రదాయము లనుసరించియు, నవ్యభావోదయ మేర్పడుచున్నది. ఈ భావపరివర్తనములను, కాలక్రమములో గుర్తించుటయే చరిత్రార్థమగును. అట్టి చరిత్రలు హైందవనాట్యకళనుగూర్చి నిర్ణీత కాల సూచనలతో లభింపవు. కనుక, కళాస్వరూపములందును, ప్రయోజనానుకూలమగు రూపపరిణామమందును, విషయ సంకీర్ణతయందును, కళాస్వరూపముల క్రమవికాస మూహింపవలసి వచ్చును.

ఇంతవరకు జీవశాస్త్రజ్ఞులు, ప్రాచీన జీవరాసుల పరిణామక్రమ మూహించుటలో, భూస్థాపితమైన ప్రాక్తనజీవ

శల్యములను, యీనాడగుపడు జీవరాసులను పరీక్షించి, వాని యంగవికాసమును, ప్రయోజనానుకూలమగు అవయవస్ఫూర్తిని గమనించి, తక్కువ సంకీర్ణమగు జీవమెక్కువ సంకీర్ణమగుదానిగ బరిణమించెనని యూహించుచున్నారు. విశ్వమందలి రూపైక్యతను, ధర్మసామ్యతను, గుర్తించి యనంత గుణరూప విలాసములతో వ్యక్తమగు భూతప్రపంచమంతయు నొక్క మూలతత్వపు పలుమొగములనియు, ఆమూలతత్వము తానే యనియు నెరుంగు మానసవికాసమే; — దేహవాంఛాప్రేరితములగు స్వార్థ సంపాదనోపాయముల నిరసించి జగమందలి జీవరాసుల నన్నిటిని సమదృష్టితో సానుభూతితో నరసి జీవప్రపంచపు స్వాతంత్ర్య సుఖజీవనమునకును, వ్యక్తిశక్తుల ప్రత్యేక ప్రతిభా వికాసమునకునూ వలయు నైతిక సాంఘిక ధర్మములను కల్పించి ప్రవర్తింపజేయు మానస వికాసమే; — ప్రపంచ పరిణామమందలి మహోన్నత సోపానమని యూహించుచున్నారు. అనగా విశ్వమందలి సర్గస్థితిలయహేతువగు తత్వము, ఆద్యంతములను, దేశకాలములను నెరుంగని నిత్యసద్వస్తువు యొకటి కలదనియు అది ఆత్మయనియు అదే "నే" ననియు, గుర్తించుట మానసపరిణామముగ నూహింపబడినది. మరియు జీవరాసుల సుఖజీవనమునకు వలయు నుపాయము లవలంబించుచు సర్వసమత్వ మూహించు మానసము మహోన్నతమని దలుపబడినది. ఇవి రెండును మానవ మానసమునకు ప్రత్యేక లక్షణమని యూహించిరి. ఈయూహ, యితర జంతుజాలముల భావములను సాంఘిక మర్యాదలను మనము గుర్తింపలేక, మన మానవజాతియొక్క

భావములనే గుర్తింప గలుగుటవలన నహంకార స్వాభిమాన
పోషితమగు, వస్తుపారిశస్త్య్య నిర్ణయమున నేర్పడినది. పురుగు
లకు, కుక్కలకు నాయాజాతి ప్రత్యేక జీవజాతులకు, సన్యో
న్యాభిప్రాయముల దెలుపుకొను సంభాషణక్రమము లెట్టివిగల
వో మనమెరుంగము. వాని నైతిక సాంఘికధర్మముల నెఱుం
గము. వాని యాధ్యాత్మిక పరచింత లెరుంగము. కాని
పొట్టి జంతువునందైనను, మానసకోశము, మిగిలిన యవ
యవములు తొల్లిటి బీజాంకురమునుండి వికసించుగావున, నీ
మానసము, తదంతర్గతమగు దివ్యచైతన్యము, బీజమందే నివ
సించియుండి తత్పరిణామమగు సమస్త జీవరాసులందును, స్వ
కీయ సంపూర్ణ పరిభావమున నున్నదనియే నమ్మవచ్చును.

ఈయూహ నంగీకరించినయెడల జీవజాలములలో నెద్ది
పరిణామసుస్వరూపమును చూపగలదో చెప్పజాలము. అణు
జీవములనుండి మానవునివరకును గల యనంతకోటిజీవజాతు
లలో నెద్దానిమతమున నదియే సంపూర్ణప్రయోజనోచిత దేహ
వికాసము గలిగి పరతత్త్వవిజ్ఞానమును నైతికసాంఘికనియమములను
పాలించుచున్నదనియు నొప్పికొనక తీరదు. ఏలనన మనమె
రుగనిసంగతి లేదని చెప్ప శాస్త్రము లొప్పవు. అందుచేత
బీజప్రాయమగు అణుజీవములే పరిణతజీవస్వరూపములో? లేక
మనమెరిగినంతలో సంపూర్ణావయవవికాస మేర్పడిన మానవ
దేహమే జీవపరిణామమో? మనముస్సృష్టి పరిణామని తలచెడిపర
తత్త్వపరిజ్ఞానమే మానసపరిణామమో? లేక నెట్టియు నెఱుంగని
అజ్ఞానమూఢనిస్తంభనమే మానసపు మహోన్నతస్థితియో
దేవాంచలదీట్చు స్వార్థసంకల్పములే (instincts) మహా

న్నతజీవధర్మములో? లేక సర్వసమత్వమంగీకరించుచు సర్వవ్యక్తుల స్వతంత్ర్య సుఖజీవన మాదేశించు నైతికసాంఘికసూత్రములే పరధర్మములో? కళాపరిపోషణము భావప్రాచుర్యము, రసానుభవము, కరుణాదినానుకంపములు మానవుని ప్రత్యేకకలక్షణములో లేక జీవితార్థపు పరమావధియో తెలుప నేరును సమర్థులుకారు. కాని మానవుడు ప్రపంచరహస్యముల గుర్తించి విశ్వశక్తుల శాసించి జీవజాలముల వశపరచుకొని విశ్వనేతయై జగదధినాథుడై వెలయుకతన నాతని సామ్రాజ్యహేతువగు మానసము జీవతరంగిణియొక్క పరిణతగర్భవీచికముగ నెంచియున్నారు. అతని నైతిక సాంఘిక ఆధ్యాత్మికకళాజీవనము జీవక్రమములో పరమోత్తమవికాసమొందినదిగ నూహింపబడినది. ఇట్టి మానస పరిణామ మొదవిన మానవుని యవయవవిన్యాసమే జీవనత్వముల బరిణతరూపముగ నెంచబడి బీజప్రదమగు నణుజీవములనుండి మీనోరగవిహంగమృగరూపమార్గములలో మానవదేహవిన్యాసమేర్పడిన తీరవులు జీవశాస్త్రజ్ఞులచే తెలసికొనబడినవి. బీజాంతర్గతమగు మానసము కాలక్రమమున నవ్యవాంఛల క్రొత్త సంకల్పములనుదయింపజేసికొనును. ఈకోర్కెలు యూతలపులు కొంతవరకు దేశకాలపరిస్థితులవలన నేర్పడు నవ్యసందర్భములలో ఆదేహము జీవించుకొరకును రూపవికాసమును కలిగించుచున్నది. పరిస్థితులకుఅనుకూలముగు రూపవికాసమొందిన జీవములేజీవింపగలవు. అదివరకుండిన పరిస్థితులుమారి క్రొత్తవి యేర్పడినప్పుడు తదనుకూలమగు, రూపమును,జీవనపద్ధతులను అందికొననేరనిజంతువులు నశించుచుండెను. కాని జంతుజాలము లోభాగో

శచాదిత్రియందు వివిధకాలములం దేర్పడిన నవ్యపరిస్థితుల కనుకూలమగు రూపభేదము నొందవలెననెడి సంకల్ప మేర్పడి తరతరంబుల నిరంతరప్రేరణవలన జంతురూపములను, క్రమముగ వికసింపజేసినవి. ఇది రూపపరిణామమునకును అవయవ వికాసమునకును, కారణభూతమైన భౌతికహేతువు. ఇదికాక మానసమునకు విశ్వతత్వమెరుంగువేడుక, తన్నుదా తెలుసుకొను సంకల్పము తొల్లిటినుండియు, కలదు. ఈపరతత్వవిశ్వవిజ్ఞానసాధకమగు ఇంద్రియవికాసమును పొందుకోరికయు, జంతుపరిణామమందు, ప్రేరకమై పనిజేయుచున్నది. ఎప్పటికప్పుడు నవ్యసంకల్పము లుదయించి నిరంతరవివర్ధ వైశాల్యముగల భావములేర్పడి వాని కనుకూలమగు, దైహికమార్పులేర్పడుచున్నవి. ఇవ్విధముగ నవస్థానుకూలమగు రూపప్రాప్తియు, భావనుకూలమగు యింద్రియ వికాసమును జంతు పరిణామములలో కాలక్రమమున నేర్పడి యింకను జరుగుచున్నవి. భావము క్షుద్రస్వార్థ సంకల్పములనుండి, విశ్వావలంబకమగు ప్రణయముగను జగత్కళ్యాణాభిలాషగను మారుచు, దానికనువగు మానసవికాస మేర్పడుచున్నది. ఇదియే జీవితపు పరమావధిగ నెంచుదురు గాన, మానవశరీరము యిట్టి భావవికాసమున కనుకూలమగు యింద్రియ విన్యాసమొదవినది. గాన, నదియే యిప్పటివరకును, యేర్పడిన జంతుపరిణామమని నిశ్చయింపవచ్చును. కాని మానవజాతులందుంకూడ కాలక్రమమున నవ్యపరిస్థితులకును, క్రొత్తతలపులకును, నిరంతరము విశ్వవ్యాప్తికై యత్నించు మానసప్రబోధములకును అనుకూలమగు రూపావయవ పరిణామ మేర్పడుచున్నది. పరిస్థి

తులమార్పును తిరస్కరించు కృత్రిమోపాయముల మానవుడు కల్పించుకొనినందున యీతని రూపునం దిక యెక్కుడు మార్పు ఆకారణముచేత కలుగకపోవచ్చును. కాని మానస సంకల్పములు క్రమవృద్ధినొందుటచే వాని యాశ్రయమగు మెదడు నందును, తత్ప్రభావమున నేర్పడు రూపమందును వికాసముండ వచ్చును. ఎక్కువ జ్ఞానము కలిగి కరుణాంతరంగులై తయా నీతి సమత్వములతో మెలంగెడి మహామేధావులగు యోగి సత్త్వముల సామాన్యసాముద్రిక లక్షణములే వారి నడతలు జీవితకథలు ఆదర్శములు సంకల్పములు మున్నగు మానసలక్షములే మానవపరిణామమును నిదర్శించు ఉత్తమరూపములని యెంచదగును. ప్రకృతికెల్ల మానసమే పెద్ద. మానసమునకు పరచింత, సమదృష్టి, పరమధర్మములు. మానవవ్యాపారములగు నీ సంకల్పముల వికాసమనుసరించియే రూపపరిణామ మేర్పడినది. గావున, మానసవికాస మెక్కువగనున్న మానవుని రూపమే రూపపరిణామముగ నంగీకరింపబడును. అంచులోకూడ, ఎవ్వని గుణమందు పరచింత సమదృష్టు లెక్కువ వికాస మొందినవో వాని రూపమే రూపసౌందర్య పరిణామముగ నంగీకరింపవచ్చును. ఇందువలన రూపసౌందర్యము మనోవికాసమును బట్టియు, గుణసమృద్ధిని బట్టియు నిర్ణయింపబడుచున్నది. అదికాక వస్తువునందే కొన్ని రేఖాలక్షణములుండి, యనిర్వచనీయ భావసూచలనచే, మన మానసవృత్తులను పరచింతకును సమవర్తనమునకును మరల్ప వచ్చును. అట్టి వస్తువులు రూపసౌందర్యము గలవిగ నెంచ దగును. ఎటులైనను, మానసలక్షణములై ప్రత్యక్షముగ పరచింతా

సమదృష్టుల నెలకొల్పు సత్వముగాని, శారీరకలక్షణములచేత నీభావముల స్ఫురింప జేయుసత్త్వముగాని జంతుపరిణామ మహోన్నతాదర్శముగ నెంచబడుచున్నది. కాని యీగుణముల వికాశ బాహుళ్యమున వస్తుప్రాశస్త్య మేర్పడుచున్నది. ఆలౌకికసౌందర్య మొప్పారుపంచ వన్నెల రామచిలుక. రూపగాంభీర్య విరాజితమగు సర్పరాజము, చక్కని బొచ్చుకుక్క, రూపసౌందర్య లక్షణములచే నొక కురూపిమానవుని కన్న నెక్కువ వస్తుప్రాశస్త్యమును వొప్పియుండ వచ్చును. కాని వీని మానసిక వికాసము ఆ కురూపినరునకు చాలదు గావున, వీని జీవితమును కాపాడినంత పట్టుదలతో విలువతో వానిని లెక్కింపకున్నాము. అందుచేత మానసవ్యాపార వైశాల్యము, పరచింత సమదృష్టులు, పరమావధిగ నెంచి వానిపరిచారమున కనుకూలమగు అవయవవికాసము యీభావముల దోపజేయు రూపలక్షణము, జంతుపరిణామమునకు పరిణతావస్థలుగ నెంచబడినవి. ఈ వికాసక్రమమున జీవశాస్త్రజ్ఞులు జంతుపరిణామ మూహించియున్నారు. యుగముల నిరంతర సంకల్పమున వ్యాపారవైశాల్యమున తదనుకూలమగు రూపములేర్పడినవని నిశ్చయించియున్నారు. కాని యింతకాలములో మానవుడు ఉత్పన్నమాయెగదా! యని యితర జంతువుల రూపము లంతరించలేదు. సృష్టిలోని నానా విధములగు మానసావయవవికాస స్వరూపముల దెలుపు జంతువులు యీనాడుకూడ వ్యాసవేక్సిపియరు, గీటీ గాంధీలతో సమకాలికజీవనము సల్పుచు నిలచియున్నవి.

జంతువికాసమందు నే సూత్రముల బరికించితిమో అవియన్నియు కళావికాసమున గూడ నగుపడుచున్నవి. అన్ని కాలములలో అన్ని దేశములలో నానావిధములగు కళాస్వరూపములు చిత్రశిల్పకావ్యనాటకములందు గోచరించుచు నిలచియున్నవి. దేశకాలపరిస్థితు లనుసరించి ప్రపంచమంతటను నొకొక్కకాలమున కొక్కొకరీతిని కళాదర్శములు లేర్పడుచుండును. కళాస్వరూపములందు కాలభేదమున జనించు రుచిభేదములే యెక్కువ రూపనిర్ణాయికప్రాభవ మొప్పుచుండును. ఇదికాక ఆయాదేశములందు కాలక్రమమున నేర్పడు సాంఘికరాజకీయమతనైతికావస్థల ననుసరించి ప్రత్యేకపరిస్థితు లేర్పడుచుండును. ఇందున ఆజాతియొక్క చిరాభ్యస్తమగు ఆచారవ్యవహారముల ననుసరించు జాతీయసత్వ మొకటికూడ చేరును. దేశము, కాలము, జాతీయత మున్నగు హేతువులచే యెప్పటికప్పుడు క్రొత్త పరిస్థితులు నవ్యాదర్శములు విం తరుచులు కలుగుచుండును. ఈరుచిభేదము ననుసరించి కళారూపములు మారుచుండును. కళానిర్మాణమందు యేర్పడెడి కృతార్థసంతోషము కళావలోకనమున జనియించు రసానుభవము యేకాలమున కారీతిగ నొక్కటిగనే యుండును. పరిస్థితుల భేదము ననుసరించి కళాస్వరూపములందు గలిగెడి మార్పులను దెలుపు లక్షణము మారుచున్నదే కాని కళలయొక్క వస్తుహేతుఫలములు మారుటలేదు. కాని జంతుపరిణామమందు యేవిధముగ సుస్వరూపవికాసము యేర్పడినదో అటులనే కళలందుకూడ కళాస్వరూపములు స్థూలాభివర్ణనముతో మొదలిడి పరచింతయు సమదృష్టిని గలిగింపు

భావములను వానిసూచించు రూపములను వికసింపజేసికొనుచున్నవి. కాలక్రమమున నాట్యాదికళల బాహ్యరూపములందును, నిజసత్త్వమందును, పారమార్థికమగు క్రమవికాసముందునను మాట నిజమేకాని యీవికాసము జనసామాన్యపు మానసమందును, రుచులందును వ్యక్తమగు నంతగా కళాస్రష్టలగు మేధావులందు గోచరించదు. కాలక్రమమునమానవజాతి మొత్తమునకు కళల వస్తుహేతుఫలంబుల గూర్చినదభిప్రాయములు వికసితచిత్తవృత్తులు అలవడుచున్నవి కాలప్రభావము మానవజాతి సమిష్టిలో చూడనగును. కాని కళావిధాతలలో చూపులు కాలపరిస్థితుల నతిక్రమించి స్వతంత్రించి సంచారప్రభావమున దేశకాల పరిస్థితుల ప్రేరణచే సమర్థింపదగని క్రొత్తదారుల త్రొక్కుచుండును. మానస ప్రతిష్ఠాపనయందు అన్నిటియందు యీవిషయమగుపడును. మనమీనాడు వాల్మీకికన్న వ్యాసునికన్న కాళిదాసషేక్సుపియర్లకన్న శ్రీరామ, శ్రీకృష్ణ, బుద్ధ క్రీస్తులకన్న యెక్కువశాంతిప్రదము సుఖావహము కళావిస్తరణావకాశము నైతికసదాచారము విశ్వానుభూతియు గల నాగరిక కాలములో యెక్కువ సంపదలతో మిక్కిలి సౌకర్యములతో ననామయ సమృద్ధసుఖజీవనము సలుపుచున్నాము. కాని బ్రహ్మసూత్రములను భగవద్గీతలను మించు పొత్తముల వ్రాయజాలకున్నాము. రామాయణ, శాకుంతలాది కావ్య సందర్భముల నూహింపజాలకున్నాము. మయాసభాశిల్పిచాతుర్యమును సమీపింపజాలకున్నాము. అందుచే కళావిధాతల శిల్పసిద్ధి నాటకరచయితల కావ్యకలనాచాతుర్యము వారి

ప్రతిభావిశేషము నంటి దేశకాలావస్థల నతిక్రమించి వికసించి రూపకప్రసవంబుల నీనునే గాని కాలక్రమమునంటి నడువదు. అదికాక జంతుపరిణామసుస్వరూపమగు మానవజాతితో సమకాలికముగ ననంత నీచసత్వములుండుపగిది గాంధీప్రణయ తేజోవిలసితంబగు నిప్పుడమి యడవుల క్రూరవనేభములు దిరుగురీతి మహామేధావు లుండుకాలములోనే వారిదేశములలోనే నీచకళారచయితలు కూడ నుండవచ్చును. అందుచేత కాలక్రమమున కళాస్వరూపములు రూపసౌందర్యమునను కల్పనసౌకర్యమునను భావగాంభీర్యమునను, కావ్యప్రయోజనమందును వికసించెనని చెప్పజాలము. కళాపరిణామమును నిర్ణయించుటలో కృతికర్తయొక్క ప్రతిభావిశేష మొక్కటియే విచారణీయ మగుచున్నదికాని దేశము, కాలము, పరిస్థితులు మున్నగు విషయములు నిష్ప్రయోజనము లగుచున్నవి.

కళ మానసవ్యాపారమునకు సంబంధించిన రూపకల్పనము. మానసవ్యాపారముల పరమావధి, పరచింతయు సమదృష్టియునని చెప్పియున్నాము. వీనికి సాధనము ప్రథమసోపానము, చిత్తశుద్ధి. కావున యేకళాస్వరూపమందు యివియెక్కువగ వెలుగొందునో దేని ననుభవించుటవలన పరతత్త్వానుభూతి వలన నేర్పడు నిశ్చలానందము, కరుణానుకంపము, "సర్వమున్ అతనిదివ్యకళామయ" మను విశ్వాలోకన సామర్థ్యము తదంగములగు చిత్తశుద్ధి, నైతికజీవనము యేర్పడునో అదియే కళాపరిణామమని చెప్పవలసి వచ్చును. అనగా కళయొక్క ప్రాశస్త్యము మానసాదర్శమగు చిత్తశుద్ధికి గలుగు ప్రయోజనమువలన గలుగుచున్నది. అనగా కళాస్వరూపములందు

పరధర్మసూచక సామర్థ్యమే సౌందర్య హేతువగును. గాని రూపవైఖరియందు రసోదయమేర్పరచు సౌందర్య మెద్దియు లేదు. కళకుపయోగించెడి వస్తువులన్నియు యిట్టి పరధర్మ సూచకశక్తి గలవియే. కాని వీనిలో కొన్ని ప్రాకటముగ నింద్రియ సంతోషమునకు జతపడుచు వీని పొంగుపాటున మానసవ్యాపారముల వడ్డగింపజేయును. కళలందుపయో గింపబడు రూపములన్నియు సౌందర్యరాసులే, రసాలవాల ములే! అన్నియు పరధర్మ సూచకములే, కాని కొన్ని యిం ద్రియముల నెక్కుడు సంతోషపరచి మరికొన్ని చిత్తశుద్ధి కెక్కువ తోడ్పడును. కళా ప్రాశస్త్యమును నిర్ణయించుట లో మానస వ్యాపారముల కవి యొనగూర్చెడి ప్రయోజనము వానిరూపముల పరధర్మ సూచక శక్తియు గమనింపవలసి యున్నవి. అందుచేత చారిత్రక్రమమున, కళలు క్రమవికాస మొందెనాయను ప్రశ్న సముచితము కానేరదు. కాని నానా దేశములందు వివిధకాలములలో భిన్నపరిస్థితులందు కళాస్వ రూపము లెట్టి వికాసమొందెనో తెలియుట రసానుభవమునకు తోడ్పడకున్నను, భావికళా స్వరూపమును నిర్ణయించుట కుప యోగింపకున్నను ప్రత్యేక పరిశోధనాంశముగ తృప్తికరమై యుండును. ఇంతకూ జీవశాస్త్ర సూత్రములు, మానవ చరిత్ర, సిద్ధాంతములు కళావికాస పద్ధతుల నూహించుటకు తోడ్పడవు. కళాప్రయోజనము నెరింగి తదనుకూలమగు స్వరూప మున్నదా లేదా అనియే విచారింపదగును.

కళాప్రయోజన మెల్లపుడు నొక్కటియే. కళాకల్పన మందు పాల్గొను వస్తుహేతుఫలంబు లొక్కటియే. కాని

వీనియందని ప్రియోజనమును తదనుకూలమగు రూపమును పట్టి వివిధవైఖరుల కళాస్వరూపము లేర్పడుచున్నవి. వీని నాట్యవిలాసములు గుర్తించెదము. కళాప్రయోజన ముద్దేశించిరచియింపబడిన నాటకము లేరూపువైననుమన్నింపదగియుండును.

హైందవలక్షణగ్రంథములలో కొన్నివిధములగు రూపకములు చేర్కొనబడి యున్నవి. వీనిలో నెద్దిముందేర్పడెనో యెద్ది యావల గల్పింపబడెనో చారిత్రికముమున తెలిసికొను సాధన లేకపోవుటయే కాక అట్లు తెలుసుకొనిన ప్రయోజనము కూడ కానుపించదు. గీర్వాణనాటకకవుల చరిత్ర మీయగలముకాని, రూపకపరిణామసోపానముల ద్రొక్కిచూపనేరము. పాశ్చాత్య దేశములలో తొల్లిటినుండియు సమకాలికచరిత్ర రచియింపు పద్ధతులుండినందున నా దేశముల నాట్యకళాచరిత్రమును ముందుగ వివరించెదను. ప్రస్తుతము మనకళావికాసమునకు పాశ్చాత్య ఆదర్శము లొకప్రక్కను గీర్వాణసంప్రదాయము లొకప్రక్కను ప్రేరకములై యున్నవి. నాట్యకళకు సంబంధించిన నాటక కవిత్వము అభినయము రంగసిరజనము మున్నగు విషయములలో నానాదేశముల మహామహులు త్రొక్కిన మార్గములను చూపి వీరిపోలికన మనయాంధ్రులు చేయుచున్న ప్రయత్నములను అభినందించుటయే నా యుద్దేశ్యము.

నాట్యప్రపంచమును సింహావలోకనముగ నాంధ్రుల కెరుకపరచుటయే నాయుద్దేశ్యము భావిప్రయత్నముల శాసించు లక్షణమేర్పరచు యుద్దేశ్యము నాకులేదు. కళాస్వరూపమునకు నవ్యకళారచనయే విమర్శన మగునుగాని లక్షణఖండ

నము కళోత్పత్తి మార్గముల జూవనేరదు. పరచింతతో కగు జ్ఞానముద్రికై దివ్యస్ఫురణ లందికొనుచు జన్మపరంపరలలో ప్రోగువడిన నిజసంస్కార దీప్తిచే నిహాలోకానుభవముల రస వ్యాఖ్యాన మొనర్చుచు కావ్యసాధనముచే ముముక్షులగు వారి దివ్యప్రతిభా ప్రభావమును జూచి యచ్చెరువొంది వారి సూచనలందికొని మన చిత్తవృత్తుల సంస్కరించుకొని యానం దింప నుచిత మగునేగాని ప్రకృతియందును కళాప్రపంచమం దును గోచరించెడి రసానుభవసంతుష్టిలో మైమరచి స్థిరధీ మతులమై గేల్మోడ్చి నిశ్శబ్దభక్తి ప్రణామముల నాచరింప వగునే గాని లక్షణామానదండముల గైకొని కళోపాసకుల రసయోగసాగరమును గొలువ యత్నింపవచ్చునా? అభినంద నమే ఆత్మసమర్పణమే కవిబ్రహ్మకుచ్చితమగు సన్మానము కాని లచ్చనపుపిచ్చికూతల పదినేర్చి కళాప్రపంచమును శాసింప సమకట్టెడి బుద్ధిలేమిని సైరింపవచ్చునే? వ్యక్తిప్రభావము కళాస్వాతంత్ర్యము ఇవియే పూజ్యాంశములు.





# ఆట మొలకలు

తొల్లి యనాగరకజాతులలో గ్రామదేవతల గొలచు సందర్భములందు, ఆయాగుంపులలోని, జనులు తమ దేవతల క్రూర, వీర స్వభావములను ప్రకటించురీతిగ బాడుచు చిందులిడు వాడుకలుండెను. మును మొదలు మానవులు దైవమునొక క్రూరప్రభావపూరితునిగ నూహించి పిడుగులు తుపానులు, నిప్పు నీటి భయములు జాడ్యములు మున్నగు విపత్తుల గలిగింపు ఘోరమూర్తిగ నెంచుచుండిరి. ఇట్టిదేవతల నుపాసించు పద్ధతులలో ప్రజలు తమ భావానుగుణ్యమగు నభినయమొనర్చుచుండిరి. మనదేశములో గ్రామదేవతల జాతరలందు గొల్లనటులు వేసెడిగంతులు/కొంతవరకు తొల్లిటి నాట్యరూపమును చూపించుచున్నవి. దేవతారాధనకాలములందేగాక, వైరుల బోర వెడలునపుడును, వివాహములు అపరకర్మలు మున్నగుసంధర్భములందును, ప్రాచీనమానవజాతులు సందర్భోచితమగు నృత్తగీతములో, బలుభంగుల చిందులిడుచు గెంతుచు.

దుముకుచు నాడుచుండిరి. ఇందున మొదట ఎవరి యిష్టము వచ్చినట్లు వారు చిందివుచు ఆవల నొక్కనాయకుని నేతృత్వమున వరుసలుదీరి పూర్వాహ్ణక్రమమున నాడనేర్చిరి. ఇట్టినేర్పు తెరువున తాళలయాక్రియములు ఏర్పడినవి. కథానాయకుడొకడుండి ముక్కలందించుచు కార్యభారమును వహించుటయు, మిగిలిన మేళగాండ్రు నాయకునిపలుకలలో గొన్నిటిను చ్చరించుచు నృత్తావర్తములు సలుపుటయు నేర్పడినది. తరువాత కాలక్రమమున మనుష్యుల వైవిక భావములు స్వాధుత్వమొంది దేవతలుకూర్కకార్య ప్రేరకులుకారనియు, జీవరాసుల సుఖస్థితి నభిలషించు ప్రాణయన్వ పులయు గుర్తించిన వెనుక నా ప్రాణయ సద్గుణావాసాసి నభితించు గీతికలు, నృత్యములు, ఆంగికాభినయములు సేయు భజన సమాజములు ఏర్పడెను. వీనిలోకూడ నొకడు ప్రధానుడై సూత్రధారియై మిగిలినవారిని నడిపించి యాడించు వాడుక స్థిరపడెను. వీరును మును మొదలు తామారాధించు దేవతల గుణాభివర్ణనము కథారూపముగ గావించుచుండిరి. ప్రధాననటుడు కథ సెప్పుటయు మిగిలిన వాంగు చరణముల ననువదించుటయు జరుగుచుండెను. కొన్ని సందర్భములలో వినువారి పరాకుకొరకు "అప్పుడేమన్నాడయ్యా సాసారాయాడు!" అనురీతి ప్రధాననటుడే సంబోధక వాక్యముల హెచ్చరించుటయు, కథావేశమున ప్రధాననటుడు తావర్ణించు దేవతాచేష్టల తనయందారోపించుకొని వానివలె రసభావోద్రేక మనుభవించుచు వానిచేష్టల నభినయించు వాడుక లేర్పడెను. కుశలవులు రామాయణ మహాకావ్యమును సుస్వరముతో రామాధ్వర సభాంగణమున నుచ్చరించినపుడే

నాటకకళ ప్రారంభమైనది. హోమరుమహర్షి రచించిన యవన పురాణములను దేవతా మందిరంబులకడ పదిమంది సుగాత్రు లుచ్చరించినపుడే పాశ్చాత్య నాటకబీజము లేర్పడినవి. కాని యిందులో మేళగాండ్రలో నొకడు ప్రధానుడై తానభివర్ణించు పాత్రిస్వభావమును అంగీకాహార్య రీతులతో ప్రకటింప మొదలిడిన సుముహూర్తమే నిజమైన నాట్యకళా బీజ మేర్పరచెనని చెప్పవచ్చును. ఇందువలన నాట్యకళకు సంబంధించిన వాచకము పద్యము, గీతము, నృత్యము, వివిధ దేశములలో, దేవతారాధన పారవశ్యమున సహజముగ జనియించి, యప్పటప్పటి నాగరిక పరిణామ మనుసరించి, వికసించి, పలుతెరంగుల రూపక రూపముల దాల్చెనని చెప్పవచ్చును. దేవతారాధనమందు, దేవోత్సవములందు, చాలవరకు ప్రాచీననాటకము లాడబడుచుండెను. అందులకే అవి జనించినవి. పూర్వము సమస్త దేశములలో లౌకిక విహారార్థము భూభుజ శ్రీమంతుల తృప్తికొరకు శిల్పచిత్రములు పద్యకావ్యములు నాటకాది లలితకళలు విస్తరించు వాడుక లేదు. దేవతానిలయమే తదుత్సవములే సర్వకళలకును నిలయమై ప్రేరకమై, దేవతారాధనమే ఫలితమై యొప్పుచుండెను. పాశ్చాత్య నాటక మాతృక లేర్పరచిన యవనసీమలందును భారతభూములందును వసంతోత్సవ సందర్భములందు తాగి మైమరచి కోడెగాండ్రతో వనితలు వనవిహారము సలుపు చైత్రవినోదములుగ కొన్ని నాటకము లుదయించినవి. మరికొన్ని వీరపూజావకాశములందును సాధుకూర్ర దేవతారాధనములందును జనియించినవి. ఎట్టులైనను నాటకములు దేవతాపూజకు సం

బంధించి తొల్లిటి మోటు చిందులనుండి, పురాణ పాఠకుల నుండి, వీరకథకులనుండి, భజన మేళములనుండి, పచ్చని కాటి కొంపములలో నామనివిరిపూత లుల్లము సందడింప కామినీ దృగ్మాలికల దొడవుదీర్చి విచ్చలవిడి చిందులిడు గొల్లగంతుల నుండియు, రూపకరీతు లేర్పడెననుమాట నిజము.

తొల్లిటి యనాగరికజాతులు ప్రకృతిలోని క్రూరభీకర మహాశక్తుల కచ్చెరువొంది వాని పూజించుటయేగాక జంతు జాలమును, భీకరజీవరాసులను, వననదీశిలాసాగర రూపము లను, ఆరాధించు స్వభావములవడినవారైరి. వారి దేవతా రాధనమందు తాము భావించిన భీకరజంతు రూపముల యా కృతిని పొంద నిచ్చగించుచుండిరి. అనాగరిక జాతులలో దేవునికన్న దివ్యప్రణయ మూర్తులుకన్న దయ్యపుకరుకు రూపులే ప్రజలగౌరవ మందుకొనుచుండెను. ఆనాటి వైద్యు లు, వేత్తలు, ప్రధానముగ, భూతస్వరూపములదాల్చి వ్యాఘ్ర పక్షిపన్నగాది వికృతభీకర వేషములలో తమయుద్యోగమును జరుపుచు మంత్రచికిత్సల లొనర్చుచుండిరి. వీరే ఆనాటి పురోహితులు, ప్రజానేతలు, మహర్షులు, ప్రభువులు, వీరు ధరియించిన జంతుస్వరూప నిర్ణాయకములగు, తొడవులు, పచ్చడములు, ముఖములు తరువాతి నాటక భూమికలకు మాతృకలై వెలయుచున్నవి. ఆవల నిట్టిరూపులు ప్రహసన ములందు మాత్రమే ధరింపబడుచుండెను. ఇప్పుడు ఆంజ నేయులు, జాంబవంతులు, దశావతారములు, మున్నగు పాత్రల రూపుకొరకు మాత్రమే నటులు జంతురూపముల ధరించుచున్నారు. కాని తొలుదొల్త నృత్తమేళములలోని

పొంగు గాండ్రించెదరు జంతుపిశాచ దేవతారూపముల గూర్చి తమకుండు యభిప్రాయముల వెలువ విక్రుతభూమికల దాల్చుచుండిరి.

మానవుడు తొల్లి చెట్లపై కోతివలె చిన్న నివాసమేర్పరచుకొని స్త్రీ, పురుషులు ఎవరినిలయములో వారలే యొంటరిగ నివశించుచుండిరి. ఆవల స్త్రీ పురుషులు ఒక్కచోట నివసించి బిడ్డలసాకుకొనెడి యాచార మేర్పడినది. శాకినీనివాసము బవీడి కొండబిలములలో సకుటుంబముగ నివసించుచుండిరి. ఆవాడు పిచ్చలవిడియై పట్టపగ్గములులేక దిరుగుచుండిన క్రూరవన్యమృగముల సాధించుటకును, శత్రుమానవుల దాడినాపుకొనుటకును యీకుటుంబములు కొన్నికలసి గుంపులుగాజేరి మానవసంఘ మనుదాని నేర్పరచినవి. ఈసంఘము పశువులసాధుపరచి భూములనాక్రమించి యడవులద్రుంచి కుటీరములనిర్మించి, నదీకాసారతీరములందు గ్రామనివాసము లేర్పరచుకొనెను. ఇట్టిగ్రామములకు నడుమ నొకచౌకులో మట్టిదిబ్బను వేర్చి దానిపై నొక ఛాయాతరువు మొలపించి యచ్చట తమదేవతను నిలపి తమనిత్యవ్యవహారములను లౌకికసమావేశములను దేవతారాధనమునను, బలిదానములను సంఘముగగూడిజరుపుచుండిరి. కాలక్రమమున నీబోధితరుస్థానమున నొక మంటపము వెలసెను. ఈమంటపమే క్రమముగ నశేషశిల్పచాతుర్యము ఉట్టిపడు ప్రాచీనదేవతామందిరము లాయెను. ప్రజలు యాత్రావున గుంపుగూడుకతన నీమంటపమును దేవళమును చుట్టియుండు విశాలప్రదేశమందు విపణికుటీరము లేర్పడెను. ఇవ్విధముగ మంటపము, దానియెదుట విశాలమైన బహుజన సమావేశ

మున సుచితమైన బయలు, దాని వెనుక విపణి సోపానములు ప్రతిగ్రామమందును ఏర్పడెను. మంటపము కొంచె మెత్తుగను, బయలు పల్లముగను సోపానములు క్రమోన్నత్య మొందుచును ప్రాచీననాటక సభామాతృకల గూర్చుచుండెను. యవనులు, రోమకులు, తరువాతి శిల్పిచాతుర్యముతో లక్షప్రేక్షకులు కూర్చుండిచూచు విశాలావకాశముతో నిర్మించిన మహానాట్య రంగములు నిజసత్వమున ప్రాచీన గ్రామకూటముల పంపిణి ననుసరించియే వికసించినవి. పదిమంది మెచ్చిన పాట, ఆద రించిన ఆట, సంతసించిన కైతలు, యచ్చెరువందిన తొడవులు, మించిన సభారంగములు, గొప్పవిగ దలచబడి, తరువాతివారి కాదర్శప్రాయము లగుచుండెను. ఇట్టివాని సామాన్య లక్ష ణములు కొందరచే గూర్పబడెను. వుండిన మంచిననుసరించు వినయ మొకవంకను, క్రొత్తదానులత్రొక్కు స్వాతంత్ర్య సం చార మొకవంకను మానవమానసమును చంచలించుచు ఆచా రము ఆదర్శము అను రెండు మానసవ్యాపారముల నేర్పరచి నవి. వీనిచే నాట్యలక్షణము లేర్పడినవి.

ఇవ్విధమున నాట్యోత్పత్తి, సూత్రధారుడు, మేళ గాండ్రు, భూమికలు, నాట్యరంగము, నృత్యగీతవాచకాభిన య సహితమగు నాటకములు, లక్షణములు, తొలుదొల్త నేవిధమున జనియించినదియు చెప్పియున్నాము. పై ప్రకరణం బున నీనాడు పాశ్చాత్య దేశములలో నిలచియున్న రూపక విశేషముల దెలియపరచెదను.






## టా్రజెడీ—మహానాటకము.

ఆంధ్రవిమర్శకులు కొందరు టా్రజెడీ యను పదమునకు కష్టాంతరముగ బరిణమించెడి విషాదనాటకము అనునామమిడియున్నారు. కాని పాశ్చాత్యనాటక లక్షణముల బరికించి చూచినయెడల దీనికి మహానాటక మనునామ ముచితముగ దోచుచున్నది. యవనులు నీయర్థముననే దీని నుద్దేశించి యుందురు.

టా్రజెడీ యను పదమునకు వ్యుత్పత్తి అర్థము మేకపాట. ఫలసస్యవనారామముల యధిదేవతయై యుత్సాహవిలాసరీతులలో గొలవబడుచుండిన బేకసు లేక డయోనిసస్ అను దేవత నారాధించు సమయమున పాడబడిన భావగీతములకీపేరు తొల్లిట జెందియుండెను. దీనికీపేరు ఏలరావలయునో? తెలియక పాశ్చాత్యలాక్షణికులచ్చెరువొందుచున్నారు. మేకలు చెట్లనుద్రుంచి తినును. పూర్వకాలమున మేకల

మంద లసంఖ్యాకముగ నటవీనికుంజములనుండి పంటచేలపై దాడివచ్చి సస్యఫలమెల్ల పీల్చిపోవుచుండెను. ఈమేకలదాడి కోర్వజాలక తమ భూముల విడచి దేశాంతరములకేగిన జాతుల యుదంతములున్నవి. ఈ కారణమున సస్యాధినాథుని యారాధించు సమయములలో సస్యవిరోధియగు మేకను బలియిచ్చుచు పదుగురుగూడి నృత్యగీతములతో నుచ్చరించిన వాచకము మేకపాట యనబరగెనని కొందరూహించుచున్నారు. కొందరి మతములో యీపాటపాడెడి నటమండలి మేకచర్మముల బొమ్మ తొడవుల దాల్చి యభినయించిరనియు వీరొసంగిన నృత్యగీతికా వినోదమునకు మేకలు పారితోషికముగ నొసంగబడెననియు నందుచేత నీవినోదమునకు మేకపాట యను పేరు కలిగినదనియు దెలుచున్నది.

కాని, ట్రాజెడీకి మేకపాట యనుటకుబదులు గోపగీతమను పేరొసంగుట నాయభిమతము. ప్రాచీనార్యులెల్లరు గోపాలవృత్తి నవలంబించి ( నదీకాసారతీరములందు ) దుర్గమారణ్యముల నరికి పంటభూముల గల్పించి తొల్లిట నేకాంతవనవాసముల నేర్పరచుకొని నిశాసమయములందు మంటలంటించి చుట్టునుగుమిగూడి పదిమందిగ వీరచరితలను, దేవతల చేతలను శృంగారవిలాస గీతములను పాడుచుండిరి. గ్రామదేవతల జాతరలందు యిప్పటికిని పశుకాపరులు తామారాధించు దేవతయొక్క చరిత్రను ప్రభావమును చేష్టలను దెల్పు గీతనృత్యములతో చిందులిడుచుందురు. ఈగొల్ల చిందులే నాటకముల తొల్లిటి విత్తనములని నమ్మదగును. పైవిమర్శకు తెంచిన వ్యుత్పత్తియే వాస్తవమైనయెడల ట్రాజెడీయందు

వసంతోత్సవ సంతోషానుకూలమగు విలాసగీతములే, వీని పరిణామమగు లలితశృంగార కథాంశములే తరువాత నాటకములందు ముఖ్యాంశములుగ నేర్పడియుండును. కాని పరిణత ట్రాజెడీ నాటకములందు దేవతాచరిత్రములు ముఖ్యముగ దేవతల నీచక్రూరమర్యాదలు, వీరుల గాథలు మిక్కుటముగ జేరియుండుటచే ట్రాజెడీ నేను నిర్వచించిన గోపగీతములు గొల్లచిందులునుండి పరిణమించెనని యూహించు టెక్కువ యర్థవాహకముగ నగుపడుచున్నది.

పాశ్చాత్యలక్షణ విధాతయగు యారిస్టాటులు ట్రాజెడీ నిట్లు నిర్వచించియున్నాడు. ఇందు అర్థగాంభీర్య మొప్పుచు సంపూర్ణమై తగు విశాలము గలిగి కరుణాభయానక రసముల నుద్దీపించుచు ప్రేక్షకుల మనోవృత్తులను దుశ్చింతనుండి సన్మార్గములకు మరలింపగల యుదారచరిత్రి మితివృత్తమై యుండవలెను. మానవ మానసమునకు సహజమై సామాన్యమై సర్వజనానుభవమున జేరియుండు వృత్తులగూర్చి ట్రాజెడీ యందలి కథాంశము భావపరిక్షోప ముదయింప జేయవలెను. తరువాత కథాపరిణామమును చమత్కారముగ రసవంతముగ రచియించి ప్రేక్షకుల భావోద్రేకమును చల్లవరచి యిందు మూలముగ వారి మనోవృత్తుల సంస్కరించుటకు మహానాటక రచయితలు యత్నింపవలయును. అనగా ట్రాజెడీల యుపయోగము మనస్సంస్కారమేగాని చిత్తశుద్ధి గలిగించుటయే గాని మానవజీవితము నొక దుఃఖసాగరముగ జూపుటకాదు.

ఇది యవన మహాకవుల నాటకాదర్శము. ఇటీవలి ట్రాజెడి కవులు విషాదకరమగు నవస్థల జిత్రించి భావవీచికా

ప్రభంజనాస్ఫాటమును జెలరేఁపి నిరాశానిర్వేద మహాంబుధి యందు ప్రేక్షకులచిత్త మల్లాడునట్లు విపరీత విషాదసందర్భముల గల్పించి ట్రాజెడీ యనుపదమునకు కష్టాంతనాటకమను మహాపవాద మేర్పరచిరి.

కాని యిది యనవమహానాటకముల లక్షణము కాదు. అవి పాపపుణ్యములవలనగలుగు సుఖదుఃఖానుభవముల నిరూపించుచు మానవ జీవితస్థితులు పురుషప్రయత్నము మీఁదికన్న విధివిధానముపై నెక్కువ నాధారపడి యుండునని చూపినను, జగమంతయు దయాధర్మశీలుఁడై సర్వసమత్వమున నేలు జగదీశుఁడుండు నను భక్తివిశ్వాసము నంకురింపఁ జేయుచుండెను. విధిగతులు వక్రవైపరీత్యముల దురవగాహమగు వింత తెరవుల గదలించుచున్నను, విధికూడ జగద్ధర్మములగు సత్యాసత్యముల ననుసరించి జరించునని మానవుని సుఖదుఃఖములు కర్మనిర్మితములై గలుగునవియు విశదీకరించుచుండెను.

కర్మనిబద్ధులై జననాంతర సంస్కార సంజనితములగు నైజములొప్పను, సాంఘిక మర్యాదలందు జిక్కుకొని, నరుని జీవితము కొన్ని దాటరాని యాతంకములం దిమిడి యుండును. మనోవృత్తులు ఆశలు అభిమానములు సంకల్పములు నరుని మానసారామములందు పలుపక్షులయి మొగ్గలిడి వింతదారుల నడిపించుచుండును. వీనికిని పైజెప్పిన నిబంధములకును కొన్ని సమయములలో పెద్దపోరాట మేర్పడవచ్చును. ఇందుచే గలుగు పోరాటమే మహానాటకముల ప్రధానాంశమై యున్నది. ఉత్తరరామ చరిత్రలో రాముడు రాచమర్యాదలకు కట్టువడి లోకారాధన జీవనవ్రత మవలంబింప వలసివచ్చెను. చిరకా

మై యుండవలెను. వాని సమర్పణము మహాత్యాగమును సూచింపవలెను. ఆదర్శము గొప్పదై యుండవలెను. వ్యక్తి వృత్తులకును, వానికి విరోధముగ నాచరించెడి సందర్భముల కును అనివార్యవిరోధ సంఘట్టన మేర్పడవలెను. ఇట్టి సందర్భములో ప్రేక్షకులకు, బాహ్యశక్తుల బలమహిమలం దాదరణ గౌరవభావము లంకురించి వ్యక్తిసంకల్పమును మ్రింగివైచు పరశక్తులీవిశ్వమున గలవను భక్తివినమ్రమని ర్వేద మేర్పడును. మరియు, వీని నిరాఘాట ప్రభావమున జిక్కి సన్నగిలిన నాయకునిపై కరుణాపరివృత్తు లేర్పడును. ఇట్టి కథాపోషణముండి నపుడే ట్రాజెడీ నిజసత్వమున రాజిల్లగలదు.

" ఆదిశ్రీసతికొప్పుపై — నిత్యమర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరంబుంట మేల్గాదే రాజ్యము నిజ్యము౯ సతతమే కాయంబు నాపాయమే ? ' అను నట్టి విశాలాదర్శకులతో ట్రాజెడీయుండలి స్వార్థత్యాగ మేర్పడవలెను.

ఇడుములజిక్కి భగ్నాశుడై తల్లడిల్లెడి జీవుని, వైరాగ్యమవలంబించి, విధి పరితాపమునకు ప్రణమిల్లి సంతసింపుమని బోధించుటయేనా? మహానాటకము లొసంగెడి యుపదేశము? ఇట్లు చేయుటవలన మానవునినిర్వేదాభ్యాసమ ధ్వని గావించి, విధి విధానముల కత్యంతప్రాభవమేర్పరచి, పురుషప్రయత్నమును, నిరుత్సాహపరచెడి, దుర్నీతి సిద్ధింపదా? అను శంక తలయెత్తకుండునా? కాని క్రియాక్రమములో ట్రాజెడీవలన నిట్టి దురుపదేశములు సంఘటింపవు. ప్రేమ, కరుణ, సానుభూతి, దయాగౌరవసద్భావములు, మానవజాతియొక్క సామాన్య

కష్ట నిష్ఠురములగూర్చిన విశాలపర్యాలోచనము, జీవిత ధర్మముల స్వభావానుభవము, చక్కగ నేర్పడి, ప్రేక్షకుల మానసమందొక నవ్యవిజ్ఞానతేజమును వెలిగింపజేయును. పరచింత, విరాగము, భక్తిప్రణయపూర్వకమగు నాత్మసమర్పణబుద్ధి, యున్నతజీవితాదర్శముల గుర్తించి తత్సంపాదక సాధనక్రమము నవలంబించెడి యుత్సాహము, మన జీవితముల సంస్కరించి యుత్తమ సత్పథంబుల నడపించు చిత్తశుద్ధియు, మహానాటక సందర్శనంబున సిద్ధింపగలవు. ఇట్టి సదాదర్శముల మొలకెత్తజేసి, "సంసారం సాగరం దుఃఖ" మని చిత్రించి చూపియు, భక్తిజ్ఞాన వైరాగ్యముల దివ్యభావోదయంబును గలుగింపగలవియే నిజమైన ట్రాజడీలు. అంతియేకాని, వీరభీభత్సభయానకతరంగముల నుక్కిరి బిక్కిరిగ ముంచి, ప్రేక్షకమానసమందు అపస్మారనిర్వేద మహాందోళన మేర్పరచి పంపెడి యీనాటి విషాదాంత నాటకములు నిజమగు ట్రాజెడీలుకావు. కోలాచలము శ్రీనివాసరావుగారి రామరాజ్యవినాశనము, ఘోరబ్రుస్తుములకథ, బొబ్బిలిచరిత్రము ట్రాజెడీలనుపించుకొనవు. బొబ్బిలి చితికిపోయినది. వెలమలచురుకు మెచ్చినాము. కాని మనకెట్టి నీతియుగలుగలేదు.

చిత్తసంస్కారము ట్రాజెడీయొక్క ప్రధానోపయోగము. మానవకోటి కంతకును దేశకాలావస్థాది నియమములు లొల్లక, సర్వదా సుఖదాయకములై యుపకరించెడి యాచారమర్యాదలే, ధర్మములనజెల్లును. మానవజాతియొక్క చిరంతన లోకానుభవమునుండి, స్వజనామోదమున నీధర్మములూహింపబడినవి. ఈ సామాన్యధర్మ పరిజ్ఞానము ప్రతి మా

నవునియందును భావస్థిరమై పాదుకొనియుండును. ఇది కాదం మనమేని, మానవులు తమకు మేలెద్దియో? కీడెద్దియో? తెలిసి కొనలేదనియే చెప్పవలసిన వ్యాఘాతమేర్పడును. నాగరిక సంస్కారమొందిన ప్రజాసంఘములు, మానవమానసమునకు నిరాశా దౌర్బల్య మేర్పరచు కళారీతుల నామోదించి యవలంబింపజాలవు. యిట్టి కళావైఖరులు ఆత్మవినాశనమునకు హేతుభూతము లగును. మానస సంకల్పములు దేహస్వభావమున జేసి యీబాధల ననుభవించి భంగపడుననియు, నాత్మప్రబోధ చంద్రికలీ మానసతమిస్రమును బేధించు చల్లనివెలుగు లీనగలవనియు, నాటక కథాంశములు నిదర్శించినచో, ప్రేక్షకులకు తగినంత చిత్తసంస్కార మేర్పడుననియే నమ్మవచ్చును.

## కామెడీ

ఈ దేశము ప్రస్తుతమందు కళ్యాణాంతనాటకములను హాస్యసంగీత శృంగార ప్రధానమైన ప్రకరణములు ప్రహసనములు మొదలగు లలితరూపకములు సూచించుచున్నది.

దీని వ్యుత్పత్తి అర్థము విలాసగీతము, ద్రాక్షఫలములు పండి ప్రాకారసము పిండబడు పల్లెటిపండుగ దినములందు జరిగెడి యూరేగింపుల కార్యక్రమమునుండి కామెడీ జనించినది. తొల్లిటి యవనకామెడీ B. C. 575 లో రచియింపబడెను. మోటవేళాకోళములు నిందాగర్భితమగు పరిహాసము దీని ముఖ్యలక్షణముగ నుండెను.

పెరిక్లీసు కాలములో విరోధినాయకుల బరిహాసించి నిందించుటకు కామెడీ లుపయోగింపబడెను. ప్రాచీన పహా

సనంబులయందు వ్యక్తులను మిక్కిలి వెక్కిరించుటయు వారి వ్యక్తిలోపములను దూషించుటయు దుర్భరవికాస మొందియుండెను. ఆరిస్టాఫనీసు ప్రాచీన పరిహాసనరచయితలలో చివరవాఁడై హాస్యరూపక విరచనమందు యీ నాటికినీ నిస్తుల్యమగు ప్రతిభాసమృద్ధిని చూపియున్నాడు. కాని B. C. 404 లో వ్యక్తుల వెక్కిరింపగూడదను రాజనిబంధన మేర్పడినందున యీ రిస్టాఫనీసువ్యక్తుల బరిహాసించుటమాని హాస్యప్రసంగములలో ధర్మములను ఆచారములను సాంఘిక సమస్యలను విమర్శింపదొడగెను. ఈ విధముగ మానవమనోవ్యాపారములందు దేశకాల మతాభిమానములచే గలిగెడి లోపములను సంస్కరించు నుద్దేశ్యము కామెడీల ప్రధానతత్వ మాయెను. ఇట్టి విమర్శక హాస్యప్రకరణములు యవనరూపక చారిత్రమందు మాధ్యమిక ప్రహసనంబు లని పేర్వడసినది. మబ్బుపింజెలు వేదాంతుల నిరాధార తత్వోపదేశముల బరిహాసించునట్లును కందిరీగలు యవనయువకుల ప్రణయకలహముల కలిగి కుట్టినట్లును యవనమహానాటకముల జీర్ణాలాపములను కప్పలుబెకబెకలాడి వెక్కిరించునట్లును తత్వోపదేశ మొసర్చు పులుగుల వింతకథలును యారిస్టాపనీసు రచించిన ప్రహసనములలో వన్నెకెక్కినవి. ఈ పద్ధతి ననేకు లవలంబించిరి. రోమకకవిశేఖరులగు ప్లాటసు, టెరెన్సు, యవనుల ప్రాచీన మాధ్యమిక ప్రహసనంబుల ననుసరించియు యిటలీ జానపదంబుల స్థానికవినోదముగ నుదయించిన ఆర్టిలా పరిహాసన మనుసరించియు నమూల్యహాస్యరూపకముల రచించిరి.

సంఘాచారములను లేతగ బరిహాసింపు హాస్యరూపక

ములు B. C. 300 ల ప్రాంతముల మినాండరు యనుయవన కవిచే నారంభింపబడినవి. ఇందుకొంత ఆటకోలితనము కొంత సమపదేశములోసంగెడి దేశికగాంభీర్యము మిశ్రితమైయుగు పడును. ట్రాజెడీలందు విధిప్రభావముచే నాయకుని సంకల్పముఖ్య పురుషప్రయత్నములు భగ్నమగునట్లు నవ్యప్రహసనమందు కాకతాళీయముగ సంభవించెడి లౌకిక ప్రమాదములచె కథానాయకుల కోర్కెలడ్డముగ తిరుగుచుండును. కన్యాశుల్కములో గిరీశమునకు సౌజన్యారావుగారి ఎదుట జరిగిన ఆశాభంగము, నవీనకామెడీల కథాపరిణామమునకుదాహరణము. ఇందు మధురవాణి కాకతాళీయముగ ననుదెంచిన లౌకికభంగపాటు కథావసానమునకు కారణమైనది. మా జీవితావస్థలందు, కార్యకారణ సామంజస్యమొప్పని వెఱ్ఱిశల ప్రులను తేలికగ బరిహాసించు తలంపు వీనియం దగుపడును. మినాండరు రచియించిన ప్రహసనములలో కొన్నిటి జీర్ణఖండములు మాత్రమే మనకు లభించినవి. ప్లాటసు అనుకరణములలో వీని రచనరీతు లగుపడును. ప్లాటసు అవలంబించిన పాత్రనామములు యితివృత్తములు యవనమాతృకల ననుసరించినను పాత్రస్వభావ విన్యాసమంతయు కథాసందర్భములన్నియు వీనికి సమకాలికమగు రోమకసంఘ స్థితినుండియే గ్రహింపబడినవి. కాని రోమకహాస్యకులు తమ రచనలకు పలుకు మెరపుల సనివడి గలిగింపలేదు. అందుచే లాటినుభాషలో హాస్యపదజాలమంతగ నభివృద్ధి జెందలేదు.

17, 18, వ శతాబ్దములలో ఫ్రెంచి మహాకవి మాల్యేరు, ఆంగ్లకవి కాంగ్రీవు హాస్యనాటకములకు నవ్యసంస్కార

మొసంగి కథాకల్పనమందును పలుకుసొబగులందును యూరిప్టా ఫనీసునాటి యున్నతకళాసిద్ధి గ్రమ్మరనేర్పరచిరి. జీవితములోని హాస్యసందర్భముల గుర్తించుటయే కాక నిష్కల్మషమగు అసూయారహితమగు ద్వేషాభిమాన విహీనమగు నిరపాయ హాస్యవినోదమును గల్పించుటయేగాక వెక్కిరింపబడిన జీవితావస్థలయందు ఉదారమగు నౌదాసీన్యము పరిహాసాస్పదములగు పాత్రిలందు కరుణానుకంపము, సాంఘిక సమస్యలను జీవితావస్థలను సంస్కరణోద్దేశ్యములతో బరికించు సమదృష్టిని వీరిహాస్యరూపకము లేర్పరచినవి. సాత్త్విక పరిహాసము నవ్వించు దయానుకంపములతో చిత్రింపగల పరిహాసనవైఖరులు మాల్యేరు మతిప్రభావమున నుదయించినవి.

## మిరకిలు నాటకములు

( మహిమాప్రదర్శక రూపకములు )

యూరపులోని మతాచార్యులు జనసామాన్యమున క్రైస్తవమతము వ్యాపింపజేయుటకు యాడించిన నాటకములలో మిస్టరీలు, మిరకెలులు ముఖ్యము. వీనియందు క్రైస్తవమతోద్ధారకులగు మహాత్ముల మహిమలు జీవచరిత్రములు ప్రదర్శింపబడెను. వీని రచన పారసీక నాటకమగు హాస్సాను హుస్సేనును పోలియుండును.

మిస్టరీలకు అర్చకరూపకములను నామమెంతయు నుచితమగుచున్నది. ఇందు బైబులుకథలు చూపబడుచుండెను.

జగదాదినుండి క్రీస్తుమరణమువరకు జరిగిన చరిత్రము, తగు వేషములతో మొదట క్రైస్తవాలయములందును తరువాత గ్రామములందును ఆడబడెను. నీతిబోధకములగు మొరాలిటీ నాటకములు కూడా యిటులనే మతసంబంధమున నుద్భవించి జనబాహుళ్యమునకు నాట్యకళయందభిరుచి యేర్పరచి నవ్య నాటక వికాసమునకు దోడ్పడినవి.

| | |
|---|---|
| Miracle Plays— | మహిమారూపకములు |
| Mysteries— | అద్భుతరూపకములు |
| Moralities— | నీతి రూపకములు |

ఈ రకపు మతవ్యాపక నాటకములు 1100—1500 వరకు యూరపులోని నానా దేశములందును ఆడబడుచుండెను. వీనిమీదనుండి తప్పిన ఎదురుబాటులో నవ్యనాటక స్వరూపము లేర్పడినవి. వీనిలో తొల్లి మతాచార్యులే నభినయించుచుండిరి. తరువాత జనసమూహము వీనినవలంబించి యాడుచు తమకిచ్చవచ్చిన నీచశృంగారహాస్య సందర్భముల జేర్చుటచే మతాచార్యులిందున పాల్గొనకూడదను శాసనమేర్పడినది.

## ఆ పి రా

గానప్రధానమైన నాటకము.

ఇందలి సంభాషణ పద్యమయముగ నుండి జంత్రగాత్రములతో పాడబడును. భావగీతములు, నృత్యము, ముఖ్యాంగములుగ నుండును. 1532 వ సంవత్సరములో ఫ్లారెన్సు నగరమున బార్డి యనువాడు ప్రాచీనయవన నాటకములలో

వచింపబడుచుండిన గేయోపన్యాసముల గ్రమ్మర నాట్యరంగమున జేర్పయత్నించెను. అప్పటికి వాడుకలో నుండిన గాన సంభాషణరీతు లితనికి రుచింపలేదు. కాని 1637 లో వేనీసునగరమున నాపెరా ప్రదర్శనాలయము నిర్మించువరకు బార్డి మాంటివెర్డిలచే పెంచబడు ఆపెరా జనబాహుళ్యమున కందలేను. తరువాత కావల్లీ, స్కార్లట్టీ, లుల్లీ, మొదలగు, యిటాలియా గాయకులు జంత్రసాధనము లెక్కువ ప్రవేశబెట్టి మట్లను, కీర్తనలను, రుచికరముగనల్లి నాట్యావస్థలను రమ్యముగగూర్చి ఆపెరా గేయరూపకములకు ప్రజామోదమును గలిగించిరి. లుల్లీ ఫ్రెంచిరాజ్య స్థానమున కరగి యచ్చటి జాతీయస్వభావానుకూలముగ ఫ్రెంచిభాష నైజసౌందర్యముట్టిపడునట్లు చక్కని ఆపెరాలను రచించి యాడించెను. వీనియందలి వాచకగీతములు నిరుపమానముగ నుండెను.

జర్మనీలో కీజరు యింగ్లాండులో పర్శలు అనేక ఆపిరా నాటకములను రచియుంచిరి. ఇంతలో హేండెలు అను జర్మనుగాయకుడు లండను పట్టణములో తన ఆపిరాలను ప్రదర్శించెను. తరువాత క్రమముగ ఆపిరాలగీతములు గానపద్ధతులు రంగసౌందర్యము పరిణతసుస్వరూపముల దాల్చుచు నితివృత్తములు కొంత నీతి బాహ్యతననుభవించెను. ఆపిరాల నీమములు, లక్షణములు, అసహ్యాకరముగ బరిణమించుచుండెను. ఈలోపమును వారించుటకు గ్లూకు అను ఆస్ట్రియా దేశీయుడు 1762 లో యూరిడిసు ఆపిరాను ప్రదర్శించెను. దీనిలో అదివరకుండిన లక్షణములన్నియు బోర్లద్రోయబడినవి. అంతకు ముందు సంగీతము ప్రధానమై భావాభినయము

నాట్యలక్షణములు ఆపిరాయందు సన్నగిలినవి. ఈతడు అభినయము భావప్రకటనము ప్రధానముగ నొనర్చి సంగీతమును రసపుష్టిగలిగింపవలసినపట్ల నుపయోగించెను. ఈతని స్వతంత్రరచనము కొంత ప్రజాద్వేష మనుభవించినను యూరపులోని నాట్యకళాభిమాను లందరు వీనిపద్ధతు లవలంబించిరి. ఇటలీలో వర్డి మున్నగువారు గ్లక్కు చూపినదారిలో పెక్కు ఆపిరాలను రచించిరి. కాని ఇటలీభాష గానోచితమైయున్నను పైనిబంధనలవలన యిటాలీయాఆపిరాల సంగీతము, పూర్ణావకాశ మొందకుండెను.

ఆవల జర్మనీలో రిచ్చర్డువాగ్నరు అను మహాగాయకుడు గ్లక్కు నియమముల గారవించుచు సంగీతము కవిత్వము చిత్రశిల్పములు సమానముగ నుపయోగపడెడి నవ్యనాటకములు రచియింప సమకట్టెను. తన యాదర్శముల తెలుపు లక్షణ గ్రంథములుకూడ రచియించెను. ఈతని గేయరూపకములు లోకఖ్యాతినొందినవి. రిచ్చెర్డుస్ట్రాసు మున్నగువారు మరికొన్ని వన్నెలతికించిరి.

ఇటీవల రష్యను గాయకులు ఆపిరాను యెక్కువగ ప్రోత్సహించుచున్నారు. భావము శబ్దసౌందర్యము అభినయానకూలమగు నాట్యావస్థలు నవ్యరుచుల కనుకూలముగ వికసింపజేయ యత్నించుచున్నారు.

కామికుఆపిరా అను రూపకవిశేషమందు కథాంశము కళ్యాణాంతముగ పరిణమించుచు, సంభాషణ వాచకములో జరుగుచుండును. గిల్బర్టు సల్లివను మున్నగువారి ఆపిరాలు యిందున జేరినవి.

శృంగారాది రసముల బచ్చిగ వర్ణించుపట్టులు విశేష ముగగల ఫ్రెంచి ఆపిరా వాక్ విల్లి యను పేరుతో పిలువబడు చున్నది.

## మెలోడ్రామా.

### గేయరూపకము.

ఇది ఆపిరానుండి ఫ్రెంచి దేశమున దొలుదొల్త నేర్పర చబడినది. ఆపిరాలో కథావృత్తాంతమంతయు, పాటలతో మట్లతో గూడిన గీతవాచకసంభాషణరూపమున జరుపబడును. (Aria) ఏరియా యనబడు మట్లలో లయాప్రస్తరణము ప్రధానాంశముగ నుండును. రెసిటేటుపు అనబడు గీతవాచక ములో రాగమే ప్రధానము గాని లయాప్రకృతుల కట్టుబాటులు లేవు. ఆపిరా, మొదటినుండి తుదివరకు యిట్టి గానక్రమము లతో నడచు గేయరూపకమై యున్నది. మెలోడ్రామా యందు మామూలు నాటకములందలి వాచకమునకుతోడు కొన్ని పాటలు మట్లు జంత్రిసంగీతము చేర్చబడి నాటకము నకును, ఆపిరాకును, నడుమదారిని నడచుచున్నది. ఇందు వలన రూపకప్రదర్శనము జనబాహుళ్యమునకు యెక్కువ వినోదానందముల గూర్చుచు కొన్ని సందర్భములలో రసపోష ణయు భావప్రకోపము చక్కగ నేర్పరచుచున్నది. ధర్మవరం కృష్ణమాచార్యులుగారి గద్యపద్యగీతాత్మకములగు నాటకము లు మెలోడ్రామా తరగతిలో చేర్పదగును. ఈనాటి యాంధ్రరంగమున ప్రజారంజకములై బరగు నాటకములన్నియు నిట్టిస్వభావముగలవియే కాని మనప్రదర్శనములందు జంత్రోప కరణములు గాత్రిశోపకమును పూరించు అను కరణవాద్యము

లుగ నుపయోగపడుచు తక్కువ నేర్పరులచే వాయించబడు చున్నవి. ఆపిరా మెలోడ్రామాలయందు జంత్రీప్రకరణ ముల లలితపరిచారములు నిశ్శబ్దమగు ప్రశాంతరసావస్థలను నవసరంబుల నాట్యమాడెడి భావసంకీర్ణ రమణీయసందర్భము అను మానవగాత్రవాచకముల కలవిగాని రీతులలో నుత్పత్తి జేయును ప్రత్యేకభావసంజననప్రభావ మొప్పియుండును. తునవనాటకములలో వాద్యములు గాత్రమును మరుగుపరచి వాచకార్థసూచనల కడ్డుతగులుచు శ్రవణకఠోరమగు గడబిడ గందరగోళమును పుట్టించుచుండును. పాశ్చాత్యమెలోడ్రామ లలోని జంత్రివాద్యము లేతతలపులనీను సుకుమారభావప్రపంచమును గల్పించును. ఇట్టిభావసాగరతరంగములలో నటజన్యంబులు అనుకూలమగు సాత్త్వికఆంగికాభినయ మొనస్ఫచు భావానుకూలమగు లేతరంగుల మెరుపుదివ్వెల కమనీయ చంద్రికాలలితకాంతులలో రమ్యముగ నాడుచుందురు.

1728 లో యింగ్లాండునందు గే యనువాడు రచించిన Beggars opera యీ రకపు నాటకములలో మొదటిని. తరువాత 1775 లో ఫ్రెంచిదేశమున రూసో రచించిన, పిగ్మాలియను, ప్రసిద్ధివహించినది. ఆపిరాకు కొంతవాచకము చేర్చినందున కేవలరాగతాళపూరితమగు గేయరూపకములందుకన్న మెలోడ్రామాలో రసవత్కథాసందర్భముల విస్తరించెడి యవకాశము లేర్పడినవి. రసోద్దీపనము, భావప్రకోపనము ముఖ్యాంశములై సంగీత మించుక సన్నగిలెను. నవీనమెలోడ్రామాల యందు మహానాటకముల గభీరభావసంక్షోభములు గృహస్థసాంసారికమర్యాదల దెలుపు ప్రకరణముల లేతరసములు సాం

ఘిక ప్రహసనములందలి హాస్యస్ఫురణములు, అన్నియు చేవదీరి చిక్కగగూర్పబడిన రసతత్వమునిండియుండును. దేవతాపాత్రములు నీతిస క్తములై యుందురు. కథాంశమంగు నీతివిజయ మేర్పడవలెను. కాని, రసోదయము పటుత్వముగ నేర్పరచుటకు విభావానుభావములు పెల్లుబ్బి, యతిసయోక్తిగ వికృతపరిమితులతో విస్తరింపబడియుండును. అందు చేత నవ్యనాటకములందు అగుపడు సరససాత్వికకథాసూచన లిందు గానుపించవు. ఇందలి పాత్రలు ప్రాచీననీతిరూపకములందువలె, లక్షణనిబద్ధనిర్జీవస్వరూపముగ తత్వసంకేతములుగ నగుపడును. బాలనాయకుడొకడు, ముగ్ధనాయికయొకతె, క్రోవెక్కియూరినతండ్రి, టక్కరియొకడు, గ్రామ్యహాసకుడొకడు మున్నగు సామాన్యపాత్రలు, మెలోడ్రామాల లక్షణమనుసరించి యగుపడుచుందురు. పూర్వపు నీతిరూపకములందిట్టి పాత్రల రొమ్ముపై తామభినయించెడి వేషనామము పెద్దయచ్చరములతో లిఖయింపబడియుండెను. ఈనాడిట్టి వికృతపాత్రప్రకటనము లేనందున పాత్రల భూమికాసిన్నయము వారభినయించెడి కథాంశములకు తగినరంగవిరచనము ప్రధానమైయున్నవి ప్రతిమెలోడ్రామాలయందు యేదోయొక ఆశ్చర్యకరమగు రంగ ముండవలెను. మెలోడ్రామాలు రచించుకవులు మానవస్వభావమును విచిత్రమగు రసవజ్జీవితావస్థలను గుర్తెరిగి మిక్కిలి నేర్పుతో రచియించవలెను. ఇందుకువలయు గానపద్ధతులను రంగములను యేర్పరచువారుకూడ మిక్కిలి సమర్థులై యుండవలెను.

## పాంటొమైము

### మూకాభినయము.

వాచక ముచ్చరించకుండ, అవయవములను గదలించుచు, ముఖమందు స్వగతపరగతాభిప్రాయములను, ప్రకటించుచు, ఆంగికాభినయము మూకాభినయమనబడుచున్నది. యవన రోమకపట్టణములలోని నాట్యసభ లత్యంతవిశాలములై సహస్రానేకపరిషదాశ్రితములై యుండి పలుకులు వినరానికతన, వాచికాభినయము మాని, మూకాభినయ పద్ధతి నవలంబింప వలసి వచ్చెను. ఆకాలములో పాత్రధారులు ముఖావగుంఠనముల ( masks ) ధరించినందున ముఖముద్రలందు భావప్రకటన మొనర్చు అవకాశము లంతగ లేకుండెను. బెరడు, తోలు గుడ్డ, రేకులు మున్నగు వివిధవస్తువులతో చేయ బడిన కృత్రిమముఖములు ( masks ) నటుల శిరోభాగ మావరించి యుండెను.

17, 18వ శతాబ్దములలో ఫ్రెంచి రాజధానులందు ప్రదర్శింపబడిన యొకవిధమగు పౌరాణికనాటకముల పాంటొమైములని పిలచుచుండిరి. ఇంగ్లాండులో నిట్టి యభినయ విశేషములు క్రిస్మసు, ఈష్టరు పండువలాదిగాగల మహోత్సవ సమయములందు మాత్రమే ప్రయోగింపబడుచున్నవి.

ఇటలీ దేశమందాడబడుచుండిన ఆటెలా ప్రహసనము లందు పాంటలూను అను హాస్యపాత్రమొకటి విధిగా వచ్చుచుండును. ఈపాత్ర వెనీసునగరపు ముసలిపోకిరీల స్వభావములను వెక్కిరించు హాస్యప్రసంగముగ నుండెను.

కొన్ని పరిహాసనములందీతడు వయసుచెల్లిన యవివాహితుడగును. మరికొన్నిటిలో, పడుచుపెండ్లము, అల్లరిచేతలకు గుండు వృద్ధుడుగను, చిత్రింపబడుచుండెను. వీనిదుశ్శీలతనయ కొలంబీనని పిలువబడెను. హార్లెకీనను పాత్ర సామాన్యముగ నీతని నవుకరై యుండెను. బక్కచిక్కి వంటికంటుకొనిన లాగూను, అంగీని ధరించి, హార్లకీను క్లౌనుల హాస్యప్రసంగములకు గురియై, యీతడు నవ్వులాటపాలగుచుండెను.

హార్లెకీను మొట్టమొదట నొకతిండిపోతునవుకరుగ నుండి తరువాత సేవకవృత్తి వదలి సైనికవర్గమున జేరి యూవలదొమ్మరిమొగ్గలను నేర్చి హాస్యప్రసంగములం దారి తేరి నృత్యశిక్షకుడై ఉపన్యాసకుడై నిత్యసంతోషచిద్విలాసములతో నన్నిటతానయై మెలంగెడు పలుతెరవులపోకిరీపాత్రము. ఈతడు సంపన్న భూస్వాముల భూమికలలో రాజసభల బ్రవేశించి యచ్చటిదాసీవనితలకు కన్నుగీటుచుండును. పాంటలూను కూతురగు కొలంబీను యీతని భార్యగనో యుంపుడుకత్తెగనో హాపక్ చెంబేలీగనో వర్తించుచుండెను. ఈతడు పలువన్నియల ముక్కలతికించి కుట్టిన దుస్తులు ధరించి నీచశృంగారమును పరిహాసమును ధైర్యములేని శౌర్యమును, వెకిలి తెలివిని, లోటులేని సర్వసమగ్రప్రతిభాప్రదీప్తిని చూపు నాట్యాధికారియై యుండెను. ఆంగ్లమూకాభినయ రూపకములందు హార్లేకీను, కొలంబీనుతో పల్టీలు గొట్టుచు, నీచశృంగార నృత్యగీతముల సలుపుచు, పాంటలూనును పరిహాసించెడి యల్లరిపనుచుగ నభినయించుచుండెను.

మరొక రూపకములలో తెలివితక్కువ పల్లెటిమొద్దొకడు చాదస్తపుచలచిత్తుడు క్లౌను అనువేషములో నియతముగ వచ్చుచుండెను. ఇట్టివేషమును సర్కసుకంపెనీల హాస్యగాండ్రలో మనమందరము చూచియున్నాము. 19వ శతాబ్దారంభమున లండను పట్టణపు డూరీలేను నాట్యశాలలో నభినయించుచుండిన జోసెప్పుగ్రిమాల్డి యనునటుడు క్లౌనుపాత్రధారణమందు నిరుపమ ప్రజ్ఞను చాటియున్నాడు.

కొలంబీనుపాత్ర తొల్లిటి ఆర్టిలాప్రహసనమునుండి గైకొనబడినది. ప్లాటసు యీపాత్రమును పోకిరీ దాసీలుగ మార్చెను. మరివో రచించిన ప్రెంచిహాస్య రూపకములలో కొలంబీను పాంటలూనుయొక్క కూతురుగ చిత్రింపబడియెను క్లౌను యీపెను కోరుచుండును గాని వలుపడత లెరింగిన హార్లకేనుపై యీమెకభిమానము. అతనిని మెప్పించి వాని దుశ్చేష్టలవలన గుండెపగిలి చచ్చిన దురదృష్టవనితల దుఃఖవృత్తాంతముల దెలిపి యాతని నయముగమనస్కరిప్పి పరిణయించును. కొలంబీను పార్సీనాటకములలో నగుపడు చెంబేలి దుష్టహాస్య వనితను బోలియుండెనని చెప్పవచ్చును.

## మాస్కులు.

ఇంగ్లాండులో పంఘసంస్కర్తలు నాట్యకళయందు అసూయగలిగి వర్తించినపుడును అంతకుపూర్వమును మాస్కులనబడెడి సాంకేతికనాటకములను ప్రదర్శించుచుండిరి. ఇందు కవికల్పనకు రంగశిల్పకులకు తగినంత అవకాశ మమరెను. భావగీతములసొబగు లిందున వాసికెక్కినవి. నృత్యగీతము

లకు కూడ తగినన్ని యవకాశము లేర్పడెను. మిల్టను జాను సను మున్నగు కవులు చక్కని మాస్కులను రచించిరి.

## మారియోనెట్టులు (బొమ్మలాటలు)

ఇవి "పెళ్లాడేబొమ్మ! పెళ్లాడేబీబీనాంచారి!" అను పాటలతో నాడింపబడు కీలుబొమ్మల బోలియుండెడి కఱ్ఱప్రతిమలతో ఆడింపబడిన నాటకములు. ఇట్టివి పూర్వకాలమున పాటలీపుత్రమందు చీనాదేశమందును వాడుకలో నుండినవట. ఈజిప్టు యవన, రోమక పారసీకాది ప్రాచీనరాజ్యములందు కీలుబొమ్మల ఆటలు సామాన్య వినోదాంశములుగ నుండెను. మధ్యమశతాబ్దములలో యిటలీ యందును తరువాత ఫ్రాంసు నందును యివి వాసికెక్కినవి. బొమ్మల కీళ్లకు సూత్రములు కట్టి వానినాడించుచు కథ జరుపుచుందురు. ఇందులో ప్రతి ఆవయవము కన్నులు ముఖమొదలి కండలు చక్కగ కదులుచు సంపూర్ణమగు భావప్రకటన మేర్పడు యంత్రసదుపాయము లున్నవి. వీని వెనుక మనుష్యులు నిర్ణితవాచికము చదువుచుందురు. తోలుబొమ్మలుకూడ నివ్విధమగు బొమ్మలాట నాటకములకు సంబంధించినవే. జావాద్వీపమందు జపానులో ఇవి మిక్కిలి యందముగ నద్భుతమగు జీవకళతో ఆడబడుచున్నది. టర్కీలో రంజాను పండుగలందు కీలుబొమ్మలు ఆడింపబడును. యూరపులోనివి యిప్పటికినీ మాన్యమగు నాట్యవిశేషములుగ నాదరింపబడుచున్నవి. గీటే, లానేజి, మాటరులింకు మొదలగుమహాకవులు యీనాటకములకు కథల వ్రాసియున్నారు. మొజార్టు

హైడను మొదలగు మహాగాయకులు వీనికి గీతములవ్రాసి యున్నారు.

### ఫార్సు—ప్రహసనము

ఫార్సు శబ్దమునకు చెత్తఅని అర్థము. మిక్కిలి వెక్కిరింపుతో అతిశయోక్తిగ మనుష్యుల లోపములను చిత్రించుచు, మిగుల పరిహాసింపదగిన, అవస్థల కల్పించుచు తదనుకూలమగు భాష నుపయోగించుచు కామిడీలకన్న చిన్నదిగా నుండు హాస్యరూపకము ప్రహసన మనబడుచున్నది. ప్రాచీన క్రైస్తవమత ప్రచారకరూపములలో మధ్య మధ్య అగుపడుచుండిన, ప్రాకృతపాత్ర సంభాషణము నుండి నవీనపరిహాసనము లేర్పడినవి. అర్థగాంభీర్యమొప్పెడి నాటకములలో విలసిల్లు హాస్య ప్రసంగములు ప్రహసనబీజముల గల్పించుచున్నవి. పగటి భాగవతుల జాతీయములు మొదటినుండి తుదివరకు పరిహాసన రూపమును ప్రాకృతగ్రామ్య వైఖరులలో కల్పించి యున్నవి. వీరేశలింగముగారి ప్రహసనములు సులువగు గ్రాంధిక శైలిలో వ్రాయబడినను, అందు మనుష్యుల శారీరక స్వభావ లోపములకన్న నైతికదోషము లెక్కువ నవ్వులాటకు గురిచేయబడినను, అవియు ప్రహసనములే యనదగును. ప్రహ్లాదలో ఛండామార్కుల పట్టు, హరిశ్చంద్రలో నక్షత్రకుని తిండి యేడుపు చింతామణిలో సుబ్బిశెట్టి మోటువలపులు మృచ్ఛకటికలో శకారుని వింత నడతలు యివియన్నియు పరిహాసన విశేషములే. కాని హైందవ నాటకములందు హాస్యరంగములు ప్రత్యేకముగ వివరింపబడి యుండ లేదు. కథార్థముతో కలసి విదూషకాది పాత్రల సంభాషణమందు

గోచరించుచుండును. ఫార్సీ నాటకములలో ప్రధాన కథాంశముల నడుమ ప్రత్యేకమగు హాస్యరంగము లేర్పడియుండును. ప్రత్యేక ప్రహసనములందు నాటకాంతర్గమగు హాస్యప్రసంగములందుకన్న నెక్కువ విచ్చలవిడి వెక్కిరింపులు బడి తెగిన పలుకు తెరవులు ప్రొప్పిదమగుచున్నవి.

పాశ్చాత్యదేశములో 18 వ శతాబ్దమున శామ్యుయలు ఫూటు వ్రాసిన ప్రహసనములు మొదటివి 19 వ శతాబ్దములో ఫూలు మాడిసను, మార్టను, బర్నాండుమున్నగుహాసకుల రచనలు వాసికెక్కినవి.

## బాలెట్టు నృత్తరూపకము

వాచికము పయోగించకుండ తమ నోటితో గాత్రసంగీతము పాడకుండ, నేపథ్యమందు వాయించబడు జంత్రాదిసంగీతమున కనుకూలముగ నృత్యాభినయ మొనర్చెడిపాత్రలతో గూడిన రూపకము బాలెట్టు అనబడుచున్నది. 14, 15 శతాబ్దములలో, ఇటలీ, రాజసభలందిది మిక్కిలిపసందు చేయబడెను. 1489 బోట్టా అనువాడు మిలానుపట్టణములో నొక రమ్యమగు బాలెట్టును రచించి ప్రదర్శించెను. ఇందు దేవతాపాత్రలు పందివేటలో పాల్గొని యావల నొక విందారగించి తుదకు పాతివ్రత్య వ్యభిచార ధర్మములగూర్చి పోట్లాడుకొనిన కథావృత్తాంతము వర్ణింపబడినది.

బాలెట్టుమత విషయికకథలందుకూడనుపయోగింపబడినది. డావిన్సీమున్నగు చిత్రలేఖకులు వీనికి తగురంగముల జిత్రించుచుండిరి. 1581 లో బాల్టజారుని యను యిటలీదేశస్తుడు కామిల్ డీ లా రేనియను జగత్ప్రసిద్ధ నృత్తరూపకమును

రచించి యద్భుతమగు రంగ వైచిత్రముతో ప్రదర్శించెను. తరువాత యూరపులోని రాజ్యస్థానములందెల్ల బాలెట్టురూపకము గౌరవింపబడినది. పరాసు సచివశేఖరుడగు రిషిలో దీని నాదరించి నీతిబోధకముగ నుండునట్లొనర్చెను. అంతవరకు దీనియందు నృత్యమే ప్రధానాంశముగ నుండెను. ఆవలకా క్నెల్లీ, మాల్యేరు, లల్లీ కమార్గోమున్నగు రచయితలు పాల్గొని చక్కని భావవాహకమగు బాలెట్టులను సృజించిరి.

దీనిపైన నావెర్రి, లెస్సింగు మున్నగు విమర్శకులు వ్రాయదొడగిరి. యూరపులోని మహాగాయకులు, కవులు, చిత్రకారులు, నృత్యవిద్యాప్రవీణులు సుప్రసిద్ధులగువారనేకులు, బాలెట్టురూపకముల నత్యంతమనోహరముగనొనర్చిరి. ప్రస్తుతము రష్యాయాలోని జింస్కీ కార్సవీన మున్నగువారలు పర్షియా జపాను మున్నగు ప్రాచ్యదేశీయగాథలను గైకొని మనోహరముగ మెరుగారు రంగసామాగ్రితో ప్రదర్శించుచున్నారు. ఈపద్ధతిలో మిమిక్కు, లేక మూకానుకరణ మను నాటకవిశేషము కూడకలదు.





# తెల్లతెలుపుల తీగెయల్లికలు.

---

## యూరపురాజ్యముల చరిత్రాంకములు.

యూరపులో నొక్కొక కాలమందు యొక్కొక దేశము సామ్రాజ్యవిభూతినొంది, కావ్యశిల్పాది సత్కళల, నాదరించి కొండొక కాలములో వాసితప్పినను, ఆ భూఖండమందలి కళాచరిత్రము, చెట్టువలె, నొక్క మూలమునుండి మొలచి పరస్పరసంబంధ మొప్పారు శాఖోపశాఖలుగ పరిణమించినది. మాననీయమగు సాహితీవికాస ముదయించినది మొదలు సమకాలిక చారిత్రమును, అప్పటిప్రజల నిత్యజీవిత పద్ధతులను వర్ణించు, యితిహాసములుకూడ నేర్పడినవి. అందుచేత కళాపరిణామ సోపానములు జక్కగ బరిశీలింపు అవకాశములు, పాశ్చాత్య చరిత్రమున దొరుకుచున్నవి. మానవ మానసము అన్నితావుల నొకేవిధముగ బరిణమించును గాన, సునిశ్చయమగు పాశ్చాత్య చరిత్రార్థముల బరికించి వానివెలుగున చరిత్రలు లభింపని ప్రాచ్యదేశముల కళాపరిణామ మూహించు తార్కికసాధనము లేర్పరచుకొనవచ్చును.

అర్యులు తొలుదొల్త ఆశ్యాఖండపు పశ్చిమోత్తర భూములందు నివసించి, పశుగ్రాస మన్వేషించుచు, మొత్తంబులై పలుమారు పశ్చిమమున కరిగి యూరపులోని వివిధ ప్రాంతములందు నివాస మేర్పరచుకొనిరి. పరివాససంచలన తరంగములు B.C.3300 ప్రాంతముల నారంభించినది. ఇందులో జర్మను, ఫ్రెంచి, ఆంగ్లేయ జాతులకు మూలపురుషులగు కెల్టుజాతీయులు మునుమొదలు వెడలి, బాల్టికు సముద్రప్రాంతముల నావాస మేర్పరచుకొనిరి. తరువాత ట్యూటోనిక్ జాతివారు, యూరపులోని మధ్యభాగముల నాక్రమించిరి. పిమ్మట రష్యాప్రజల పెద్దలగు స్లవోనిక్కు జాతివారు, కాస్పియను సముద్రమున కుత్తరముగ వలసవిడసిరి అటుపిమ్మట మధ్యధరాసముద్రపు రమణీయభూములలో నివసించిన యవన రోమకజాతు లరుదెంచిరి. ఈజాతులన్నియు ఆర్యకుటుంబమునకుజెంది, ఆశ్యానుండి వేర్వేరు కాలములలో పశ్చిమాభిముఖులై జనినవారలే. ఆకాలమున ఆర్యుల నాగరిక ప్రభావము ఆశ్యాఖండమందుం గ్రమవృద్ధి నొందుచుండెను. ఏజాతి మొదటు వెడలిరో అప్పటివరకు, పరిణమించిన ఆర్యనాగరిక సాంప్రదాయములను, విజ్ఞానమును వారలు గొనిపోవుచుండిరి. ఆవల తమ వలసభూములజేరి యచ్చటి శీతోష్ణస్థితిని, వృత్తివ్యాపారములను, దేశపరిస్థితులను, అనుసరించిన ప్రత్యేకనాగరిక వికాసమును పొందుచు, అచ్చటచ్చటి స్థితిగతుల కనుకూలమగు శారీరరూప విపర్యయమును కూడ ననుభవించుచు, కాలపరిణామములలో తొల్లిటి యూర్యులకెంతయో భిన్నముగ దోచునట్లు మారుచుండిరి. ఆర్యనాగరిక నిలయము

ఆశియాఖండ మయినందున, వీరి విజ్ఞానము కాలక్రమమున నభివృద్ధి నొందినందున, వీరిలోనుండి గుట్టతుదకు చీలి వెళ్ళిన యవనరోమకజాతులు అంతకుముందు వెళ్ళిన కెల్టుస్లెవోనిక్ జాతులకన్న యెక్కువ పరిశత్వ మొందిన ఆర్యసంప్రదాయముల గైకొనియుండిరి వీరు నివసించిన భూమధ్యసాగర ప్రాంతములు, అప్పటికి మహోన్నతవైభవ మనుభవించుచు, సకల కళాపరిజ్ఞానమున విపరీతసిద్ధినొందిన యీజిప్టు పారసీకదేశములకు అత్యంతసామీప్యమున నుండెను. అదిగాక వీరునివసించిన భూభాగము దక్కిలి యందమై సుఖప్రదమై, రూపవికాసమునకును, మానస పరిపాకమునకు అనుకూలముగ నుండెను. యూరపులోని నాగరికతరంగిణి, కళావిట పిమూలములు యవనభూములయం దంకురించినవి.

B.C. 600 ల సంవత్సరములకు యీజిప్టు, అస్సీరియా, మున్నగు సామ్రాజ్యముల ప్రాభవ మంతరించి, పారశీకుల రాజ్యోన్నతి వెలుగసాగెను. వీరి కళానైపుణ్య మెంచదగినను పరిపాలనరీతులు ప్రజాస్వాతంత్ర్యమునకు విరోధముగ నుండెను. వీరు B.C. 490 లో యవనపట్నముల జయింపసమకట్టిరి. యవనులు గ్రీసుదేశములోని యాతెన్సు, స్పార్టా కొరింతు మున్నగు పట్టణములందు సర్వస్వతంత్రమగు స్థానిక పరిపాలన మేర్పరచుకొని చక్కని బ్రహ్మచర్యమును సలుపుచు, సుఖజీవన మొనర్చుచుండిరి. కొన్ని యవనపట్టణములు ఆశియాఖండము నంటియుండెను. వీనిలో శిల్పాదికళలు మనుష్యుండు వికవించినవి. యవనవాల్మీకియగు హోమరు మహాకవి B.C. 1000 ప్రాంతముల నీనగరములకును స్పార్టా

సగరచునకునూ, జరిగిన కాంతాపహరణపాషోద్ధాత సమ
రారంభవంను వర్ణించి పాశ్చాత్యుల యాదికావ్య మేర్పర
చెను. పారశీకులు B.C. 490 లో గ్రీసుదేశపు యవనపట్టణ
ముల జయింప దాడివెడలినపుడు ఆపట్టణము లేకమై స్వాతం
త్ర్య సంరక్షణార్థము పారశీకుల నెదుర్కొని యోడించిరి.
అప్పటినుండి సుమారు 200 సంవత్సరములు యవనదేశము
నాగరిక నిలయమై నిరుపమానమగు శిల్పిచాతుర్యమును
వెల్లగించి, మహాకవుల కాకరమై తత్వజ్ఞుల పుట్టినిల్లయి స్వతం
త్రభావోద్దీపితమగు మహోపన్యాసముల గద్యఘోషకు
యులికిపడుచు, పాశ్చాత్య నాగరికతకు సకలవిషయములందు
మాతృకల కూర్చుచు, జెన్నొందుండెను. యవనపత్తములు
స్వాతంత్ర్య మనుభవించిన కాలములో B.C. 432 మొదలు
400 వరకు పెరిక్లీసుఅను మహామహుని శాంతిపాలనములో
యవనుల సారస్వత మహోదయము యేర్పడెను. భువన
ప్రసిద్ధులైన యాస్కిలసు సోపాక్లీజు మహాకవులు, ఆరిస్టాటులు.
ప్లేటో భట్టారకులు, సాక్రటీసు తత్వజ్ఞుడు ఫిడియసు మున్నగు
శిల్పకులు యీతని పోష్యవర్గమున జేరి భూలోకమందెచ్చ
టనూ యెన్నడును గానరాని కళావైభవము సాహితీసామ్రా
జ్యము నేర్పరచి నవనాగరిక బీజముల నాటుగొల్పిరి.

యవనులు పారశీకులజయించి నిండారుజాతీయభావము
లతో నుప్పొంగుకాలమున వారి కళావిజృంభణమేర్పడెను.
ఆవల యవనపత్తనములు పరస్పరవిరోధమున, B.C. 350
ప్రాంతముల, మాసిడనురాజగు ఫిలిప్పున కాధీనమై యావల
నతని కుమారుడగు అలెక్జాండరుసార్వభౌముని చేపరిపాలింప

బడినవి. అలెక్జాండరు ప్రాచ్యదిగ్విజయమూహించి పాటలీపుత్రమువరకువచ్చి ప్రాచ్యవిజ్ఞానసాధనముల నశేషముగ యవనసీమలకు గొనిపోయెను. B.C. 160 లో యవనదేశము రోమకుల యాధీనమున చేరినది. రోమకుల రాజ్యసంపాదక ప్రభావమునకు లోబడినను తమవిజేతలను నాగరికసారస్వత వైభవముచే మెప్పించుచుండిరి. రోమకుల సరసజీవనమంతయు యవనులకళాతత్వబోధనమువలన నేర్పడినది.

ఇటలీదేశమందు B. C. 700ల ప్రాంతముల నొకచిన్న పట్టణముగనుండిన రోమునగరము క్రమముగ నిటలీదేశమంతయు నాక్రమించుకొని B. C. 218 లో అప్పటికిని నిరుపమవణిగ్వైభవమున నలరారు కార్తెజిపత్తనపు మహాసేనాని హానిబాలుని యోడించి స్పెయిను మున్నగు దేశముల నాక్రమించుకొని విజయసంతోషమున దెప్పరిల్లుచుండెను. రోమకులు శిల్పాదిలలిత కళలందు మూకభావమువహించినను, దేశాభిమానము, శీలశౌర్యాదులు, స్వార్థత్యాగము, దయాసత్యాది సద్గుణములు రాజ్యధూర్వహణ సామర్థ్యము చమూనేతృత్వము ధైర్యస్థైర్యములు మున్నగుగుణసమృద్ధిచే క్రమముగ నీజిప్టు మున్నగు భూమధ్యసాగర ప్రాంతముల నెల్ల జయించి యవనులవలన శిల్పాదిలలితకళలభ్యసించి యుత్తరమున నింగ్లాండువరకునూగల యూరపునంతను స్వాధీనపరచు కొనిరి. వీరు జయించిన భూభాగములకు స్థానికపరిపాలనాధికార మొసంగుచు వారి మతస్వాతంత్ర్యమును గారవించుచు రోమకవిజ్ఞానమును అప్పటికె అనాగరకమైయున్న యూరపునందు నెలకొల్పి చక్కని కట్టుదిట్టములతో ప్రభుత్వ మొనరించుచుండిరి. రోమ

కుల సామ్రాజ్య పరిణామము సీజరుచక్రవర్తి కాలములోను అతనిమేనల్లుడగు అగస్టసుకాలములో నేర్పడినది. అప్పుడే రోమకుల మహాకవులుకూడ నివసించుచుండిరి. రోమకపరిపాలనమందుజేరిన యూదుదేశములో నేసుక్రీస్తుజనియించి నవ్యమత సూత్రముల వ్యాపింపజేసెను. ఇవికాలక్రమమున రోమకచక్రవర్తులచే సంగీకరింపబడినవి. వీరిమతాచార్యులు తమప్రభుత్వములోచేరిన భూభాగమందు క్రైస్తవమతాలయముల నేర్పరచి రోమకపట్టణమందు ప్రధానమత మేర్పరచిరి. ఇంతలో రోమకులు విత్తభారమున విషయలంపటులై తొల్లిటి సద్గుణంబుల మరచి మహాపాపముల నొడిగట్టుచు కాలయాపనమొనర్చుచుండిరి. వీరిరాజ్యమతి విస్తీర్ణమగుటచే, రోమునందొకరాజధానిని కాన్‌స్టాంటునోపులలో మరియొకరాజధానిని, యేర్పరచుకొనిరి. అచ్చటకూడ యవనరోమకవిద్యలు విజ్ఞాన సాధనములు బెంపొందుచుండెను. రోముపట్టణములోని రోమకులు విషయలోలురై నిర్వీర్యులై యుండుతరి A. D. 490 లో నుత్తరపుమోటుజాతులు దాడివచ్చి రోముపట్టణమును గడలించి కొల్లవెట్టి రోమకుల సామ్రాజ్యమంతరింపజేసిరి. ఇట్లు పశ్చిమరోమకుల లౌకికప్రభుత్వ మంతరించినను మతాధిపత్యమింకను రోమునగరమందు సుస్థాపితమై వెలుగొందియుండెను. ఉత్తరదేశముల అనాగరికజాతులు కాలక్రమమున క్రైస్తవమత మవలంబించినకొలది రోమకమతాధిపుల ప్రాభవమెక్కువగుచుండెను. ఈరీతిగ 16 వ శతాబ్దమువరకు రోమకమతాధిపులు యూరపులోని లౌకికమతసాంఘిక జీవనము శాసించుచు నొకవిధముగ యూరపులోని రాజులందరిపై

యధికారిగ నుండెను. కాని రోమకకళాదివిజ్ఞానమున కాలవాలముగనుండు మహోన్నతితప్పి పోయినది.

A. D, 600 లతో లాటినుభాషయందు స్వతంత్రముగ వ్రాసెడి పెద్దతెలువులు గతించినవి.

A. D. 6 వ శతాబ్దము మొదలు క్రైస్తవ మతసంస్కార మేర్పడిన 16 వ శతాబ్దమువరకు యూరపులో నొక విధమగు మూఢతమిస్రము వ్యాపించి యుండెను. రోము పడిపోయినతరువాత యూరపులోని యనాగరికజాతులు క్రమముగ క్రైస్తవ మతమవలంబించుచు స్పెయిను ఫ్రాన్సు ఆస్ట్రియా ఇంగ్లాండు దేశములందు సుస్థిరసామ్రాజ్యపీఠముల నేర్పరచ యత్నించుచుండెను. ఒక విధమగు నధికారపరంపర చక్రవర్తిమొదలు రహితువరకును యేర్పడి లౌకికవిషయములందు భక్తిపూర్వకమగు సేవాచారములు యేర్పడినవి. మతవిషయములందుకూడ నిటులనే సర్వాధికారము రోమకమఠాధిపునియందిమిడి ప్రజాస్వాతంత్ర్యమును బంధించివైచెను. యూరపంతయు నల్లకల్లోలముగ నుండిన ఆ కాలములో తమ లౌకికాధికారమును ప్రజలపై బలవత్తరముగ శాసించుకొరకు యూరపులోని చక్రవర్తులు మతాచార్యుల పరమాధికారమును అంగీకరించి వారిబలముకుబడి నుపయోగించుకొను చుండిరి. ఈ సందర్భము స్వతంత్రభావవికాసమున కెంతయు నాటంకముగ బరిణమించినది? విద్దెలన్నియు మతాచార్యుల యాధీనమున నుండి జనసామాన్య మజ్ఞానతమిస్రమున జిక్కియుండిరి.

ఇంతలో అరేబియా దేశమున మహమ్మదీయ ప్రబోధము లుదయించి మూఢుల జయించియైనా, శిక్షించియైనా,

సత్యమతావలంబకుల గావించి రక్షింపవలయునని యీ దేశ
మందుఁగొన్ని మహమ్మదీయ వీరకేసరులు, మతవ్యాపకముద్దే
శించి నలుదెసల దిగ్విజయ మారంభించిరి. వీరు యేసు
క్రీస్తు జన్మించిన పాలెస్టైను పట్టణమును వశపరచుకొన యత్నిం
చుచుండిరి. భూమధ్య సాగరసామీప్యమున నున్న ఆసియా
ఆఫ్రికా ఖండభాగముల నాక్రమించి స్పెయిను దేశమును
జయించి యచ్చట తమ ప్రభావమును నిలువబెట్టిరి. వీరి
దాడివలన క్రైస్తవమతంబునకు మహోపద్రవ మేర్పడెను.
ఆరబ్బుల సంపర్కమున ప్రాచ్యదేశముల విజ్ఞాన మొకింత,
స్పెయినుమార్గమున యూరపులో ప్రవేశించినది. పాలెస్టై
నును, ప్రాచ్యరోమక రాజధానియగు కానిస్టాంటునోపిలును,
వశపరచుకొని క్రైస్తవ మతమును, తుదముట్టింప దుముకు
చుండిన తురుష్క చమూతరంగముల నడ్డగించుటకు యూరపు
లోని రాజులందరు తమ యనుచరుల గూర్చుకొని ప్రాచ్య
దేశములందు, మతసంరక్షక సమరారంభముల నుద్యమించిరి.
ఇందుకేర్పడిన రాకపోకలచే ప్రజల ప్రపంచజ్ఞాన మొకింత
పెరుగుచుండెను. ఇంతలో యూరపునం దచ్చటచ్చట ప్రతి
భావిరాజితులగు చక్రవర్తులు కొన్ని విద్యాలయముల నెల
కొల్పుచుండిరి. వెనీసుమున్నగు పత్తనములందు నౌకావ్యాపా
రమేర్పడి విదేశములకరిగి వింతల జూచివచ్చెడి విజ్ఞాన వివర్ధక
మార్గము లేర్పడినవి. యూరపులో మత లౌకికవిషయము
లగు సంపూర్ణ శాసకప్రభావ మొప్పియుండి ప్రజాప్రభువుల
శక్తిసమన్విత ధనరాసులచే నైశ్వర్యవంతులై వెలుగుచుండి

న, మతాచార్యులు మానవనైజమగు దుర్విషయ దుర్వ్యా సంగముల జిక్కుకొని నీతిబాహ్యులై క్రైస్తవాదర్శములం సైపజాలని నీచాచారముల దేలుచుండిరి. ఇట్టి మతాచార్యుల పట్ల యూరపులోని ప్రజలకును ప్రభువులకును యేవగింపు గలుగుచుండెను. ఇట్టిస్థితిలో కాంస్టాంటినోపులు తురుష్కు లపాలబడి యచ్చటి క్రైస్తవ సంస్థాపనలు విద్యాలయములు మంటగలసినవి. అచ్చటి మహోపాధ్యాయులు తమచేత జిక్కిన యవనరోమక గ్రంథజాలమును గైకొని యను దేశములకు దరలివచ్చి యచ్చటచ్చట విద్యాలయములేర్ప రచి, నిక్కమగు తొంటిచదువుల విరజిమ్ముచుండిరి. వీరి ప్రభావమునను, వర్తకవ్యాపారములవలన ధనవంతులై లలిత కళాపోషకవ్రత మవలంబించిన ధనాఢ్యుల ప్రాపకమునను, యూరపులో ప్రాచీనవిద్యల నుద్ధరింపు మహోద్యమ మేర్పడి నది. దీనిని రినేసాన్సు అందురు. అంతకుపూర్వము యూ రపులోని సమస్తదేశములందు ఆయాజాతుల వీరకథలను దెలుపుచు పల్నాటి వీరచరితము బొబ్బిలిపాట మున్నగు స్వత స్వతరూపములను బోలెడి జాతీయవీరసారస్వతము ఆయా జాతుల వాడుకభాషలో రచియింపబడుచుండెను. రినేసాన్సు మొదలు మరల యవనరోమక మహాకవుల కావ్యలక్షణము స్వతంత్ర తత్వాన్వేషణము అనుసరించి లక్షణనిబద్ధమగు కావ్యములను గ్రంథములను లాటినుభాషలోను, దేశభాష లందును రచియింప మొదలిడిరి. రినేసెన్సు ప్రభావ మున నంకురించిన నవ్యకళావికాస మిటలీదేశమున డాంటే, పెట్రార్కు, బొకాసియో మహాకవుల క్రొత్త పోకడల

మును, డావిన్సీ, రాఫీల్, మైకెలుఆంజిలో మున్నగు శిల్పకుల యపూర్వ చిత్రవిరచనములందును పరిణామ మున్నరూపముల దాల్చి యూరపులోని నవీనకళాదర్శముల నేర్పరచినది. యువన వ్యాఖ్యానములయందు నిజసత్వమున భాసిల్లు క్రైస్తవాదర్శములు భావస్వాతంత్ర్యము, జర్మన్ విద్యాలయములయందు క్రొత్త రుచు లందుకొనుచుండెను. ఇటలీ యూరపునకు కళాదర్శముల నందించుచుండ జర్మనీ, భావస్వాతంత్రమున శాటపట్టి రోమకమతాచార్యులచే బ్రివర్తింపబడు క్రైస్తవాచారముల దెగటార్చి యేసుక్రీస్తువచించిన నిర్మలసదోభ్ధనక్రియముల నెలకొల్పు పరిస్థితు లేర్పరచుచుండెను.

ఇంతలో రోమకమతాధిపులు ఆష్ట్రియా జర్మను దేశముల బాలించు రాజులతో వైరసంబంధమున నలిగి వారల బహిష్కరించి యిడుముల గుడుపుచుండిరి. తమమతనైతిక జీవనము నీచగతుల భంగపడి ప్రజాగౌరవముగోల్పడుచుండెను. యెట్లులైనను తమలౌకికమతాధికారముల నిలుపుకొనెడి పట్టుదల రోమకమతాచార్యులను బీడించుచుండెను.

స్పైను పోర్చుగల్ దేశీయులు వెనీసుపట్టణము నౌకావ్యాపారమున ప్రాచ్యదేశములతో వ్యవహరించి యనుభవించుచుండిన ద్రవ్యలాభమును పంచుకొన యత్నించుచుండెను. వెనీసువర్తకులు భూమధ్యసాగరమును దాటి నేలబాటతో ఆరేబియా పారసీకదేశముల నధిగమించి పారసీకరేవులలో పడవలెక్కి గోవా, కల్లికోట, ప్రోబందరు కరాచీ

మున్నగు రేవులకు సరుకులగొని తెచ్చుచుండిరి. వారు హైం దవ రాజ్యస్థానముల మహోన్నతవిభూతి సరసి వింతలగు భాగ్యగాధలను యూరపులో వ్యాపింపజేసిరి. ప్రాచ్యవ్యాపారమున లాభమొందెడి యాశ యెల్లరకును పులకరించినవి. నేలబాట తురుష్కుల యాధీనమున దుర్గమమై యుండుటచేత హిందూదేశమునకు సాగరమార్గ మన్వేషించు అవసరమేర్పడెను. ఈ ప్రయత్నములో స్పైనునావికులు దారి తప్పి యమెరికాభూముల జేరి యచ్చట విపులైశ్వర్య పూరితమగు వలస రాజ్యముల సంపాదించుకొనిరి. ఆవల వీరలే హిందూదేశమునకు సాగరమార్గమును కూడ తెలిసికొనిరి. ఇవ్విధమున నధికసంపన్నులై వెలువొందుచుండిన స్పైనుదేశీయులు యూరపునెల్ల జయించి స్వాధీనపరచుకొను మహోద్యమ మారంభించిరి. వీరిరాజగు ఫిలిప్ వార సత్వమున ఫ్రెంచి దేశమునకుకూడ రాజుగ నేర్పడెను. రోమకమతాచార్యులు వీని లౌకికబల మపేక్షించిరి. మతాచార్యుల ప్రభావసహాయము ఫిలిప్ ఆశించెను. వీరిరువురి నిరంకుశాధికార ప్రతిష్ఠాపనారంభములు యూరపులోని శాంతిజీవనమునకును భావస్వాతంత్ర్యమునకును విరోధముగ నాచరించెను.

జర్మనీయుత్తర భాగమున కొన్ని పత్తనములు నౌకావ్యాపారమున ధనమార్జించి దినైసెస్సు విద్యావ్యాపనముచే విశుద్ధక్రైస్తవాదర్శంబులను గుర్తెరిగి భావస్వాతంత్ర్య మపేక్షించుచుండినవి. ఈపత్తనములు రోమకులకంటకము కారనము వలె నుండెను. ఫిలిప్ వీనిని జయింప నుద్దేశించుచుండెను. ఇంతలో లూధరుజర్మనీయందు 1520లో రోమకాచారములకు

భిన్నముగ క్రైస్తవమత సంస్కరణోద్యమము ఆరంభించెను.

ఇంగ్లాండు చిరకాలమునుండి ఫ్రెంచిరాజులతో బోరాడి మున్నిటి నడుమనుండెడి ద్వీపమగుటచే తన స్వాతంత్ర్యమును నిలుపుకొనగలిగెను. కాని ఫ్రెంచివారితోను వారు చేపట్టిన రోమకమతముతోను సంబంధము విడిపించుకొన వలెననెడి కోరిక ఆంగ్లేయులకు పెల్లుబ్బుచుండెను. అష్టమ హెన్రీ రాజ్యకాలములో, 1545 లో ఊల్సీయను పురోహితమంత్రి సత్తముని యాదేశమున నింగ్లాండు రోమకమతమును బహిష్కరించి లూథరు యేర్పరచిన సంస్కరణపద్ధతు లవలంబించెను. హెన్రీ తరువాత కొంతకాలమునకు ఎలిజబెత్తు ఆంగ్లేయుల రాణియై నేర్పొప్ప బాలించుచుండెను. ఈమెకాలములో నింగ్లాండుదేశపు నావికులు భూప్రదక్షిణ మొనర్చుచు నాంగ్లసామ్రాజ్య విస్తరణ మహాదర్శములతో మాతృదేశమందపారమగు ప్రేమతో స్వార్థత్యాగ సదాదర్శములతో మెలగుచుండిరి.

స్పైనురాజగు ఫిలిప్పుకాలమున వారిదేశమందు పెక్కు మహాశకవు లుద్భవించి చిత్రకారులు వింత తెఱవుల జిత్రించి వాని యాస్థానమును కళాపీఠముగ నొనర్చిరి. ఫిలిప్పు జర్మను ఇంగ్లాండు దేశముల పదమడంప సమకట్టి దాడివెడలెను. వీనిదండగము ఆంగ్లనావికుల శౌర్యోత్సాహమున నడుగంటెనది. అంతటితో స్పైనురాజ్యపు మహోన్నతి యస్తమించి ఇంగ్లాండు ఫ్రెంచిదేశముల వైభవప్రకాశ మేర్పడెను.

యెలిజబెత్తుకాలములో ఇంగ్లాండునందు విపరీతమగు సారస్వతాభివృద్ధిజరుగుచుండెను. తరువాత ఇంగ్లాండులో

స్వకీయమగుసారస్వతవిన్యాసమున కవకాశములు కొంతతగ్గినవి. ఇప్పట్టున ఫ్రాంసుదేశము పదునాల్గవలూయీ ప్రభుత్వములో దిగంతాక్రాంత రాజ్యవైభవ మొప్పుచు, నాట్యాదిసత్కళల యావాసమై, బరగుచుండెను. ఫ్రెంచికవులు వేదాంతులు చిత్రకారులు, విమర్శకులు యూరపునకు కళాదర్శముల గూర్చుచుండిరి. 14 వ లూయీ అనేక దండయాత్రల గావించి రోమకమతాచార్యుల ప్రాపక మనుభవించుచు విచ్చలవిడిగ ధనవ్యయము చేయుచుండెను. వీనియాచారమే తరువాతి పరాసుచక్రవర్తు లనుసరించిరి. కాని యూరపులో జర్మనీ యందు ఫ్రెడరిక్కు, స్వీడనులో 12 వ చార్లెసు మున్నగు రాజులుదయించి ప్రతిఘటించుటచే పరాసుసైన్యములు జయ మొంద జాలకుండెను. ఇంటివద్ద దులాభాఖర్చు కూత్రము మితిమీరుచుండెను. ఫ్రాంసు దేశములోని ప్రజలు రాజ సౌఖ్యములకు వలయు సుంకము లర్పించుకొన జాలకుండిరి. జర్మనీ, యింగ్లండు, ఫ్రాన్సు, యిటలీ మున్నగు దేశములలో శాస్త్రజ్ఞులు ప్రకృతి శాస్త్రరహస్యము లారసి రాజకీయమత సాంఘిక సిద్ధాంతములను లోతుగ బరిశీలించి సంఘమర్యాదల బోర్లదోయు క్రొత్తసిద్ధాంతముల గావింపుచుండిరి. మతాచార్యుల ప్రవర్తనయు దుస్సహముగ నుండెను. ఇట్టిపరిస్థితులలో ఫ్రెంచిదేశమున పెద్దతిరుగుబాటు జరిగి రాజును తొలగించి 1787 లో ప్రజాస్వామ్యమేర్పరచిరి.

ఇంగ్లాండులో రెండవ చార్లెసుసింహాసన మెక్కినతరువాత కొంతకాలము పరాసునాగరిక లక్షణము లనుసరించి సారస్వత మభివృద్ధి నొందుచుండెను. మరియు యవనరోమక

మహాకవుల కావ్యాదర్శములు లక్షణనిబంధనము లు ఆనీరాజ్ఞి పరిపాల నాంతమువరకు ఇగ్లాండులో రేగుచుండెను. తరువాత ఆంగ్లేయుల విదేశరాజ్య సంపాదన ప్రయత్నములు విస్తరించుచు అప్పటికి విపులైశ్వర్య విరాజితులగు ఫ్రెంచివారితో సమర సంఘటనమేర్పడెను. ఆంగ్లేయుల రాజ్యతంత్రము విజయప్రసూనముల దాల్చుటయు పరాసుప్రాభవ మంతరించుటయు భూమండలమున జరుగుచుండెను. మూడవజార్జి పాలించు ఇంగ్లాండునందు మహామేధావులగు వీరులు కవులు వ్యవహర్తలు గుమిగూడి యుండిరి. వీరు పరాసుదేశమందుదయించుచుండిన భావప్రభాతము నందికొనియు కావ్యశాస్త్రాదులందు భావస్వాతంత్ర్యమెక్కువగ నుపయోగించియు స్వదేశాభివృద్ధికై పాటుబడుచుండిరి. మూడవ జార్జికాలములో యింగాండునందు సంపూర్ణమగు సారస్వతవికాస మేర్పడినది. అమెరికా వలసరాజ్యము స్వాతంత్ర్యమూనినను ఆంగేయులవిదేశ రాజ్యభారము క్రమముగ విస్తరించుచుండెను.

ఫ్రాంసులో ప్రజానాయకుడై జగదేకవీరుడై యకుంఠితప్రతిభాసమర్థుడై, లోకములోని తెలివంతయు లోకములో నిబలమంతయు తనయందే అవతరించినట్లు వెలుగొందిన నెపోలియన్‌చక్రవర్తి కొంతకాలము, పరాసుసామ్రాజ్య మతిశయింపజేసెను. కాని కాలప్రవృత్తులు సకలదేశములందు స్వాతంత్ర్యవాంఛలంకురింపజేయుచుండెను. నెపోలియ నుల్కాప్రభావమున చారిత్రపథంబున దేజరిల్లి యందరికలసుడై 1814 లో, వాటర్లూరణభూమియందు జర్మను, ఆంగ్లసైన్యములచే నోడింపబడెను.

నెపోలియన్ పతనానంతరము యూరపులో నవ్యస్వాతంత్రవిలసనము లేర్పడి ప్రతిజాతికిని ప్రత్యేకరాష్ట్రముండెడి కట్టుదిట్టములుగావింపబడెను. 19వ శతాబ్దమందు యూరపులోని వివిధజాతులవారు తమజాతీయసత్వముల వికసింపజేసుకొనుచు, వర్తకవ్యాపారాదులందు మిక్కిలి భాగ్యవంతులై ప్రకృతిశాస్త్రములను, కళలను, పరిశ్రమలను పలుతెరంగుల విస్తరించుకొనియున్నారు. అంతకుముందు యొకొక్కకాలములో నొక్కొకదేశమందు విజయపరిస్థితుల కనుకూలముగ చక్రవర్తులపోషణప్రోత్సాహకములచే లలితకళ లభివృద్ధిజెందుచుండెను. కళావనిత లీలాభినయ మొనర్పదొడగసాగెను. ఈశతాబ్దపు మొదటిసగములో కావ్యకల్పన మెక్కువజరుగుచుండెను. రెండవసగములో ప్రకృతిశాస్త్రములు తత్త్వపరిశోధము వాసికెక్కినవి. యూరపు సమస్తనాగరికసందర్భములందు అపూర్వమగు నభివృద్ధిపొందుచుండెను. ప్రాచీననాగరికనిలయములగు శిథిలముల బరీక్షించి ప్రాచ్యదేశముల చరిత్రలు, కళలు, భాషలు శోధించి ప్రాచ్యపాశ్చాత్యసభ్యతలకుండు సంబంధములు విచారింపబడినవి.

20వ శతాబ్దములో జర్మనుయుద్ధ మారంభమైనది. దాని పర్యవసానముగ పాశ్చాత్యదేశముల సుఖశాంతిజీవనము తొట్రువడినది. లోకమాన్యులగు కవి పుంగవులు కానరారు. అయినను నాట్యాదిసమస్తకళలు నవ్యవైఖరుల దినదినాభివృద్ధిని గాంచుచునేయున్నవి. పాశ్చాత్యులు కావ్యచిత్రాదిసత్కళలందు ప్రాచ్యాదర్శముల నెక్కుడు ప్రవేశపెట్టుచున్నారు.

పై వివరణమువలన యూరపులోని సారస్వతవికాసము B.C. 500–200 యవనసీమలందును, B.C. 200. A.D. 200 రోమక పరిపాలనమందును, 14, 15, 16 శతాబ్దములలో యిటలీయందును, 16, 17 శతాబ్దములలో స్పెయినునందును, 17, 18 లలో ఫ్రాన్సు దేశమందును 16, 17, 18 లలో ఇంగ్లాండునందును ప్రత్యేక వికాసమొందినటుల గాన్పించును. ఆయా దేశముల లౌకికవిజయ మాధారపరచుకొని సామ్రాజ్యవైభవ మనుభవించు వేళలందు, ప్రజలమానస ముప్పొంగు సందర్భములందు ఆయా దేశముల ప్రత్యేకకళా వికాసమేర్పడినది. ప్రాచీనవిద్యా సంప్రదాయము లడుగంటిన వేయి సంవత్సరములలో ఆజాతుల వీరచరిత్ర కావ్యగీతములు అంకురించినవి. మరల విద్యాభివృద్ధితో ప్రాచీన లక్షణనిబంధన లేర్పడుచు వచ్చినవి.

ప్రాచీన కావ్యములందగుపడు లక్షణమర్యాదల నంగీకరించుటయు, ప్రతిభావంతులగు మహాపురుషు లుదయించి నిబంధనల దృంచి స్వతంత్రించుటయు, గమ్మ్రరసనవ్యలక్షణము లేర్పడుటయు,—లౌకిక సాంఘిక జీవనమునందేకాక, సారస్వతవికాసమందున కూడ గాననగు చక్ర నేమిక్రమంబయియున్నది. స్వాతంత్ర్యము, నిబంధనము, ఈరెండు విరోధశ్వతములే మానవచరిత్ర వికాసమునకు విశాలకారణములై యున్నవి.



# ఆటక్రైతల పూలసరము

## I

### యవనరూపకము.

పాశ్చాత్యరూపక కవిత్వము, యవనదేశములలో వసంతోత్సవములందు జరుగుచుండిన నృత్యగీతాదులనుండి యంకురించెనని, చెప్పియున్నాము. హెూమరుమహాకవి రచించిన యిలియెడు, అడెసీ, అను ఆదికావ్యములలోని సంభాషణ వైఖరులు అభినయోచిత కథాకల్పనము, కొంతవరకు నాటకరచనమునకు పునాదులేర్పరచినవి. హెూమరు B.C. 1000 సంవత్సరముల నివసించుచుండెను. యవననాటకముల మొదటి మొలకల మొలిపించిన మూలపురుషుడు.

### తీస్ పీజు.

B.C. 6 వ శతాబ్దములో యికేరియా యను, గ్రామమున, జనియించెను. ఆయూరిలో ఫలసస్యవనారామముల యధిష్టానదేవతయగు బేకసుని యాలయముండెను. తీస్‌పీజు దీనియుత్సవముల నడిపించుచు, పాటగాండ్రకు విశ్రాంతి నొసంగుకొరకు పాట వరుసలనడుమ నొక ముఖవేష్టన మమర్చిన హాస్యప్రసం

గ మొనర్చెడి నటుని ప్రవేశ పెట్టవలెను. ఈనటుడు నృత్య మేళ మునకు పాటలందించుచు, వారిని సంబోధించిపలుకుచు కథాంశము నడుపుచుండెను. నాందీప్రస్తావనము, కథాభాగమున సంభాషణము రచించి తిస్పీజు వీరకథాగీతమునకు రూపకరూపమొసంగెను. నటుని దేవతామంటప మంటియున్న యెత్తగు బల్లమీద ఆడజేసెను మరియు నటవర్గములోని, స్త్రీపురుషులకు గుడ్డతో చేయబడిన వింత మొగముల నమర్చి నాట్యభూమికల తొల్లిటి హాస్యరూపకములను కల్పించెను. ఈతని రూపకప్రదర్శనములు జనామోదమొందినందున వుత్సవసమయములందే గాక జనవినోదముకొరకు విడివేళలకూడ వీనిని ప్రదర్శించుటకు బండ్లమీదనొక నాట్యసమాజమును వెంటగొని యావనపట్టణముల కరుగుచు, తనరూపకముల ప్రదర్శించుచుండెను.

## ఇస్కిలసు. ( B.C. 525–456. )

యవనవిషాదనాటకముల యాదిపురుషుడు. యీతడు 70 వీరగాథల రూపకరూపమున రచియించెను. వీనిలో నేడుమాత్రమే యిప్పుడు లభ్యమగుచున్నవి. ఇందు పారశీకులు; ప్రోమతీయసు బంధింపబడుట, ఆగమేనను గూర్చిన రూపకత్రయము, ఆరెస్టియస్ వంశమును బాధించుచుండిన శాపమును తెలిపెడి రూపకత్రయము ప్రసిద్ధమైయున్నవి. ఇందు ఆగమేనను రూపకత్రయము విషాదనాటక ప్రపంచములో నిస్తుల కళావైభవ మొప్పారు మేటికథయై యున్నది. ఇస్కిలసు యవనపౌరుషము, స్వాతంత్ర్యభావములు మిన్నుముట్టెడి విజయసంతోష సంపద్దశలో రచియించుచుండెను. ఈతను యిద్దరునటులను ప్రవేశపెట్టి వాచకసంభాషణము

ప్రధానాంశముగ నెంచి నృత్యగీతముల భారమును తొలగించెను.

ప్రొమిథియసు బంధనమను రూపకవృత్తాంతమిది:— ప్రొమిథియసు దేవతా గణములలోని పురుషుడు. భూలోకమున నివసించు మానవులకు సుఖజీవనోపాయముల గల్పించు దయాపరివృత్తితో దేవలోకమునుండి యగ్నిహోత్రమును దొంగిలి తెచ్చి మనుష్యులకు కళాపరిశ్రముల గరపెను. నాకాధిపుండగు జూయసు (బృహస్పతి) యిందులకలిగి ప్రొమిథియసును పట్టితెప్పించి కాకససుపర్వతముల శిలాశిఖరతలమున నెండ వానల నిండుతాకిడి దాకునట్లు యీతని బంధింపజేసెను. ఇందుకు నియమింపబడిన హెపీస్టసు అను యోధుడీ క్రూర కృత్యమున కిష్టపడక మానససంక్షోభ మొందుచుండెను. వీనిమతిత్రిప్పుటకు జూయసు బలోత్సాహముల నెడి యుద్దేవనితల బంపించెను. వీరిప్రబోధమహిమచే హెపీస్టసుజూయసు ఆదేశమునకు లోబడి ప్రొమీథియసును, బంధించి బాధపెట్టెను.

ఆగెమెనను రూపకత్రయములోవి స్తరింపబడినకథాంశమిది:— టాజ్రిను యుద్ధసందర్భమున ట్రాయిపట్టణమున కేగి, యాగమెనను ఇంటికితిరిగి వచ్చినపుడు దుశ్శీలయగు నాతని భార్య వానిజంపివైచెను. ఇందును ప్రతీకారముగ నాగమెనను తనూజుడామెను, (అతనితల్లిని) ఆమెనుంచుకొనిన వానిని బరిమార్చెను. అంతట యమశక్తులీ మాతృఘాతకుని వెంటదగిలి శిక్షింప నుద్యోగించిరి. ఈతను

పశ్చాత్తప్తుడై తిరిగితిరిగి యాతెన్సునగరమందలి దివ్యస్థానమున పాపవిమోచనమొందెను.

భువనశాసకుడగు పరమేశ్వరుడు కరుణాసముద్రుడనియు, దుష్టులశిక్షించి శిష్టజనంబుల గాచు సమవర్తియనియు ధర్మస్వరూపుడనియు, మతములు ఘోషిల్లుచుండ లోకములో నెందరో దుర్మార్గులు సకలసంపదల వడసి సుఖించుటయు, సదాచారశీలురగు మహనీయులెందరో, వంతలజిక్కి చింతిల్లుటయు సామాన్యముగ జరుగుచుండెడి విషయమే భగవంతుని దయాధర్మసత్వమును యిట్టి విపరీతములతో సమన్వయ పరచనెంచి యీస్కిలసు జంతువు లనుభవించు సుఖదుఃఖములు వాని ప్రాక్తనకర్మ విశేషమున భిన్నరీతుల నడచుచుండుననియు, మానవులేగాక దేవతలుకూడ కర్మబద్ధులై సుఖదుఃఖముల ననుభవించుచుందురనియు, ప్రారబ్ధ సంస్కారఫలిత మిహమందు యెట్టిదైనను పరిణామమున ధర్మప్రతిష్ఠాపనమే సదాచారవిజయమే లోకమందగు పడుచున్నదనియు నూహించి తన రూపకరాజములం దీతత్వమును వెల్లడించెను. పూర్వుల పాపపుణ్యములు మానవవంశములలో నిలచి వాని పతనాభ్యుదయములకు హేతువగుచుండునను భావముకూడ యీని నాటకములలో విస్తరింపబడినది. యిస్కిలసు కల్పించిన రూపకపాత్రిములు, ధీరోధారవీరస్వభావ మొప్పెడి మహాపురుషులే. వీనికావ్యకల్పనము చిత్రిసౌందర్యమువను, భావపాటవమునను అర్థగాంభీర్యమునను, పొంగిపొరలు చుండును.

## సాఫోక్లీజు 495-4?5 B.C.

యవననాటకకవులలో మేటియగు నీతడు యాతెన్సునగ

మున జనియించి చక్కగజదివి, నాటకరచనమున కిరువదిమా ర్లు బహిరంగసన్మానములందికొని యాస్కిలను తరువాత మేటి కవియై వెలుగుచుండెను. ఈతను, పెరిక్లీసుభూపాలుని సాంగత్యసంపోషణంబున ముద మొంది సుఖించుచు నూటము ప్పదినాటకములు రచియించెను. వీనిలో ఏడుమాత్రమే నిల చియున్నవి. ఈతడు నాట్యరంగమున నలుగురుపాత్రముల ప్రవేశపెట్టెను. నృత్యమేళమును సంస్కరించి నాటకరంగా లంకారములను దుస్తులను నవ్యరీతుల గల్పించి నాటకప్రద ర్శనముల కెంతయు మనోహరంబుగ నొనర్చెను.

సొఫోక్లిజు రూపసౌందర్యమునకు బేరొందిన యువను లలో నతిరూపుడని చెప్పవచ్చును. గాత్రమాధురి రూపసౌం దర్యములతో దులదూగుచుండెను. 15వ యేట పారశీకుల నోడించిన యవనజాతీయమహోత్సవసంధర్భమున విజయగీత ములు బాడుటకీ సుకుమారసౌందర్యరాసి నియమింపబడెను అప్పటినుండి యీతను నాట్యప్రదర్శన మందుత్సాహుడై నాటకకవియై లోకఖ్యాతరూపకరత్నంబుల గల్పించి చిరంజీవి యాయెను. వీనికాలములో యవనమానసముల బుగకరిం చుచుండిన యుదారభావము లీతని రూపకములందు వెలుగొం ది యున్నవి. అల్లికపొందికకు సర్వాంగసహాకారమునకు భావ వికాసమందును పదప్రయోగమందును, ప్రకటితమగునిగ్రహ మునకును ఈతని రూపకల్పన మద్వితీయకళాసౌందర్య మొలి కించుచున్నది. నాటకములలో దేవతాన్యవహారముల జాల వరకు తగ్గించెను. మనుష్యుని యహంకారమునను మనోవృ త్తులచేతను, మానవుల యాప్తితార్థములు ఆదర్శములు భిన్నమై

నాటకకథలందు చూపదగిన జీవితావస్థలు వోడమునని యూహించి నాటక కథావిన్యాస మంతయు షేక్సుపియరుమహాకవి వలె మనుష్యుల గుణములననుసరించి పరిణమించునట్లు చిత్రించియున్నాడు. ఇందుచేత యీతనినాటకములు లోకానుభవమునకు సమీపముగనుండి సుబోధకముగను నీతిదాయకముగను, మనోరంజకముగను వున్నవి. ఇస్కిలసు యవనుల మూఢవిశ్వాసములను మరువజాలకుండెను. యూరిపిడీసు ప్రత్యక్షానుభవమునే విశ్వసించి తన నాటకములలో దైవప్రభావమున కెట్టి గౌరవ మేర్పరచియుండలేదు. సాఫోక్లీజు వీరిరువురి మధ్యమార్గమును అవలంబించి మానవసంకల్పముల శాసించు యీశ్వరసంకల్పములుగలవనియు, మానవప్రయత్నములు ప్రకృతిలోని సనాతనధర్మముల కొంగి ఫలించుననియు, సద్వర్తనము, ఆత్మనిగ్రహము, మనోనిశ్చయము, జయకారణములగుననియు తన నాటకకథలందు నిరూపించియున్నాడు.

ఈతని నాటకములలో అజాక్సు, యీడిపసు, యాంటిగోను, ప్రధానమైయున్నవి. అందు యీడిపసు యవనమహానాటకములలో నెల్ల రసభావసమగ్రసౌందర్యమునకును, కల్పనచాతుర్యమునను వాసికెక్కినది. ఈ నాటకము యిప్పటికినీ ప్రదర్శనానుకూలముగ నున్నది. ఇది యీడిపసు, టిరానసనియు, యీడిపసుకలోనియస్ననియు, రెండుభాగములుగ నున్నది.

తీబ్సునగరము నేలుచుండిన లయసు అను రాజునకు యీడిపసుఅను పుత్రుడుదయించెను. ఒక జోస్యుడు వచ్చి

యీతనిచేత నారాజు మరణించునని చెప్పినందున లయను స్వ ప్రాణసంరక్షణార్థము కొమరునిజంపనెంచి కాలుచేతులకత్తితో బొడిచినిర్జనగతలంబున జావవిడచెను. అపర్వతపరిసరంబులపశు వులగాచు గొల్లలాముద్దుబిడ్డనిజూచి గొనిపోయి కారిస్తురాజ్య పాలకుడగు పాలిబస్సునకు అర్పించిరి. ఈరాజుఅనపత్యుడగుట నీబాలుని స్వకీయదత్తపుత్రునిగభావించి సాకుచుండెను. ఇచ్చ టకూడ నొకజోశ్యుడగుదెంచి యీబాలుడు పితృఘాతకుడ గునని చెప్పిపోయెను. విధివశంబున గొంతకాలమునకు యీడిపసు తన కన్న తండ్రి లయసును ఆకస్మికముగ మా ర్గమునట తటస్థించెను. తనతండ్రియని సంగతి యీతడెరు గడు. వీరికయ్యమున లయసు పరాజయమొందె నిహతు డాయెను.

ఈకాలమున నొకదుష్టదేవత తీబ్సునగరమునకు వచ్చి తానడిగిన దుష్కర సమస్యసల విప్పి జెప్ప జాలని పౌరులనెల్లబాధించి పీడించుచుండెను. తీబేయులెంతయు వెర గంది తమదేశమును దుష్టపిశాచపీడనమునుండి తప్పించి రక్షిం చు వీరపురుషునకు రాజ్యాధికార మొసంగుటయేకాక లయసు రాజ్యమహిషిని ఇచ్చి పరిణయించెదమనికూడ నలుదెసల చాటించిరి. ఈడిపసు యీవృత్తాంతమును విని తీబ్సుపురమున కేగి పాడుపిశాచమును వాగ్వాదమున నోడింప నిచ్చగించి నిలచెను. "మూడునాల్గు రెండుపాదాలుగల జంతువేది? పాదా లెక్కువైనకొలది బలహీనమగుచుండు యీజంతువ పేరేమి?" యని దుష్టపిశాచ మీడిపసును అడిగెను.

"అది మనుష్యుడ" ని యీడిపసు ప్రత్యుత్తరమొసంగ
నీతని బుద్ధివై శద్యమున కచ్చెరువంది యుడికిలి పిశాచ మాత్మ
హత్య గావించుకొనెను. తీబ్సునగరము, నీవిధముగ రక్షించి
ప్రజాగౌరవము పొంది సింహాసనమెక్కి తనపుట్టుక నెఱవెరుంగని
లోపమున లాయసుపత్నియు తనతల్లియు నగు రాజ్యమహిషిని
జేపట్టి ఆమెతో సంసారసుఖ మనుభవించి, పెక్కుబిడ్డల
గనెను. ఇట్టిసమయములో తీబ్సురాజ్యమున సాంక్రామిక
వ్యాధులోపమి జనులందరు బడయుచుండిరి. ఈకష్టమెందుకు
కలిగెనో విచారింప లాయసును చంపిన పాపియెవరో తెలుసు
కొనవరకు దేశమందు శాంతి కలుగనేరదని యొక విజ్ఞుడాదే
శించెను. ఈడిపసు విచారింపగ కాలక్రమమున తానే లాయ
సును చంపిన పితృఘాతకుడని తెలుసుకొనెను. ఈ ఘోర
వృత్తాంతమెఱిగి రాజ్యమహిషి ప్రాణాంత మొందించుకొనెను.
ఈడిపసు తానజ్ఞానముగ నొడిగట్టుకొనిన ఘోరపాపములకు
జింతిల్లుచు పితృఘాతుక, మాతృసంగమన మహాపాపములకు
ప్రాయశ్చిత్తముగ కనుదోయి నులిమికొని గ్రుడ్డివై, జింతిల్లు
చుండెను. ఈడిపసు కలోనియసు ఆటలో ఈడిపసు యాతె
న్సునగర సమీపోద్యానమందు తన ముద్దు
కూతురు యాంటిగానెం నుపచరించుచుండ మరణ
విభూతినొంది తన దైహిక మానసకష్టములనుండి గడతేరిన
వృత్తాంతము నివేదింపబడియున్నది. ఈ నాటకమందలి
పాటలు మిక్కిలి మనోహరముగను భావపూరితముగను
న్నవి. ఈడిపసు టిరానసులో యీవీరుని విజయము
రాజ్యాభిషేకము పత్నీసమాలంబనము మున్నగు సంపత్సం

తోష సుఖజీవనములో తానొనర్చిన యజ్ఞానకృతమును తెలిసి కొనెడి మహావిషాద సందర్భము విస్తరింపబడి యున్నది. నవీనకవులలో కార్నెల్లీ, డ్రైడను, వాల్టేరు, యీగాథ నుప యోగించి కొన్ని నాటకముల రచించియున్నారు.

## యూరిపిడీజ్ 480-405 B.C.

యవనమహానాటకరచయితలలో (ట్రాజికురూపకములు) చివరవాడు. ఈతను సలామిస్సునగరమున జనియించి, అనెక్సాగరసువద్ద శాస్త్రాధ్యయన మొనర్చి సాక్రటీసు మున్నగు తత్వజ్ఞుల చెలిమివడసి, 75 ట్రాజెడీలను రచించెను. అందు 18 మిగిలియున్నవి. వీనిలో నైతికసమస్యల చర్చించు నుద్దేశ్యమగుపడుచున్నది. అందుచేత ఆకాలపు రసజ్ఞులీతనికృతులందు, అస్పష్టత, పుష్టిహీనత ఎల్లరెరింగిన మిట్టవేదాంతములు నిరంతర నీరసోదాహరణము మున్నగు దోషముల నెంచుచుండిరి. గాథాకల్పనమందును, రసభావ పోషణములందును, ఇస్కిలసు, సాఫాక్లీజుల కావ్యసిద్ధి వీనికేర్పడలేదు. కాని యీతని రూపకగీతములు మిక్కిలి మనోహరములై జన సామాన్యమున ప్రాకి యాదరింపబడుచుండెను. ఈతనినాటకములలో ఆల్సెస్టిసు, మీడియా, ఆండ్రోమిక మున్నగునవి పేరొందియున్నవి.

## ఆరిస్టాఫనీసు 448—380 B.C.

కామికురూపకములను రచించుటలో జగమున నద్వితీయ చాతుర్యమొందిన హాసమహాకవి. భావకవిత్వమందు ప్రపంచములోని పెద్దపేరులలో నొకడు. భర్తృహరివలె మిక్కిలి గౌరవించదగిన సర్వజనామోదకరమగు నీతి

బోధక పద్యావళుల రచించుచుండెను. యవనుల ప్రాచీన ప్రహసన రూపకములను ఈతని కల్పనలుదాహరించుచున్నవి. పారశీక సమరము నాటి ప్రాచీన యవనాచారములీతని యాదర్శములై యుండెను. ప్రజాస్వామ్యమర్యాదలీతనికి రుచింపలేదు. మతనైతిక విశ్వాసములను తార్కికవాదములతో ఖండించు విమర్శకపద్ధతులీతనికి విపరీతముగ దోచుచుండెను. యోధులు, మబ్బులు, కందిరీగలు మున్నగు మొదటిరచనలయందు సమకాలిక పూరుషులనిందించు వ్యక్తివిమర్శక హాస్యప్రసంగములు విశేషముగ నున్నవి. సాక్రటీసును ప్రత్యేక విరోధభావములతో బరిహాసించుచుండెను. తరువాతి పురుగులు, కప్పలు మున్నగు ప్రహసనములందు, వ్యక్తిపరిహాసము తగ్గి ధర్మములను, ఆచారములను, విమర్శించుపద్ధతు లేర్పరచెను. నృత్తమేళము ధరియించిన యుడుపులబట్టి యీతని కామెడీల పేరులేర్పడినవి.

కథాకల్పన మందితడు చతురుడు కాడు. ఆకాలపు సాంఘికజీవనాంశములు వ్యక్తిసందర్భములు మనకు తెలియవు గాన వీనిదెబ్బల చురుకుపోటుల గ్రహింపజాలము. కానిహాస్యరసోద్దీపనమందును, నవ్వులాలికెడి కథపట్లుగల్పించుటందును వీనిప్రజ్ఞావిశేషమెంతయు, భాసిల్లుచున్నది. వీని ప్రహసనములలో ప్లూటసు, విందులు మున్నగు తొమ్మిది నిలచియున్నవి.

మాసిడోను రాజులు యవన సామ్రాజ్య భారమును వహించినకాలములో మినాండరు అను హాసకుడు నవ్యప్రహ

సారీతులను వికసింపజేసెను. కాని యీతనికల్పనలంతరించి రోమకకవుల యనుకరణములందు వీనిస్వరూప మగుపడు చున్నది.

యవనుల నాట్యకళాభివృద్ధి, ఆజాతియందు భక్తి జ్ఞానములు, దేశారాధనవ్రతములు స్వాతంత్ర్య విజయాదర్శ ములు మిక్కుటముగ వెలుగుచుండి, భావవికాస మధ్యత నవ్యకాంతుల దేజరిల్లుచుండిన కాలములో నేర్పడినది. ఇస్కి లసు నాటకములలో మతాభిమాన గాంభీర్యభావములు పొం గుచున్నవి. సాఫొక్లీజు రూపకములందుదార మానవసౌహా ర్ద్రము తడియారుచున్నది. యూరిపిడీజు విశాలానుకంప మూడ యింపజేసి మహానాటకముల కుచితమగు కరుణారసము విశ్వ ప్రభావము భావసంక్షోభము మున్నగు ట్రాజిడీలక్షణముల విస్తరించెను. వీరిమార్గమువలంబించి రచించిన సెనీకాయను రోమకకవి నవీనపాశ్చాత్య భావరూపకముల బాదుగొలిపిన మార్గదర్శియైయున్నాడు. యవనులరంగాలంకార నైపుణ్యము యిప్పటికిని యాశ్చర్యదాయకమై యున్నది. వినువీథినుండి దేవతావిమానములు భూమిపై వ్రాలునట్లును, దేవభూతగణం బుల దివ్యమహిమలు రూపవిపర్యయములు గోచరించునట్లును ప్రకృతిలోని రమణీయవననదీ శైలరంగములు కన్నులగట్టి నట్లు నాట్యరంగమున ప్రదర్శింపబడు వింతలన్నియు, యవ నులు జూపనేరిరి. నటులు ఆనాటి మహాసభలలో ప్రేక్షకు లందరు వినునట్లు నోటిలో స్వరవర్ధినీ యంత్రములజాల్చి పలు కుచుండిరి. యవననాటకముల కథాసందర్భములు కాలపరి దేశనీమముల బాటించి యల్లబడెను. సభాస్థలము పెద్దదగు

టచే వాచిక ముపన్యాసధోరణి నుచ్చరింపబడుచుండెను. అందుచేత నటులు స్వగతములను అన్యోక్తులను తమ మానస సంక్షోభ తరంగములను వెల్లడించు సూచనలను చేయకుండిరి. ఈనాటి నాట్య సమాజాంగణములు చిన్నవగుటచే నటుడు తన మానసమం దుదయించు పిల్లతలపుల సమాజమునకు శృతికాకు భేదమమరిన వాచికములతో దెలుపగలిగి యున్నాడు. యవన పరిషత్తులందిట్టి వాచిక మనాచరణీయముగ నుండెను. కథాసందర్భములు యవనదేశీయు లెల్లరెరింగిన పురాణేతిహాస వృత్తాంతము లగుటచే వాచికసహాయమున సామాజికులు కథాక్రమమునవలీలగ దెలుసుకొనుచుండిరి.

యవన పత్తనములలోని గృహమేధులందరు నాటక ప్రదర్శనమున కుచితముగ పోవుచుండిరి. నాటక కవులు, నటులు, శిల్పకులు, రాజ్యనిధులనుండి పోషింపబడుచుండిరి. రూపక శాస్త్రమును బహిరంగమగు పోటీ పరీక్షలలో నిర్ణయించుచుండిరి. ఛందములకు జన బాహుళ్య మెన్నుకొనిన రసిక పరీక్షాధికారులు కళావిమర్శకులు సభాధ్యక్షులై మంచి చెడ్డల నిర్ణయించుచుండిరి. సన్మానిత సత్కవుల నేకరీతుల గౌరవింపబడిరి. కథాసందర్భ మతికి యుండిన రూపకత్రయమును కవులు పరీక్షార్థ మర్పించుచుండిరి నాటక పరీక్షా సమయములందు ప్రజలత్యంతోత్సాహ సంచలితులై దేవతోత్సవములం దగుపడెడి, వినమ్రి గౌరవాదరణములను, కుస్తీ పట్లులందగుపడెడి యుత్సాహమును ప్రకటించుచుండిరి. యవన రాజ్యములలోని ప్రజలందరు కావ్యశిల్పాదుల మంచిచెడ్డ లెరుంగు కళాసంస్కార మొప్పుచుండిరి. ఈకాలములో భా

గ్యవంతులు పనిలేని విటయువజనంబులు విద్యావాసనల చవి చూడని పాటకప్రజనులు విహారవిశ్రాంతు లపేక్షించి నాటక సభల కేగుచు, ప్రదర్శన కాలమందుకూడ తమ వలపుతలపు లనే, విత్త వ్యవహారములనే ముచ్చటించుకొనుచు నాట్యకళా రహస్యముల గుర్తించు, శ్రద్ధాభక్తు లేర్పడని, యుదాసీన సమాజమును గూర్చుచున్నారు. యవనసమాజములు రూప కాభినయ సందర్భములను మిక్కిలి యాదరణతో, అభిమాన ముతో గగుర్పాటుతో గారవించి, నాట్యకళా రహస్యముల దెలుసుకొనుచుండిరి. యవనులిట్టి యలౌకిక, కళాభిమాను లగుటచేతనే వీరి లలితకళాప్రసూనము లత్యంత రామణీయక ములై నిరుపమచాతురీ విరాజితములై నిస్తుల సౌందర్యమున శోభిల్లుచున్నవి.

యవనరూపకకవులు పరీక్షార్థము రూపకత్రయ మర్పిం చుచుండిరి. పరీక్షలు దేవతోత్సవ సమయములందు జరుగు చుండెను. హిందూదేశమున కూడ ప్రాచీననాటక ప్రదర్శ న ముత్సవ సమయములందె జలిగెనను నిదర్శనము లున్నవి. మరియు కాళిదాస మహాకవి మూడు నాటకముల రచించి యున్నాడు. అందురెండు భారతసంభవమునకు సంబంధించి యున్నవి. భవభూతి రచించిన రూపకత్రయములో రెండు శ్రీరాముని లౌకిక సమరవిజయమును ఆధ్యాత్మిక విజయమును దెలుపుచున్నవి. శ్రీహర్షుడు రత్నావళి నాగానందము ప్రియ దర్శిక రచించియున్నాడు. వీరు మూడేసి నాటకములను వ్రాయుట నాయికానాయకుల స్వభావములను ప్రణయ పరి ణామ లక్షణములను వేర్పరచి విస్తరించి చూపుటకా? లేక

యవన సీమలందువలె మనదేశములో కూడ నాటకపరీక్షలు జరిగినవా? కాని భాసుడు కాళిదాసునకు పూర్వముండి అనేక నాటకములు వ్రాసినాడు. తరువాత సూద్రకుడు, విశాఖదత్తుడు, విష్ణుగుప్తుడు, మురారి, జయదేవుడు, ఒక్కొక్కటి వ్రాసినారు. కాళిదాసు యవనాచార మనుసరించి రూపక త్రయము రచించెనని నమ్మవచ్చును.

---

## II

## రోమకరూపకములు.

చాలవరకు యవననాటకముల అనుకరణములే, కాని, నవీనపాశ్చాత్యరూపక వికాసమునకు రోమకకల్పనలు పునాదులైనవి. యవనసీమలు రోమకుల యాధీనమున జేరి, B.C.168 తమ సాహితీకల్పనలచే విజేతల మెప్పించులోపల నిటలీదేశములోని కంపానియా మండలమందు పల్లెటినటులొక విధమగు ప్రహసనము లాడుచుండిరి. ఆటిల్లా కామెడీ అనబడు ఈప్రాకృత ప్రహసనంబులు ఇటలీ దేశమందు స్వతంత్రముగ నేర్పడిన రూపకవిశేషములు B.C. 210 లో కంపానియా మండలము రోమకరాజ్యమున సంక్రమించెను. తదాది, ఆటిల్లా ప్రహసనములు రోమునగరమందు ప్రదర్శింపబడుచుండెను. ఆకాలములో, రోమకుల జయధ్వజములు విదేశరణభూముల నలంకరించుచుండెను. ఇట్టి సామ్రాజ్య వైభవానుభవకాలమందు రోమకకవులు సారస్వతారంభముల మొదలిడిరి. వీరు ఆటిల్లా

పరిహాసనములను బెంచి, లోకవిఖ్యాతిమగు హాస్యరూపకములు గల్పించిరి. అట్టి హాస్యనాటకములలో కథాకల్పనము, పాత్రపోషణము, మిక్కిలి చమత్కారయుక్తముగ నుండి యూరపులోని నలుదెసల జనామోదమొంది గౌరవింపబడుచుండెను. వీనిలో విదూషకునిబోలు తిండిబోతొకడు, కొందివ్వారు వికారస్వరూపి యొకడు, తెలివితక్కువ పల్లెటిమొద్దు యొకడు, పలువన్నియల బొంకనేర్చిన పోకిరీయువకుడొకడు సామాన్యపాత్రలుగ నరుదెంచుచుండిరి.

ఆండ్రోనికసు అను రోమకకవి యవనరీతులలో నాటకములను, ప్రహసనములను, లాటిన్ భాషయందు రచించెను. మరికొందరుకవులు యవనరూపకములను తమ భాషలోనికి నంతరించుచుండిరి. కాని రోమకరూపకకవులలో మిగుల ప్రసిద్ధినొందిన

## ప్లాటసు (254-184 B.C.)

ప్లాటసు యవనరూపకముల ననుకరించి వ్రాసియు, తనకాలములో రోమకసంఘమందుండిన యాచారమర్యాదలను పాత్రములను కథాంశముగ గైకొని నేర్పొప్ప రచియించుచుండెను. వీనిరూపకములందు హాస్యరసముప్పొంగిపొరలుచుండును. కథాకల్పన మిక్కిలిచమత్కారముగ నుండును. ప్రహసనరచయితలలో ఆరసిపెనుపేరు, గణించియున్నాడు. ఈతనునిక్కముగ నగస్టసు చక్రవర్తి కాలములో వెలువడిన రోమకజాతీయ సారస్వతరీతులను మొదలిడలేదు. దీని పునాదులు యిన్నియస్సు అను కవిపుంగవుడు, ప్లాటసు తరువాత కొంతకాలమున కేర్పరచెను. కాని యవనమాతృకల ననుసరించిన

వాడయ్యెను, ప్లాటసు నిజప్రతిభా ప్రభావమున, తరువాతి హాస్యరూపక రచనమునకు మార్గదర్శియై మూలపురుషుడై వెలుగొందియున్నాడు. ఈతని కాప్టీవ్సు (బంధితులు) అను రూపకము నాటకప్రపంచములోని మహోత్తమనాటకమని కొందరభిప్రాయ పడుచున్నారు. వాగుడు సిపాయి, కవల బిడ్డలు, ఆలేరియా, దయ్యము, బేడకాను, మున్నగు రచన లిప్పటికిని సుప్రసిద్ధములై నిలచియున్నవి. జాన్సను, షేక్సుపియరు, మొాల్యేరు, డ్రయిడను మున్నగు నాటకకవులీతని కథాసందర్భములను పాత్రస్వభావములను సేకరించి తమ కల్పనలందు కొంచెము మార్పుతో జేర్చియున్నారు. ఈతని నాటకములందు మానవస్వభావ పరిజ్ఞాన మెక్కుడు గోచరించును. సంభాషణము, శారదముగ, దీందిప్రించుచు అందముగ నుండును.

## టెరెన్సు (టెరెన్సు 185-159 B.C.)

ఈతను యవననాటకముల సంతరించుచు రూపకరచన మారంభించెను. వీనిశైలియు భావములు రచనానైపుణ్యము పాత్రపోషణము, ప్లాటసురచనలను మించి యుండును, కాని హాస్యరసమం దాతనికి జంకిపోవును. నాటకచరిత్రలో నీతని ప్రభావము ఎంచదగియున్నది.

ఈతనిపాత్రలు ప్రత్యేకవ్యక్తుల వెక్కిరింపులు కాక లోకసామాన్యమందగుపడు హాస్యసందర్భముల దెలుపు జాతి మూర్తులై యున్నవి. (Types) ఇతని మానసము కరుణానుకంపమున సాధుసద్భావములతో లలితమర్యాదల నంటి జగత్కళ్యాణ మపేక్షించెడి, సత్వరసముతో, జరించుచుండును

యవనకవి మినాండరుని పోకడల గొన్నిటి స్వీకరించినను స్వకీయకల్పనశక్తియే వీని ప్రహసనముల రంజింపజేయుచున్నది. ఇతని నాటకములలో యాండ్రియా, హెస్సైరా, కొజ్జా ఆత్మఘాతకుడు సోదరులు మన్నగునవి, లభ్యమగుచున్నవి.

### సెనీకా (4 B. C.—65 A.D.)

స్పెయిను దేశీయుడు. లాటినుభాషనభ్యసించి పెక్కు గ్రంథముల రచించిన మతిమంతుడు. ఈతను యూరిపిడీసు తొక్కిన దారిలో కొన్ని లాటినునాటకములను రచించి తరువాతిరచనల కెంతయు నుపయోగమొనర్చెను. తరువాతి పెద్దకవులనేకులీతని పాత్రముల నాశ్రయించిమేలొందిరి.

క్రైస్తవశకారంభమున రోమసామ్రాజ్యము ప్రజాస్వామికప్రభుత్వమునుండి తొలగి క్రమముగ సర్వాధికారులగు చక్రవర్తుల యేలికలో నొదిగియుండెను. ధనికులు భూస్వాములు విషయలోలురై డాంబికజీవన మభిలషించుచుండిరి. జనసామాన్యము చపలచిత్తులై విషయవ్యాసంగమున దూలి సోలుచు విహారవినోదార్థము నాట్యసభల కేగుచుండిరి. నాట్యసభలపరిమితియు పెల్లుబ్బి వాచికాభినయము నిరుపయోగమగుచుండెను. అందుచే రోమకచక్రవర్తులకాలమందు మూకాభినయ వైఖరులు, ఆంగికసంచలనమున భావప్రకటన మొనర్చెడిరీతులు వికసించి, రూపకరచనమందలి వాచకము, అడుగంటుచుండెను.

## III
## మధ్యకాలము.

సెనీకా గతించినదాది పదియవ శతాబ్దమువరకు యూరపులో స్మరియింపదగిన నాటకరచన మేర్పడ లేదు. 10వ శతాబ్దమున జర్మనీదేశమందు హ్రాశ్విత యను విరాగిణి రోమకరీతు లనుకరించి తనదేశ భాషలో కొన్ని రూపకముల రచించెను. వీనియందు మతాభిమాన మెక్కువ నిండి యున్నను, చక్కని రసావస్థలు, యుదారభావములు, సొంపగు కవిత్వము, చేరి యందగించుచున్నవి. రోమకక్రైస్తవుల మతాచారములు నాట్యకళ కనుకూలింపనందున నాటకరచన మరుగంటి జిక్కిపోయినది. తొల్లిటి రోమక మతాచార్యులు సన్యాసులై, యింద్రియనిగ్రహమే పరసాధనముగ నెంచి నాట్యాది లలితకళలందు, ఉదాసీనముగ వర్తించిరి. కాని యూరపునందు, నవీనరాజ్యము లేర్పడి ప్రజలు క్రైస్తవమత మవలంబించి శాంతిసుఖముల వడసి, జీవించు కాల మేతెంచినపుడు, యూరపులో క్రైస్తవాలయములు మొత్తంబులై వెలసి ప్రభుసన్మానమున ప్రజా సమర్పణంబున విభవోపేతులై దనరారుచుండెను. మతాచార్యుల యాధీనమున మితిలేని ధనరాసులు మూల్గుచుండెను. దీనిని లలిత కళాపోషణ కుపయోగింప మొదలిడిరి. మతవ్యాపకముకొరకు జనసామాన్యమునకు క్రైస్తవ జీవితాంశములందు ఉత్సాహ మొదవించుటకొరకు మతాచార్యులు రూపక ప్రదర్శనము లారంభించిరి. వీనినిచూచి జనసామాన్యము నాటకములాడ నారంభించెను. మరియు కొన్ని ప్రహసనములకూడ నాడు

చుండిరి. వీరి కల్పనలందు, పాత్రపోషణము లోపభూయిష్టమై సంధి నియమములు నిరాకరింపబడి యుండెను. మతాచార్యుల ప్రాపకమున నేర్పడిన మొరాలటీ, మిస్టరీ, మిరకిలు, రూపకములందు, జగన్నాథుని వేషము, క్రీస్తువేషము, సైతాను, బైబులు కథల స్త్రీ పురుష పాత్రములు విధిగా వచ్చుచుండెను. ఈనాటకములు ఫ్రెంచి దేశమున తలయెత్తి క్రమముగ యూరపంతట నల్లికొనినవి. కొంతకాలమునకు వీనిలో హాస్యాదిలౌకిక ప్రసంగములు మిక్కుటమై మతబోధ తగ్గువడెను. దేశమందు సంచరించుచు, ప్రదర్శించెడి జనవినోదులు పయిల్ మానులు మున్నగు యాచక నివహంబులీ యాటల నాడదొడగిరి. ఇంతలో యిటలీదేశపుఆటిల్లా హాస్యరూపకములు యూరపునందు వ్యాపించి ప్రజారంజకములై వీని లక్ష్యమున ననేక హాస్యనాటకములు, రచింపబడెను. ఈ ప్రహసనముల లోని పాత్రలు కథాసందర్భ మవలోకించి అప్పటప్పుడు తామే యల్లుకొనిన వాచకముల నుడువుచుండిరి. అనగా నటునకు సందర్భోచితమగు వాచకము తనకు గా గల్పించుకొని వచించెడి స్వాతంత్ర్యముండెను. అథవా నిర్ణీతవాచకమును, కొంతవర్జించి, దానిని నటుడిచ్చవొప్పున మార్చుకొను అవకాశముండెను. వీరు ప్రాచీన యవనరోమక రూపములందలి కొన్నిపట్లను తమ వాచకములో జేర్చుకొనుచుండిరి. 16 వ శతాబ్దమునకు యిట్టి సంచారీసమాజములు యూరపులోని రాజసభలందు, తమ తెలివితేటలజూపి యీనాము లందికొనెడి మర్యాద లేర్పడినవి. 1590 లో గెలోసీహాస్యమేళము యిటలీనుండి ఫరాసు రాజ్య

స్థానమునకు వచ్చి ప్రభుసన్నిధిలో తమ యాటమెరుగుల వెల్ల డించిరి. వీరి యాదర్శమున ఫ్రెంచిదేశములో స్వతంత్ర నాట్యోద్యమ మేర్పడెను. షేక్సుపియరు మహాకవి ఎస్విదేండ్ల బాలుడై యుండినపుడు 1574 లో మార్టినెల్లీ సమాజమును యిటలీహాసకులు ఆంగ్లదేశమునకేగి తమ నటకౌశలము జూపు కొనిరి. షేక్సుపియరు వీరి ప్రదర్శనముల జూచెనని నిక్క ముగ చెప్పజాలము. కాని వీరియాటలలో చేర్పబడిన గాథ లుకొన్ని రోమకమహాకవి ప్లాటసు కల్పనలనుండి సంగ్రహింప బడినవి, ఇంగ్లాండులో నలచి షేక్సుపియరునకు కొన్ని సందర్భ ముల నందించెను.

## IV

### నవీననాట్యకవితారంభము.

16, 17 శతాబ్దములందు యూరపులో నాట్యకళ ప్రజాసమాజముల స్వైవశమున జిక్కి జనబాహుళ్యమునకు రుచించు క్రొత్తమొగ్గల దొడగుచుండెను. విద్యాలయము లందు ప్రాచీనయవనరోమక నాటకములు విద్యార్థులచే ప్రద ర్శింపబడుచుండెను ఇటలీలో సోధాసిస్సా (1502) యవన మహానాటకముల నభినయించుచుండెను. ఈతడు కొంతస్వతం త్రించి వానిలో కొన్నిమార్పుల గావించి స్థలకాలనియమముల నిరాకరింప దొడెగెను. ఇటులనే ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీ, దేశములందు విద్యార్థులు ప్రాచీననాటకముల ప్రదర్శించుచు జనసామాన్యము, మతప్రచారక రూపకములనుండి, యిటలీ దేశపు ఆటిల్లా కామిడీనుండియు, బరిణమించిన హాస్యరూపక ముల ప్రదర్శించుచుండిరి. కొన్ని ప్రాచీననాటకములు దేశ

భాషలలో సంతరింపబడెను. 1551 లో ప్లాటసు రచించిన రూపకమొకదాని నాధారపరుచుకొని నికోలసు యుడల్ అను ఆంగ్లేయుడు ఆంగ్లభాషలోని తొల్లిటి జాతీయ పరిహాసనము రచించెను.

దీనిపేరు (Ralph Roister Doister) తరువాత 1562 లో నార్టను బల్ హార్ట్సు అను జంటకవులు శెనీకా మాత్రుకల ననుసరించి గార్బోడక్కు అను తొల్లిటి యాంగ్ల విషాదనాటకమును రచించిరి. ఈ రెండు క్రొత్తనాటకములతో నింగ్లాండునందు నవ్యనాటక శకమారంభమైనది. యవనదేశమందు తొల్లిటి మోటనాటకము లెంత త్వరితముగ వికసించి రూపక సుస్వరూపముల బరిణమించెనో అట్టి జాతీయవిజయ సంతోషమే యెలిజబత్తు పాలితమగు నాంగ్లదేశమున కేర్పడ, 1562 లో మొలచిన గభీరనాటక కవిత్వము 1588 లోపల సంపూర్ణ కళావికాసమొంది పలుతెరంగుల విప్పారెను.

## క్రిస్టఫర్ మార్లో (1564-93 A. D.)

1588 లో ఆంగ్లమహాకవి మార్లోయను నాతడు తైమూరు మహావీరుని విజయచరిత్ర మితివృత్తముగ గైకొని టాంబురలేను అను మహానాటకము రచియించెను. షేక్సుపియరు మహాకవి యవలంబించి, పోషించి, సకల రసభావవాహక సామర్థ్య మేపార వికసింపజేసిన రూపకకావ్య పద్ధతులన్నియు మార్లోమనీషా కల్పితములై టాంబురులేనునందు మొలకెత్తి యున్నవి. యెలిజబత్తునాటి నాటకములందగుపడు భావస్వాతంత్ర్యము విశాలానుకంపము నవ్యావస్థల జవిజూచి సర్వతోముఖమగు జీవితానుభవముల నంపాదించు వేడు

కయు నీనాటకమున వెలుగొందు చున్నవి. టాంబురు లేను పదియంకములు గల్గి రెండు భాగములుగ ప్రదర్శింపదగిన నాటకము. మార్లోమహాకవి రూపక సంభాషణమున కనువగు పద్యకృతుల గల్పించి యాంగ్లనాటక రచనమునకు మార్గదర్శియై యుండెను. ఈతను ఫాస్టను, మాల్టాయూదు వర్తకుడు అను మరిరెండు నాటకములగూడ రచియించెను. వీనిలోని పద్యఖండము లాంగ్లకావ్య రత్నములలో జేర్పదగిన యంద చందము లొప్పుచున్నవి. మార్లో కల్పించిన పాత్రముల గొన్నిటిని షేక్సుపియరు గైకొనియున్నాడు. కాని, మార్లో రూపకముల కథాకల్పనము అంత పాటవముగ, రసవంతముగ నుండదు. వీనిలో నాయికలు లేరు. వీని నాయకులు సామాన్య పేదస్థితులలో పుట్టి ప్రతిభావిశేషమున మహోన్నత కార్యసిద్ధినొందిన, యాత్మవంతులై యున్నారు. టాంబురు లేను సంకల్ప ప్రభావమున బాహుబలమున జగముల నాక్రమించ గోరు రణోత్సాహమును సూచించుచున్నది. ఫాస్టను విజ్ఞాన సంపాదనమందనురక్తులై విద్యాబలంబున లోకమున వెలుగ దలచెడి మానసముల విపరీత చేష్టలను దెలుపుచున్నది. ఎటులైనను సంకల్పబలము, కార్యదీక్ష, ఆత్మవిశ్వాసము ప్రసంగింపగల లౌకికవిజయ మీతని నాటకములందు దేజరిల్లుచు, చేకూరనున్న ఎలిజబత్తు మహాశకపు ఆంగ్లవైభవపు మేలుకొలుపుల గూయుచున్నది.

## V

### ఎలిజబత్తునాటి ఆంగ్లరూపక విలసనము.

ఈకాలపు ఆంగ్లనాటక విరచనము షేక్సుపియరు మహాకవి కల్పించిన యమూల్యరూపక రాజములచే జగద్విఖ్యాతి

నొందియున్నది. కాని పెక్కుకవులు నాటకముల రచించు చుండిరి. వీరుత్రొక్కిన దారులు స్వతంత్రించి నడచిన మార్గములు వీరి కల్పనలం దగుపడు సామాన్య లక్షణములు షేక్సుపియరు మహాకవి కొకింత సాయమొనర్చి యుండుననుటకు సందియము లేదు. ఎలిజబత్తు కాలములో పలుముఖంబుల నాంగ్ల సారస్వతము విప్పారుచుండెను. అందు, నాటక రచన ప్రత్యేకవికాస మొందియుండెను. ఆకాలములో యూరపునందు అంకురించి యల్లుకొనుచుండిన స్వతంత్రభావ లతికలు ఆంగ్లేయుల విజయసంతోష పోషణమున మొగ్గదొడిగి పరిణామ సౌందర్యమొప్పెడి రూపక ప్రసూనంబుల నీనుచుండెను. షేక్సుపియరు మహాకవినిగూర్చి ప్రత్యేకముగ ప్రసంసించెదము. గాన నానాటి తక్కుడుకవుల నాట్యసేవ నిరొక్కముంజుగ ప్రసంసించెదము.

## డెక్కరు 157?-16?1.

ఆంగ్లనాటక కవి, సమకాలిక సాంఘిక వస్థల జిత్రించుటలో జాన్సను తరువాతి మేటితెలిరి. వీరి జీవితము కష్ట పరంపరలతో నిండి దుఃఖభరితముగ నుండినను ఈతని ప్రతిభ తన జీవితానుభవముల కళంకమును మాపి లలిత సౌందర్య మత్యాదరొప్పెడి లలితమనోహర హాస్య ప్రసంగములను చక్కని భావకవిత్వమును పోసంగింప గల్గెను. ఈతని పాత్రపోషణము నాయికాస్వరూప నిర్ణయము వీరిరూపకముల కెంతయు మెప్పువెచ్చినవి. ముచిలంజ, బొ...ిను ముద్దుపిల్ల మున్నగు రూపకముల నీతడు రచించియున్నాడు.

## బెన్‌జాన్సను. 1573–1637.

ఆంగ్లమహాకవులలో సకుంఠితపాండితీ విలసితులగు క్రొద్దిమందిలో జాన్సను ఒకడు. లండనులో పుట్టిపెరిగి కొంత కాలము నటవృత్తిలో గడిపి 1598 లగాయతు Every man in his humour, Cynthia's Revels మున్నగు ప్రహసనములను రచించెను. షేక్సుపియరుమహాకవి వీనిలో కొన్ని పాత్రలనైకొని యభినయించుచుండెను. 1603 లో సెజేనను అను విషాదనాటకమును ముప్పదిమూన్కులను రచించెను. తరువాత Silent woman, Alchemist, Catalian మున్నగు నాటకములరచించి కొంతకాలము యూరపులో సంచరించి యావల నాంగ్లదేశపు యాస్థానకవిమాళిగ వాసికెక్కి కొండొక కాలమునకు పేదవై యిడుములగుడిచి మృతినొందెను.

రూపకరచనమందు జాన్సనుభావ కవిత్వమున కెక్కువ యవకాశము లేర్పరచెను. కథాసంవిధానమందు ప్రధానోద్దేశమునకు (ఆధికారిక వృత్తమునకు) కథాంశములు స్పష్టముగ సూటిగ ప్రవర్తించు సంధిలక్షణములను చక్కగపాటించి రచించెను. ఈతనిశైలి సులువగు తేలికపదములతో క్రొద్దిలో నెక్కువ భావమును తెలుపు పదభావ సారళ్యమున జెన్నొందుచుండెను. ఇట్టి భాషాప్రయోగవైదుష్య మాంగ్లరచయితలలో జేసనుతత్వజ్ఞన కొకనికే చెల్లియున్నది.

## జానువెబ్బరు. 1580-1625.

ఈకవి మూడువిషాద నాటకములను మూడుహాస్య రూపకములను రచించెను. అందు వర్జీనియా తెల్లదయ్యము ప్రాధానగౌరవ మొందుచున్నవి. ఈత ననేక సమకాలిక రూపక

కవులతో జేరి మరికొన్నినాటకముల రచించెను. కరుణా భయానకరసములను బిగులు పట్టులను వెకిలిహాస్యమును పని వడి నేర్పొప్ప జిత్రించుపోడ. మెలో డ్రామాకు మహానాటక ముల భావగాంభీర్యమును లలితరస వత్కావ్యసౌందర్యమును అతికించి వన్నెవెట్టెను. ఈతని కథాకల్పనము సంధి దోష ములచే నంత మనోహరముగ లేదు. పాత్రస్వభావములతో నిలుకడ యగుపడదు.

## మెస్సింజరు. 1583-1640.

ఈకవి 15 నాటకముల రచించెను. వీనిలో సమకాలి కసంఘ వృత్తాంతములు హోగార్తు చిత్రములందువలె తెలు వొప్ప జిత్రింపబడినవి. కథా పోషణమందీతడు కడునేర్పరి. ఈతని నాటకములలో A new way to pay old dedts అను నది యుత్తమకావ్యమైయున్నది.

## 1584-1616 బోమాన్ ఫ్లెచ్చరు జంటకవులు.

వీరి సాంగత్యము తిరుపతివెంకటకవులవలె సత్కావ్య ఫలదాయకమై లోకఖ్యాతమిత్ర సత్వమున రాజిల్లుచుండెను. బోమాన్ జాన్సను రూపకములకు నాంది ప్రస్తావన రచించుచుం డెను. వీని రూపకములలో అల్లికబిగివి లేకున్నను పాత్రములు కథాసందర్భములు చక్కని పరిజ్ఞానముతో గల్పింపబడెను. కరుణారసము చక్కగ విప్పించుచు నాత్మీయభావవిలాసములు తడియారు లేతవలుకులతో ముద్దుగ ముచ్చటించబడినవి. ఔచిత్యము లేతహాస్యము వీనిముఖ్య లక్షణములు. ఈజంట కవుల నాటకములలో Philaster, Maids Tragedy, ప్రధాన గౌరవ మొందుచున్నవి. బోమ్మను స్వతంత్రముగ రచించిన

కానిలో Women hater, A king and no king ముఖ్యమైనవి. ఫ్లెచ్చరు వ్రాసిన సొంతనాటకములలో Captain Cupids revenge ముఖ్యములు. వీరి కల్పనలు షేక్స్పియరు మహాకవిచే విస్తారముగ నుపయోగింపబడినవి.

రోమకకవి సెనీకా భయానకరసము పోషించునటుల నాటకములకేర్పడు కథాసౌందర్యమును నిదర్శించియున్నాడు. బొమన్ జాన్సను మున్నగు వారి రూపకములందు పాత్రస్వభావము విశదముగ విస్తరింప బడినది. భాషాసౌకర్యమేర్పడినది. లలితరూపకమర్యాదలు చిగురెత్తి చెలువొందుచుండెను. పరిహాసనముల సామాన్యలక్షణ మింతవరకు వస్తుస్వరూపము స్వభావసిద్ధముగ జిత్రించుచు ప్రాకృతగుణంబుల హాస్యజాతీయములు జెప్పు కల్పనరీతియై యుండెను. గభీర భావోద్దీపనము మహానాటకముల లక్షణమైయుండెను. షేక్స్పియరుమహాకవి ఈరెంటినిసమన్వయించి క్రొత్తదారులద్రొక్కి సర్వ జనాదరణీయమగు నాటకముల రచింపగలిగెను. వీరి శృంగారగాథలు ఆకాలమందు జనాభీష్ట మొందుచుండెను. షేక్స్పియరు ఆకాలమునకు రుచించిన కథలనే తన నాటకములందుపయోగించి యున్నాడు, కాని యీతని ప్రతిభావైశద్య మనంతము. స్వభావ పరిజ్ఞాన మపారము. కరుణాప్రవృత్తు లౌకిక జగద్వ్యాప్త సహృదయమున రాజిల్లుచున్నవి. కథాకల్పన చాతుర్య మపూర్వము, నిరుపమానము, అద్వితీయము, భాషాసతివశ్యయై తలపులవెన్నంటి నిరాఘాట సార్వత్రిక సంచార కౌశల్యమున సొంపెసగుచుండెను. ఇట్టి మహాకవి లక్షణంబు లొదవిన షేక్స్పియరు భారత తత్వపు

మానవావతారమూర్తి యనజెల్లును. ఇట్టి ప్రజ్ఞాసామర్థ్యమున ఆకాలపు కథలకే దేశకాల వైపరీత్యము లేదవని శాశ్వత స్వభావలక్షణము లాపాదించి నిరుపమానములును లోకమాన్యములును బహురసశోభితంబులును సద్ధర్మ నిరూపకంబులును నాటకకళా పరిణామ రత్నంబులును అగు రూపకరాజముల గల్పించి మానవ మానసంబున కలవియగు పరిణామ కళా సిద్ధిని పొందియున్నాడు.



VI

# ఆంగ్లరూపకముల పరిపూర్ణవికాసము.

## విలియము షేక్సుపియరు (1564-1616)

ఇంగ్లాండులోని యావన్ నదీతీరముననున్న స్ట్రాటుఫోర్డు గ్రామమున కొంచెము పరువుమర్యాదలుగల భూస్వామియింట 1564 వ సంవత్సరము ఏప్రిలు 26 తారీఖున నీజగద్దైకరూపకకవి జననమొందెను. ఈతని జనని మేరీఆర్డెను అను సాధ్వీమణికూడ నొకమంచి పల్లెటి సేద్యకుటుంబము లోని పిల్లయే. విలియము చిన్ననాట తనయూరిలోని బడి పంతులువద్ద లాటిను పారసవ్వతమందు చక్కని శిక్షగరచెను. 14 వ యేట స్కూలువదలి 19 వ యేట ఆనీహాతవే యను నామెను తనకన్న నెనిమిదేండ్లు పెద్దదానిని పెండ్లాడి ఆమె వలన నలుగురుబిడ్డలను గాంచెను. 1586 లో షేక్సుపియరు

స్వగ్రామమునువిడచి, షోరుడిచ్చివద్ద బర్బేజి మహానటుడు నిర్మించిన నాట్యశాలలో రంగప్రచారకుడుగ ప్రవేశించెను. త్వరలో నీతని యభినయకౌశల మెరుకపడినది. బర్బేజి నటమండలిలో చేరి తన జీవితాంతమువరకు నాతని నమ్ముకొనియుండెను. యెలిజబెత్తురాణి ప్రాపక మనుభవించుచుండిన లీస్టరు, డర్బీ, హాన్సుడను, ప్రభువులు, యీనాటకసమాజము నాదరించి పోషించుచుండిరి. యెలిజబెత్తు చనిపోయిన తరువాత 1603 లో జేమ్సురాజు షేక్సుపియరు నాటకసమాటమునకు ఆస్థాన సభాగౌరవ మొసంగెను. షేక్సుపియరు తనసమాజములో బర్బేజి వీరవిషాదపాత్రము లభినయించుచుండ, కెంపు అను హాస్యగాడు హాస్యరూపకములందు మేటియైవెలుగ నింగ్లాండులోని ప్రభుమందిరంబుల కరుగుచు నాట్యప్రదర్శన మొనర్చుచుండెను. ఆకాలములో షేక్సుపియరు జాన్సను రచించిన నాటకములందును తానురచించిన హాంలెట్టు మున్నగువానియందును, పాత్రధారియై యభినయించుచుండెను. ఇట్లు కొంతకాలము గడపి నాట్యవ్యవహారములలో పలుకుబడి సంపాదించి బర్బేజితోకూడి లండను పట్టణమున గ్లోబునాట్యశాలను గట్టించి యాంగ్లరాజధానిలో నివాస మేర్పరచుకొనెను. మరికొన్ని నాట్యశాలలుకూడ లండనులో వీరు సంపాదించిరి. జీవితాంతమువరకు నటవృత్తి నాశ్రయించియుండినను యిందులో ప్రవేశించియుండిన నాల్గు సంవత్సరములకే నాటకరచన మారంభించెను. మొదటి కల్పనయందే యీతని కథావిస్తరణసామర్థ్యము పాత్రపోషకనైపుణ్యము, గద్యపద్యముల నవలీలగ సకలరసభావవాహ

కంబుగ నుపయోగించు భాషాస్వాతంత్ర్యము, మానసవ్యాపార పరిజ్ఞానము, లోతుతలపులు, పాఠకలోకమునకు బ్రకటితమై, మెప్పువడసెను. 1591-1611 సంవత్సరములమధ్య నిరువదియేండ్లలో ముప్పదియేడు నాటకముల స్వతంత్రముగ రచించెను. ఫ్లెచ్చెరు మున్నగువారి సహాయమున మరికొన్నిటినికూడ రచించెను. ఈతని బుద్ధివైశద్యము, కాల్పకమమున విప్పారి యింపొందినది. కాని తొల్లిటినుండియు మానవజీవితపు హాస్యవిషాద సందర్భములను సమదృష్టితో బారజూచి చిత్రించు నైపుణ్య మాత్మీయ మేధాభిభూతిచే వెలుగొందుచుండెను.

ఈతని మొదటినాటకములు హాస్యశృంగార రసాలంకృతములై యుండెను. వీనిలో నీతని విభావనశక్తియు లేతలుపులు ప్రపంచజ్ఞానము మిక్కుటముగ నగుపడును. 1600 లలో నీతడు రచించిన మూడుకామెడీలు (As You Like . Twelfth Night; Much Ado.) యిప్పటున వీనికళాపరిణామమును తెలుపుచున్నవి.

Love's L. ur Is Lost 1591 సాంఘిక ప్రహసనము.

Two Gentlemen of Verona 1591 హాస్యశృంగారగాథ.

Comedy of Errors 1592 హాస్యప్రధానము.

Mer hant of Venice 1594 కళ్యాణ విషాదసందర్భముల కలయిక.

\- Midsummer Night's Dream 1594 భావకవిత్వము, కథాగాంభీర్యము, లలితహాస్యముచేరినది.

All is well, that ends well 1596 కరుణారసమూలించు వలపుకధ.

Taming the Shrew 1596 హాస్యప్రధానము.

Troilus and Cressida 1603 స్త్రీచిత్తపు చాంచల్య స్వభావము గంభీరతతో వ్యాసముతో చిత్రించినది.

Measure for Measure 1604 స్త్రీపురుష సంబంధమందలి పాపకార్యములు విషాద ధ్వనులతో సూచించు కామెడీ.

Winter's, Tale (1510) } Cymbeline(611) } ఇందుకామెడీ, ట్రాజిడీల ప్రత్యేకలక్షణములు కధాగౌరవమొప్ప ట్రాజీకామిడీగ, విషాదప్రహసనముగ మేళనమొందియున్నవి.

Tempest 1611 కావ్యసౌందర్యము, తత్వగాంభీర్యము వెలుగొందు కల్పితకధ.

ఈపట్టీవలన కామెడీ విరచనమందు షేక్సుపియరు మహాకవి మానసము బాల్యస్వభావమగు విపరీతాంశ విభావనము, హాస్యసందర్భ పర్యాలోచనము లందు తొలుదొల్త గ్రీడించి యివి ప్రధానముగనున్న భావగాధల రచించి క్రమముగ, మానవజీవితపు విషాద గభీరావస్థలను చింతించు లోతుచూపుల నంటగొనునట్లు విశదమగుచున్నది. అనగా వయసు ముదిరినకొలది షేక్సుపియరు మానవజీవితము కష్టభూయిష్టమని యనుభవించి తెలుసుకొని తదనురూపమగు భావముల తన సుఖాంతనాటకములందుకూడ ప్రకటించెను.

హాస్యశృంగారరస ప్రధానములగు కల్పితకధల కామెడీనాటకములుగ నొకచెంప రచియించుచు, మరియొకప్రక్క

నాంగ్లేయ దేశ చరిత్రాంకముల నాట్యరంగమున జూపువేడు కతో కొన్ని చరిత్రరూపకముల రచియింపదొడగెను. రాబర్టుగ్రీను, జార్జిపీలు, మార్లో ఈకవులు ముగ్గురుచేరి రచించిన ఆరవహెన్రీచరితమును ప్రదర్శనోపయుక్తముగ సంస్కరించి చరిత్రనాటకరచనయందు మార్లోతీసిన దారులనంటి 1593లో రిచ్చర్డు II అను స్వతంత్ర చరిత్రరూపకము రచించెను. తరువాత జానుభూజాని నాల్గవహెన్రీ, ఐదవహెన్రీ నాటకములలో, షేక్సుపియరు మహాకవి దేశచరిత్రమందు వెలుగొందు, మేటిమగల మనోవ్యాపారములను లోకులకందరాని లోతుచూపుల బరికించి, వాని స్వభావపోషణ మతిచిత్రముగ నేర్పరచి యాంగ్లవ్యవహర్తల స్వతంత్రాభిలాషను నిస్తుల దేశాభిమానమును తేటపరచెను.

1592 లో నీతడు రచించిన రోమియో జూలియెట్టుల విషాదప్రణయ కథాపరిణామము ప్రపంచములోని శృంగార విషాదనాటకము లన్నిటిలో మేలని చెప్పవచ్చును. ఇందీతని వయసు తెలివి నిండారు పటిమతో వెలుగుచున్నది. కాని 1600 ల వరకు నీతనిమానసము విషాదావస్థల గభీర తత్త్వావ దేశక సామర్థ్యమును గుర్తించి రాజస మనోవృత్తులకు సాత్త్విక రసస్ఫూర్తి నొసంగెడి జాణతన మబ్బలేదు. కామెడీలు చరిత్రనాటకములు రచియించు విభావానుభవములలో నీతడు చల్లగ జీవితరహస్యము లరయుచుండెను. మానవజీవితము, దుఃఖభూయిష్ఠమని గుర్తించి యాస్థితియెందున గలుగుచున్నదో? విమర్శించి చూచెను. భారతమందు చెప్పబడిన కాపురుషగుణంబులలో "క్రోపమునుబ్బును, గర్వము, వా

వనియు నికియును, దురభిమానము, నిర్వ్యాపారత్వము" అను వానికితోడు అత్యాశ, అతినమ్మకము, మున్నగునవి కూడ మానవుని భంగపాటునకు కారణములగుచున్నవని గుర్తిం చెను. మన జయాపజయములు, సుఖదుఃఖములు మనచేతనే కలవనియు, (Man is the architect of his own fortune— There is a tide in the affairs of men which taken at proper time leads men to fortune) మున్నగు వాక్యము లలో మనుష్యుని విజయసౌఖ్యములు వాని ప్రవర్తనవలన నేర్పడునని తెలిపియున్నాడు. మొత్తము మీద మానవ కోటి సదాచారమార్గముల నరయజాలక పైచెప్పిన లోపము లచేతను, అరిషడ్వర్గ ప్రభావమునను కార్యభ్రంశ మొంది దుఃఖసాగరమున దేలుచు, పరితపింతురని నిదర్శించుటకు తన మహానాటక నాయక పాత్రములను, కథాపరిణామమును, విషాద పూరితముగ జిత్రించి యున్నాడు. ఆశాభంగము కార్యభ్రంశము, దుఃఖప్రాప్తి, విషాదజీవితము, లోకసామా న్యములుగాన వీనినిర్దేశించు, ప్రధానపాత్రలను విషాదపూరితుల గావించెను. కాని లోకములో పైజెప్పిన తప్పుదారుల పొం దజేరక సదాచారులై నీతివర్తనులై 'యెప్పటికయ్యది ప్రస్తుత మప్పటికి కారీతి" నడచి నయముగ నాత్మ నిగ్రహముతో తనకు లభించిన కొద్దిమేలుకు సంతసించుచు చరించెడి యల్ప సంఖ్యాకులు, సుఖప్రదమగు శాంత సంతుష్టజీవనమున సుఖం తురని చెప్పుటకు తనవిషాదనాటకములలో ప్రధానపాత్ర నేడి పించు లోపములకు వ్యతిరేకముగ, మంచిగుణములుగల పాత్ర ములను, ప్రవేశపెట్టి వారి యారంభములు కథాపరిణామమున

సుఖప్రదముగ దేలునట్లు ప్రాసంగికముగ రచియించియున్నాడు. ఎట్టి మహనీయుడైనను బలవంతమగు లోపములు, కొన్ని పట్టి, తప్పటడుగుల, జారనిచ్చెనేని నాశనమొందుననియు, ఎట్టి సామాన్యుడైనను ఆత్మనిగ్రహము, దూరాలోచన సదాచారము, గలిగెనేని క్రొద్దిలో జయమొంది, తన జీవిత కాలమును, సుఖముగ గడతేర్పగలడనియు షేక్సుపియరు మహాకవి విరచితంబులగు విషాదనాటకములు బోధించుచున్నవి. కింగులియరు నాటకములో కోపము, వుబ్బు హ్రస్వదృష్టి వలన గలిగెడి భంగపాటు చిత్రింపబడినది. హేంమ్లెట్టులో మనశ్చాంచల్యము, నిర్వ్యాపారత్వము, అతిఆలోచన వలన గలిగెడి, విజయభ్రంశములు, పెద్ద ఆదర్శములు లౌకికపరిస్థితులలో వెఱ్ఱితలలెత్తిననియు, దేలుచున్నది. అతేలో అనుభవించిన దుఃఖపరిణామము విపరీతమగు ప్రేమలు, నమ్మకములు, సత్యశూన్యమగు నీపుడమిలో ననుభవించెడి పరాభవమును చూపుచున్నది. మాక్బెత్తునందు ఆశాపిశాచము, విశ్వాసశూన్యతలో భావాంధకారములు, మానవున కేరర్పచగల, పరిణామనాశనమును, దెలుపుచున్నవి. జనులు పెద్దఆదర్శముల వేడిమిచే గొన్ని సమయముల నొడిగట్టుకొను మహాపాతకములు, కాలపరిణామమున పాపులొందెడి, శిక్షయు, జూలియస్ సీజరు నాటకములో నిరూపింపబడినది. టిమాన్ ఆఫ్ యాతెన్సునందు "అర్థం నాస్తిగృహంనాస్తి । నాస్తిబంధుసహోదరాః—తస్మాత్ జాగ్రత, జాగ్రత," అను ధర్మముపదేశింపబడినది. విషయలోలురై యల్పసుఖముల నపేక్షించి, మంచి యవకాశముల జారవిడచి నీచావస్థల జిక్కి

దుఃఖించు బుద్ధిహీనుల యుదంతము, కాంతాసల్లాపపారవశ్యమున, మైమరచి రోమకసామ్రాజ్య సమాలంబన మహావకాశమును జారవిడిచిన యాంటోనీ చరితమందు చిత్రింపబడినది.

## VII

### స్పైను దేశపు రూపకావిర్భావము.

ఇంతలో స్పైనుసామ్రాజ్య మేలుచుండిన చతుర్థవంచమ ఫిలుప్పుల శేషవిభవోపేతులై లలితకళాపోషణ మొనర్చుచుండిరి. వీరియాదరణలో పెంపొందిన,

**లో పే, డ వే గా 1562–1635**

మతచారిత్రకథాత్మకమగు సుమారు 1800 కామెడీలను, 400 క్రైస్తవకథారూపములను సృజించి, స్పైనుదేశమున నవీననాటక లక్షణము లేర్పరచెను. ఈతని రూపకకావ్యరీతు లద్భుతపదలాలిత్య మొప్పుచున్నవి. పద్యపంక్తులు దృశ్యకావ్యముల కెంతయు నొప్పిదముగ నొదిగియున్నవి. కథాసందర్భములు, నాటక పాత్రములు, స్వభావశుద్ధితో, యథారూపముగ చిత్రింపబడినది. సంవిధానము గుంభనగ మంచికట్టుదిట్టములతో గూర్పబడియున్నది. మూడు అంకములు గల కామెడీల నీతడు మునుమొద లారంభించి రచించెను. ఈతని, యనన్యసామాన్య కావ్యకలనావైదుష్య మెల్లసీమల గారవింపబడినది. ఇతని తరువాతవచ్చిన

**కా ల్డే రా న్ 1600–1681**

నూటపదునెనిమిది నాటకములను 72 ఆటోలను రచించె. ఆటోలనగా క్రైస్తవాలయములందు ప్రదర్శింపబడు

మతవిషయిక రూపకములు, ప్రబోధచంద్రోదయము వంటి సాంకేతిక నాటకములు. వీని నందముగ గల్పించు నేర్పులో కాల్డేరానద్వితీయుడు. కాని కేవలనాటకమం దీతడు లోపేక తీసిపోవుచుండెను. వీని పాత్రపోషణావైచిత్ర్యము కొరవడి నను, పద్యగమకము భావసమృద్ధి లో పేరూపకములను మించి యుండెను. మరియు, ప్రదర్శనోచితమగు కథాసందర్భముల గల్పించుటయం దీతడు అమేయకౌశలమె వొప్పుచుండెను. ధారాసారళ్యముకూడ ప్రశంసింపదగియున్నది. వీని నాటకములలో (The fairy lady, The Mock astrologer, Life is a dream) మున్నగునవి పేరొంది యిప్పటికిని రూపకకళా సౌందర్య నిదర్శనములై జెన్నారుచున్నవి

ఈస్పెయిను రూపకకవుల కల్పన లశేష శేముషీ విరాజితములై యనంతమగు జీవితావస్థల నిరూపించుచు నర్థగాంభీర్యముతో నద్భావతరంగిణీసంచలన దీపితసద్రసకాంతి మాలికలతో జీవకళ లుట్టిపడ జోడుగానని మేటి డంబమున మిడిసి మెరుగారుచున్నవి. వీరి కీర్తులు యూరపులో నలుదెసల జనరంజకములై భావిరూపకరచన కెంతయు దోడ్పడినవి. వీరి ప్రబోధములందుకొని రచనోత్సాహులై పరాక్రమించిన మొదటి విఖ్యాతరూపకకవి.

## VIII

### ఫ్రెంచినాటక విజృంభణ.

### ప్యారె కార్నెల్లి 1606–1684.

అను పరాసుదేశీయుడు. ఇతను లాకిక్ అను మహానాటకమును రచించి ఫ్రెంచినాటక కవిత్వమునకు మూలపురుషు

డాయెను. ఇంతలో యింగ్లాండులోని రూపకరూపములు కొన్ని మార్పులతో గానాలంకార విలసితమగు నీచప్రహసనంబులై రెస్టరేషను కాలపు యధోగతిజెంది నడచుచుండెను. ఎలిజబెత్తు గతించినతరువాత నాంగ్లదేశమున నీతిసంస్కారణోద్యమమొకటి వెలసి నాట్యాది లలితకళల కెన్నియో నిర్బంధముల గల్పించుచుండెను. ఫ్రెంచిదేశము పదునాల్గవ లూయీ ప్రభుత్వమున దిగంతవిస్తరిత సామ్రాజ్య సంపద్వైభవంబుల దులదూగుచుండెను. వీని యాస్థానము సరసకళానిలయమై నాట్యకుమారి వరించివచ్చిన నృత్తరంగమై జెన్నొందుచుండెను. లూయీ భూజానివలన నిత్యమర్యాద లందుకొనుచుండిన కార్నెల్లీ మహాకవి హొరేసు లామెంటాదు సిన్నా మున్నగు విషాదనాటకములను కొన్ని హాస్యరూపకములను రచించి రిషీరులో మహామంత్రి కూజించు రాజకీయతంత్రములకు రూపకనిదర్శన మేర్పరచుచుండెను. కార్నెల్లీ ప్రాచీనరూపకలక్షణము లవలంబించి ఫ్రెంచిదేశపు తొల్లిటి మహానాటకకర్తల గల్పించెను. మానవసంకల్పము బాహ్యపరిస్థితుల మార్కొని మిన్నయై విజయవిభూషితయై నలరారుచుట్టు లీతని యభిమాన ప్రధానాంశములై యుండెను. కామాదిరాగద్వేషముల ద్రుంచి నీతిపద్ధతులవలంబించి విధికృత్యమోలింగి నయముగ జీవించు ధీరపాత్రలీతని యుల్లమలయించుచుండిరి. ఈతని నాయకులు ధీరోధాత్తలలిత సద్గుణాసులగు కతన నీతని కల్పనమంతయు నుదారభావభూషితమై ఆత్మవంతమై సాత్వికరసశోభితమై మహాకావ్యంబుల క్రొమ్మెలిమెరపుల జిలికించుచున్నది. వీనికవనమందు సారళ్య

లోపము లగుపడుచున్నవి. భావగాంభీర్య మొదవింపుసం కల్పమున భాషాప్రయోగ ముపన్యాసఘటితిలో దృశ్యకావ్య ము లందుపయోగింపని డవులుఘాటిలో మిన్నుమన్నుల జెలరేప దుముకు చుండును. కాని ధీంపూనసము లనుభవించు మనోవేదనము, విరోధిసంకల్పముల భీకరసంఘటనలు నిరూపించు నాట్యావస్థల నూహించుటలో, యిట్టి భావసంక్షోభమున దెవ్వరిల్లెడి యుదారపాత్రల సంభాషణను మర్చుటలో కార్నెల్లీని మించిన రూపకకర్త లీజగంబున గానరాదు.

## మాల్యేరు (1622-1673)

ఫ్రెంచిదేశమున నవీనార్థమున కామెడీ (కళ్యాణాంత నాటకము) ని సృజించిన మహాకవి. ఇరువదియేండ్ల ప్రాయములో ప్యారిసునగరమందొక నాటకసమాజమును గూర్చి రాజధానిలో వీసయూటలు ప్రజామోద మొందనికతన ప్రాసుదేశపు మండలపత్తనములందు సంచరించుచు హాస్యశృంగారాభినయములందు మేటినటుడను కీర్తి సంపాదించుకొనెను. గ్యారిక్కు అభినయించునపుడు యెట్టిభావసూచక ముఖాంగ సంచలన మేర్పడి జీవితావస్థ లు కన్నుల గట్టినట్లు అగుపడెనో అట్టియథారూప స్వభావాభినయరీతులు మాల్యేరునకు పట్టువడియెను. నాటకసమాజముల గూర్చి నయముగ నడపించుటలో నీతడారి తేరెను. మండలసంచారమందిట్టి విఖ్యాతి గణించి 65౽ లో ప్యారీసులోని యాస్థాననాట్య భవనాధిపోద్యోగమున నియమింపబడెను. 1659 లో The precious ridicule అను సాంఘిక ప్రహసనము 16౽2 లో La Ecole-des Femmis అను, సుప్రసిద్ధ కామెడీ రూపకము నురచించెను.

ప్రాచీన హాస్యకవులలో యారిస్టాఫనీసు యెట్టిసర్వాంగ సాల భ్యమొందెనో అట్టి సర్వతోముఖ హాస్యకవితాప్రయోగ పాండిత్య మీతనికొప్పుచుండెను. వీనిరూపకములలో కరుణా భయానకరసము లప్పుడప్పుడుప్పతిల్లును గాని హాస్యరసమే ప్రధానముగ వీనిరచనల నావరించియగుపడుచుండును La Tartuffe అను నాటకములో నొక క్రూరదుశ్చరితుని చిత్త మందప్పుడప్పుడు మొలకెత్తు సరససద్భావములు హాస్యవైఖ నుల జూపబడినవి. Alcestes అను రూపకములో కమనీయ సద్గుణాలంకృతులగు మానవుల చేష్టలలో నప్పుడప్పుడు పులక రించెడి హాస్యాస్పదనీచ సంకల్పములు చిత్రింపబడినవి.

మనుష్యుల మనోవృత్తులను సంస్కరించి సదాచార సంపన్నుల గాజేయు మహోద్యమ మీతని రచనలందగు పడును. మానవసంఘము శాంతియుతమై నిరాఘాట సుఖ స్థితియందుండుటకు గృహమర్యాదలు కుటుంబ సాంప్రదాయ ములు కులధర్మములు పూనికతో గాచవలయునని నమ్మి వీని భంగపరచు దుర్నయములకు పొరపాటు నడతలను తనరూప కములలో ఖండించి పరిహసించుచుండెను. ధర్మనిరూపణము సత్యపరిపాలనము సాంఘికశాంత జీవనము తనజీవితాదర్శ ములుగ భావించి చక్కనిలోకజ్ఞాన ముపయోగించి టక్కరిడాం బికములు దొంగభేషజములు మూఢవిశ్వాసములు నాస్తికవాద ములు అదుపాజ్ఞారుగని పోకిరీనడతలు లోభాహంకారదుర్మద గర్వాంధకారములు మున్నగు బుద్ధివైపరీత్యముల నెల్లప్రేక్షక హృదయరంజకంబులగు రసవత్ప్రహసనములందు లలితహాస్యక ల్పనాద్యాదులతో వెక్కిరించి దునుమాడుచుండెను. ఈతనిరూప

పాత్రములు, స్వభావజాతీయత లొప్పవనియు భావముల నిం కే తి క రూ ప క ల్ప న మ ని యు కొం ద రు విమ ర్శ కు లా క్షే పిం చి యు న్నా రు. కా ని లోతుగ బరికించిచూచినచో, మాల్యేరు గల్పించిన ప్రధాన పాత్రములన్నియు, మానవజీవితమందగుపడు, వృత్తి సాంకర్యము, వ్యక్తిసౌందర్యము, జీవసంచలనము, కలిగి ప్రతిపాత్రియు, తన మనోవృత్తుల కుచితమగు స్వకీయస్వాతంత్రిమార్గములలో జరించుచు, నిండారు, జీవకళతో నాట్యరంగమున తన బ్రతుకు తెరవుల నారబోయుచుండును. జిక్కెన్ను హాస్యకథకునివలె, నొకటి రెండు, వాక్యసూచనలలో, పాత్రస్వభావమును, సంపూర్ణముగ చిత్రించు, నేర్పు మాల్యేరున, గొప్పయున్నది. వీరి చిల్లర వేషములు, పెద్ద పాత్రలు రంగస్థలంబున కాలిడినదాదిగ నాత్మీయ స్వభావ ప్రవృత్తుల నిండుబింకమును, వ్యక్తివైశద్యముతో దెలుకారు చుందురు. వీని దాసీజనంబులు, సామాన్యముగ విశ్వాసపాత్రులై, మంచితలపుల పోగులై బుద్ధిమాంద్యమున నిర్మల నిరపాయ హాస్యానందమ్ముల గూర్చుచుందురు. అనగా బీదపాటకపు సేవకులు ప్రాకృతమౌఢ్యమున జిక్కి నవ్వుపాటుల జెందుచుండినను, వీరి స్వభావము, సంఘమందు పెద్దపేరుల దాల్చి వెలుగొందు, ప్రభుసమాజకులకన్న నెక్కువ స్థితిసంతముగను, విశ్వసనీయముగను, దయాసంకలితముగను నుండునని మాల్యేరు నమ్ముచున్నాడు. వీని నాటకములలో నలౌకికాద్భుతగుణాలంకృతులగు మేటిమగ లగుపడరు. సకల దుర్నయయంబులకు పరమనీచ లగుపడరు. అహితవృత్తులును

వారిలోపలేశములను కొండంత చేసి యుపహాస్యవికార రూపములజ్జితించి యవమానించు నీచప్రహసనరీతు లీతని యందగుపడవు. లోకవ్యవహార సంస్కరణ సంకల్పము లే, మంచి చెడ్డ లన్నివ్యక్తులందు కలసియుండునను సమస్తృష్టి మ్యోమాల్యేరు మహాకవి మానసరంగమున రాజిల్లుచుండెను. వీని నాటకముల కథాకల్పనము, పాత్రపోషణము, శాశ్వతమానవ ప్రవృత్తుల సూచించు, విశ్వవ్యాప్తిగలిగి, చదువరుల దేశకాలానుభవముల కనుకూలమగు రీతుల నర్థమగు చుండును. మానవజీవితములోని యవస్థావిశేషముల జూపనెంచెనే గాని, పలుపడి దిద్ది, మెరుగెట్టి, కావ్యరచనాచాతుర్యమున మెప్పించ యత్నింపడు. అభినయోచితమగు రసభావముల నుపయుంచవ జేసి, నాట్యరంగమున రక్తిగట్టెడి కథాసందర్భముల నూహించి, జీవసంచలనోద్వేగసౌందర్య మేపార రచించు సామగ్ర్యధీ మీతని యొడిలోని సొంత సొమ్మని నుడువగును. (Mis Anthrope) అను రూపకరాజమందు కథా సందర్భములు సాధువడి, బాహ్యవ్యవహార సంచలనమున నవకాశములు లేకున్నను, భావవికాసమత్యంత మనోహరముగ విప్పారుచు ప్రేక్షకుల నుదివరకు తమ పీటలకతిగించు రసపాటవ మొప్పియున్నది. వీనిశైలి సామాన్యముగ సర్వావస్థానుకూలముగ నుండునుకాని, పనిగొని దిద్దనికతన గొన్నితావుల నిస్సారశ్యదోష కలుషితంబగుచున్నది. అభిమానవిమర్శకు లీఫ్రారాలోపమునకు జింతిల్లుచుందురు కాని, భాషాప్రయోగ మెల్లవేళల సందర్భోచితముగను, జీవశోభితముగను, భావవాహకశైదన్యమునను, రూపక కావ్యోపయోగముగ నందగించి

నిండారుచుండును. మూల్యేరు రచనలందలి వాక్యగమకము దృశ్యకావ్యముల కెంతదగియున్నదన, వానిని జదువువారలు నిస్సంకల్పముగ నాట్యవైఖరిదాల్చి యభినయ మార్గముల నూని పఠింపగలరేగాని, మరియేవిధమున నుచ్చరింపజాలరు. అనగా ఈతని పలుకుకూర్పులందు నాట్యతత్వము సహజప్రాభవ మొందియున్నది.

## రాసీను (1639-1700)

చక్కని సంస్కారి. లూయీసభాస్థలి నలంకరించు మేటిసత్కవులలో నొకడు. బోయిలో, లాఫాంటీను, మూల్యేరు మున్నగు ధీనిధులనెయ్యంబందికొనిన వాడు. The bride, Andromache, Iphigene, మున్నగు ట్రాజెడీలను ఒకకామెడీని రచించెను. ఈతని చివరరచనలు భక్తిభరితములై యున్నవి. రాసీనుమహాకవి ప్రాచీన యవనరోమక కావ్యాలంకారలక్షణంబుల దిలకించి, వాని యాదేశప్రమాణమున నిర్దుష్టమని మెచ్చదగు రూపకకవిత్వ మల్లుచుండెను. కావ్యలక్షణము లీతనియందు మూర్తీభవించెను. లక్షణ నిబంధనము లీతని మనోరీతులకనుకూలముగ నుండినవేకాని ప్రతిబంధకములు కాలేదు. శ్రీనిగాని, నాటకకవిత్వమున అందగించెడిపట్లు నెరింగి నేర్పుమై చెక్కి, చిత్రించి, మెరుగిడి రచనాచాతుర్య మొప్పించుచుండెను. కావ్యసౌందర్యము నందును, రూపక కథాకల్పనమందును కార్నెల్లీ మహాకవి రాసీనునకందరాకుండెను. కార్నెల్లీ నడతలలో హెచ్చుతగ్గులు వక్రగమనము గోచరించును. రాసీనురచనలు కాళిదాసు కవిత్వమువలె, శ్రీనాథుని కావ్యపాటవమున నొక్కరీతిగ

నడచుచుండును. రాసీను కథావస్థలను, రససందర్భముల నుత్పత్తిజేయు సాధనములుగ నుపయోగించెనేకాని, వానిని ప్రత్యేక సాంఘికనైతికాది వ్యవస్థల దెలుపు నుద్దేశముతో వాడలేదు. వస్తువునకు భావసూచక ప్రయోజనమే ఆపాదింపగ.ని స్వకీయ కావ్యోచిత సౌందర్యమూహించి యుండలేదు. వీని నాటకములందు మానసవ్యాపార వైఖరుల సూక్ష్మవిమర్శనమే ముఖ్యాంశముగ నగుపడును. రసభావముల సూక్ష్మవిభజన మొనర్చి సకలవిధములగు విభావానుభావ సంచారీభావములను రసావస్థలను నిరూపించు లక్ష్యములుగ రూపకకథాంశము లేర్పరచినందున, నీతని నాటకము లనంత రూప విశేషముల జెన్నొందుచున్నవి. వీని పద్యరచన మద్వితీయ పదలాలిత్య మొప్పారుచున్నది.

లూయిచక్రవర్తి నిరంకుశాధికార విరాజిత మగు సామ్రాజ్య శాసన మొనర్చుచుండెను. లూథరు ఎలిజబెత్తుల కాలములలో రోమకమతాచారములయెడ గలిగిన తిరుగుబాటు, యీకాలమున కొంకింత చల్లారి, క్రమక్రమముగ యూరపులో ప్రాచీన రోమకమతసాంప్రదాయముల ప్రాభవ మెచ్చుచుండెను. ప్రజలకు ప్రాచీనవిద్యలందును, మతమందును, గౌరవమేర్పడి, మతసాంఘిక రాజకీయ విషయములలో పిన్నపెద్దలనెడి పరిజ్ఞానముదయించెను. ఇట్టి సంఘస్థితిలో రూపక కల్పన మొనర్చుచుండిన కార్నెల్లీ రాసీనులు, యవనరోమక కావ్యలక్షణముల సర్వాధికార మంగీకరించి; ప్రాచీన కావ్యాదర్శముల ననుసరించి ఫ్రెంచిరూపకరాజముల గల్పింపనేర్పడిరి. వీరిపాత్రలు ధీరోధాత్త లలితగుణాలంకృతులు. వీర్ధి

వృత్తావిన్యాసము లక్షణమర్యాద లనుసరించియున్నవి. దేశ కాల నియమములు వీరిరూపకము లంగాదరింప బడినవి. మరణాద్యవస్థల నాట్యరంగమున ప్రదర్శింపక నేపథ్యమున జనాంతికముగ జరిగినట్లు విష్కంభ ప్రస్తావనలందు తెలుపుచుండిరి. ఊయాచక్రవర్తి యాస్థానరసికులు లలితకళల మంచి చెడ్డలెరింగి కావ్యప్రాశస్త్యమును నిర్ణయించుచుండిరి. అందుచే ఊయాకాలపు ఫ్రెంచిరూపకములు లలితసంస్కృతమర్యాద లనుసరించి రూపునందును పోకడలందును పొందికయందును శిల్పమందును నిరుపమానముగ శోభిల్లుచుండెను. ఇట్టి చిత్ర కవిత్వపద్ధతులు రాసీను, కార్నేల్లీల చేతిలో పరిణతరూపముల దాల్చినవి. వీనితో బోల్చి చూచినయెడల షేక్సుపియరు, మార్లోయరుమహాకవుల రూపకములు వట్టి గొల్లభాగవతములుగ నగుపడకమానవు. వీరిరువురు సహజపాండిత్యమేపారు నిసర్గ శూరులు. మాలీయరు స్వకీయబుద్ధిప్రభావమున, నదివరకు యూరపులో జనామోదమొందుచుండిన ఆటిల్లాపరిహాసన ములు ప్లాటసు, టెరెన్సు మున్నగువారి పరిహాసనరీతులు జన సామాన్యమును రంజింపజేయు నానావిధములగు రూపకరూప ములు వీనినన్నిటి తనయందు జీర్ణించుకొని నవ్యకాలోచితమగు హాస్యరూపకములను కామెడీలను రచియించు కావ్యస్వతంత్రు డాయెను. ఈతనిపాత్రలు ధర్మసంకేతములుగాక ప్రత్యేకవ్యక్తి లక్షణములతో నాట్యరంగమున తమ ప్రత్యేకవ్యక్తిజీవనము సలుపునట్లగుపడును. కవిచాతుర్యమున నీపాత్రలన్నియు నిరు పమజీవకాంతుల దేజరిల్లుచుండును.

## కాలసంధి

చరిత్రాంక ప్రకరణమందు విస్తరించిన రీతి నాంగ్ల దేశమందీ కాలమున ఫ్రాను కళాదర్శనములు సభాగౌరవ మొంది విజ్ఞులచే నాదరింప బడుచుండెను. మాల్యేరు మహాకవి స్వయముగ ఇంగ్లాండునకు బోయి నాట్యరంగముల సంస్కరించి వచ్చెనని చెప్పియున్నాము. వీనిలక్ష్యమున ఇంగ్లాండులో రెష్టరేషను కామెడీ యనబడు రూపక రీతులేర్పడెను. ఇందు జీవ చైతన్య మేమియును గోచరించదు. నాట్యరంగము తొల్లిటి మంటపపు పద్ధతి మాని క్రమముగ చిత్రరూపమును దాల్చుచుండెను.

## జాన్ డ్రైడెను. 1631–1700.

ఆనాటి ప్రజారుచుల కనుకూలముగ డబ్బు కొరకు 22 నాటకములను రచించిన విద్వత్ కవి. ఈతని కావ్యధోరణి వేదాంత బోధకులు భట్టుమూర్తి శతక కర్తలు మున్నగువారిని స్మరింప జేయుచుండెను. అచ్చటచ్చట కొన్ని చక్కని పద్యావళులు మెరయుచున్నను రూపక కల్పన మందీతని కెట్టి చాతుర్యము కలుగకుండెను. మరియు నాకాలపు దైనిక జీవితములో ఫ్రాను రాజ సభామర్యాదల ననుసరించి సంక్రమించిన దుర్విషయ లాలనము డ్రైడెను రూపకములందు బట్టబయలుగ నిరబోసియున్నది. ఎలిజబెత్తు రూపక కవుల పోకడలు కొన్ని డ్రైడెను నందు జూడవగును. కాని ఆ కాలములో యూరపు నందెల్లెడల నల్లికొనిన ప్రాచీన కావ్య లక్షణములే ప్రాధాన్య మొందియున్నవి. డ్రైడెను నాటకములకన్న నతని విమర్శనలు ప్రస్తావనలు పాండితీగరి

గాను విమర్శక సామర్థ్యమును వెల్లడించుచున్నవి. కొంచెమించు మించుగ నీ పద్ధతులను అవలంబించి రచించిన ఆంగ్ల హాస్య కర్తలలో ఆట్వే (1651-85) వాన్‌బర్గు (1664-1726) కాన్‌గ్రీవు (1670-1729) రో (1674-1718) మున్నగు కవులు పేరొందియున్నారు. వీరి రచనలతో పదునేడవ శతాబ్దమున ప్రజలు చిరస్థాపిత మత సాంఘిక రాజకీయ సంస్థాపనలందును ప్రాచీన సారస్వత రూపములందును పోకడలు ఉంచుకొని కులాసా బ్రతుకులందును విశ్వసించి వర్తించిన కాలములో యూరపునందు ప్రజా వినోదము కొరకేర్పడిన హాస్య శృంగార నాటకములు నిండురూపములు దాల్చి పరిణత మహోన్నతి జెంది క్రింది మొగమున దిగజార మొదలిడినవి.

18 వ శతాబ్దములో యూరపునందు జరుగుచుండిన పుష్టికారకమైన విమర్శక సంక్షోభమును చరిత్రకారులు జూచియున్నారు. ఆకాలమున సామాన్యవిషయములు కావ్య సామగ్రిగ సంగీకరింపబడు నవ్యమర్యాద లేర్పడెను. మత సాంఘిక రాజకీయ కళాసందర్భములందును శాస్త్రవిచారణ మందును తత్వపరిశోధనమందును ప్రాచీననిబంధనల నేవగించి పెకలించి పారద్రోసి యాత్మానుభవమే ప్రమాణముగ నెంచి యున్నివిషయములలో స్వతంత్రసంచార మొనర్చెడి యధికారి తిరస్కారము ఆత్మగౌరవము సమబుద్ధి విప్పుచూపు యూరపులోని జనులందర కేర్పడుచుండెను. 18 వ శతాబ్దమున నింగ్లాండులో పెక్కునటశేఖరు లుద్భవించి ఎలిజబెత్తునాటిరూపక రాజముల నభినయించి రసవ్యాఖ్యాన మమర్చి యానాటి ధీర

సంచారమును మరల నిలుపసాగిరి. ఎలిజబెత్తుకాలములో నాంగ్లేయులు యూరపుచక్రవర్తులయొక్క మతాచార్యుల యొక్కయు నధికారమును ఆనవెట్టి యాంగ్ల సామ్రాజ్యబీజ ములనాటి కొంత విజయమొందిరి. 18 వ శతాబ్దములో ఈ బీజములు మొలకెత్తి విశ్వపర్యాప్తమగు నాంగ్లసామ్రా జ్య విస్తరణ మహాఫలము లేర్పడుచుండెను.

18 వ శతాబ్దమున ఫ్రెంచి ఇటలీదేశపు కవులచే గల్పింపబడిన పద్యగద్య నృత్తగీతమయంబగు హాస్యశృంగార నాటకములు కొంతకాలము ప్రజారంజకములై విరివిగ నాడ బడుచుండెను. వీనిపోకడలు యొద్దికలు పూర్వపుగంభీరమహా నాటకములకన్న శాంతరసప్రదన శోభితంబులై వినజూడ నింపు దగిలి యందగించుచుండెను. నాటకకళావిజయమునకు నా టకకవియేగాక నటప్రతిభకూడ తోడగునని ప్రజ లెరింగెడి. హార్యాద గ్యారిక్ మహానటుని ప్రతిభాప్రభావమున నేర్పడెను. 1713 లో మాఫీయను ఇటాలియను నాటకకవి (Mir ope) అను నాటకమణిని గల్పించెను. దీనిలక్ష్యమున 1757 లో ఇంగ్లాండునందు హోమానుఅనువాడు డగ్లసురూపకమును రచించెను.

—♦ ఆలివరు గోల్డుస్మిత్తు 1728–74 ♦—

ఐర్లెండులో జనియించి ఎడింబరో మున్నగు విద్యాని కేతనములందు చదివిచదవక పిల్లనగ్రోవి బూరించుచు యూరపులోని సమస్తదేశములు చూచివచ్చి నిరుపమభావ సౌకర్యమొప్పెడి లలితకావ్యములను చకటని వ్యాసములను చరిత్రలను రచించి లండను నగరమందలి ప్రజ్ఞారత్నములలో

నొకడుగ బధరివిల్లి She stoops to conquerఅను సాంసారిక కథాత్మమగు రూపక మొకటి రచియించెను. ఈ రూపక మిప్పటివరకు సర్వజనానంద దాయకమై యనువత్సరము సీమలో నాడబడుచున్నది. పాత్రపోషణమం దీతడద్వితీయ చమత్కారమును చూపియున్నాడు. దయా స్వాంతుడు విశాలసాధుస్వభావుడు. ఈతనిరచనలందు అనిర్వచనీయ మగు కరుణారస మలరుచున్నది.

X

18 వ శతాబ్దమున యూరపులోని రూపకరచనము.

—♦లూడ్విగ్ హాల్ బర్గ (1684-1754)♦—

ఈ కవిడెన్మార్కుదేశపు నాట్యకవితాపితామహుడు. విశేషముగ దేశాటనమొనర్చి నిశ్శేషముగ మానవవిజ్ఞాన మంతయు గొల్లవెట్టి తన దేశభాషలో పెక్కుగ్రంధముల రచియించి నవీన డేనిష్ సారస్వత విన్యాసమునకు పునాదులేర్పరచెను.

1722-27 కోపెను హాగన్ నగరమందు క్రొత్తగ నిర్మింపబడిన నాట్యశాలకు సూత్రధారుడై యనేక కామెడీలను రచించెను.

ఫ్రెంచిదేశమున మరివో 1678-1763 అను కవియు బొమార్ కెయసు అనునాతడు 1782-99 మామూలుసంసారములోని సంధర్భములను రూపకములందు ప్రవేశపెట్టి యథారూపముగ జిత్రించుచుండిరి. బొమార్ కెయసు పదిహేనవ లూయీచక్రవర్తి పోషణలోనుండెను. కథాకల్పన మందు విశేష వైదుష్యమొప్పుచుండెను. సంగీతమం దారితేరినవాడు.

స్పెయినులో కొంతకాలము తిరిగివచ్చి యూజెనీయను ట్రాజెడీనొకదాని రచించెను. ఇది గీటీమహాకవి రూపకములలో నొకదాని మాతృకయై వాసిగనినది. The Barber of Seville, The Marriage of Figaro అను నాటకములు మొజార్ట్, రోజినీయున్నగు మహాగాయకు లభినయింప లోక విఖ్యాతములయినవి.

అప్పటివరకు ఇటలీలో సర్వసాధారణముగ బ్రదర్శింపబడుచుండిన ఆటిల్లాప్రహసనము కాలవశమునసీరసమై ప్రజామోదమొందకుండెను. ఇందుచేత క్రొత్తరూపకముల రచియింపు వేడ్కతో

—• కార్లోగాల్డోని 1707-93 •—

అను ఇటాలియను కవిశేఖరుడు మాలియేరుపద్ధతులను సరించి సత్వరరచనా ప్రభావమున ననేకరూపకములరచియించెను. లోపే స్పెయిను నాటకములకెట్టి మహోన్నత నవ్యవిలాస మొసగూర్చెనో అట్టిసాయమే గోల్డోనీ ఇటలీనాటకమున కొనర్చెను. ఈతని భాష పొందికగలిగి సుందరముగ నలుకుచుండును. కథాకల్పనమందీతడు అసాధ్యప్రతిభాసమన్వితుడు. నాట్యోల్లేఖనమునందు రమ్యావస్థలకూర్చుండును. గాని వీనినాటకములలో నీతికొరవడుచున్నది. ఘనితరువాత సంపన్నప్రభువంశమున జనించిన

—• విట్టోరి మోల్ఫెరీ 1749-1803 •—

యిరువదియొక ట్రాజెడీలను, ఆరుకామెడీలను, ఒక ఆపెరానురచియించి భాషాప్రయోగ స్వాతంత్ర్యమూని ఇటాలియను నాటకములందు భాషోద్రేకముదయింపజేసెను.

—◆ షెరిడను 1751-1816 ◆—

ఆంగ్ల నాటకకవి. ఒకనటుని తనయుడై రాజకీయమహోప న్యాసములందు వెలిగెడి సాధన మవలంబించెను. 1775లో The rivals అను నాటకమును రచించి డ్రూరీలేను నాట్యశాలలో భాగస్వామియై 77లో School for scandal అను ప్రసిద్ధహాస్య రూపకమును సృజించి యాడించెను. ఇది రెండు భాగములుగ నేర్పడిన పంచమాంక నాటకము. ఆంగ్ల సాంఘిక జీవనము లలితహాస్యరీతులలో దెలిపెడి మేటిప్రహసనమని యిప్పటికిని గౌరవింపబడుచున్నది. ఇందలి స్వభావములు సూక్ష్మవిభేదమున నెంతయు విచిత్రముగ గూర్పబడినవి. Rivals అనునది గూడ అయిదంకముల హాస్యనాటకమే. ఇదియును గోల్డుస్మిత్తు రచియించిన She Stoops to conquer అనునదియు భావప్రపూరితమగు 18వ శతాబ్దపు కామెడీలపరిణాత్ర సుస్వరూపమును దిలకించుచున్నవి.

యూరపులోని యితర దేశములందు నాటకములు నటకౌశలమవలోకించు నుద్దేశముతో ఆడబడుచుండెను. ఫ్రాంసు దేశమందు వాల్టేరుమహాకవి (1694-1778) Oedipe మున్నగు రూపకరత్నములలో నధికారుల దిరస్కరించుచుండెను. వీని సమకాలిక మహావిద్వాంసుడగు డిడరాటు 1713-84 హాస్యాభాసము అను విమర్శక గ్రంథమును రచించి నటులధర్మములను విమర్శించి సామాన్యసాంసారిక సందర్భముల నాత్మరూపకములందు వెలిగింపజేసెడి పద్ధతుల నిర్వచించెను.

## XI

### —♦ జర్మనీలోని భావరూపక మహోదయము. ♦—

ఫ్రెడరిక్కు షాహా చక్రవర్తి జర్మను దేశమును కట్టుబాటులో సంపద్బలోపేతముగ నొనర్చి చిరకాలమునుండి దీరకుండిన వంతలదీర్చి యాజాతికి నవ్య వికాసమేర్పరచెను. 19 వ శతాబ్దములో డొల్లిటి సగమందు జర్మనీ కావ్య వేదాంత విద్యలందు భూలోకమున మేటియై వెలుగొందు ప్రతిభావిర్భావ యుషఃకాంతులు 18 వ శతాబ్దాంతముననే గోచరించుచుండెను.

### —♦ లెస్సింగు మహాకవి 1729-81. ♦—

ఈతను యవన సాహిత్యమును జక్కగ నభ్యసించి షేక్సుపియరు రూపకములందభిమాన పాండిత్యమొంది కళాస్వరూపమును రసతత్త్వమును జక్కగ జింతించి కొంత కాలము హాంబర్గునగరములోని నాట్యశాల కధిపతియై హాంబర్గ డ్రామ టర్జియను విమర్శక గ్రంథమును రచియించి రాసీను, కార్నెల్లీ, డ్రైడెను మున్నగు కవులవలంబించిన ప్రాచీనకాల దూషిత నిరుపయోగ లక్షణ నిర్బంధములనుండి నాట్యకళ, నుద్ధరించి రక్షించెను. స్వతంత్ర జాతీయ పద్ధతులమీాద నాట్యాది సారస్వత మేర్పడ వలయుననియు ఎక్షడోరుచించి నిర్జీవశల్యములై విగత మర్యాదలగు ప్రాచీన కావ్య స్వరూపములీనాటి కావ్యాదర్శములు గానేరవనియు బోధించి జర్మనీ దేశమందు గేటీ మహాకవి యవతరించుటకును ఆంగ్లదేశమున వర్డ్సువర్తు మున్నగు నవీనభావ కవులేర్పడుటకును వలయు బరిస్థితుల గల్పించి దారితీసెను. ఈమహావిమర్శకుడు రసప్ర

పంచమును నిష్కపటముగ విచారించి యాదలి నిజమును శ్రోతను చవిజూచి యూరపులో 19 వ శతాబ్దమున కావ్యప రంపరల నీని బలు మొగంబుల వింతరంగుల బరిఢవిల్లిన భావసా ర స్వతోద్యమమునకు మూలపురుషుడై యమూల్యకావ్యసే వ యొనర్చియున్నాడు. ఈతను 1770 లో Nathan the wise అను నాటకమును రచించెను. ఆవల జర్మనీలోని తొల్లిటి హాస్యనాటకమును సాంసారికకథారూపకమును రచించి బేరొం దియుండెను.

— • షిల్లరు (1750-1805) • —

జర్మనీదేశపు నాటకకవులందరిలో గొప్పవాడుజర్మనుల కాళిదాసని జెప్పవచ్చును. రూపకకథాకల్పనమందు అసాధా రణమగు నైపుణ్య మేర్పడి పాత్రలు జీవస్వభావ భావోద్రేక మున కట్టినట్టు తేజస్ఫూర్తితో వెలుంగునట్లు చిత్రించియున్నా డు. కావ్యరచన ముదార ధీరస్వాతంత్ర్యమున నిరాఘాటముగ సర్వోపయోగియై యొప్పారుచు సుజనాదరణముల రేపుచుం డును. షిల్లరు మహాకవి పదునెనిమిదవ శతాబ్దపుభాతవరంగము ల జీర్ణించుకొని 19 వ శతాబ్దపుస్వతంత్ర భానూదయమునకు ప్రత్యూషరాగవల్లరిగూర్చియున్నాడు. ఈతని తొల్లిటినాటకము The Robbersఅనునది పుట్టుకతోడనె విశ్వమాన్యతనందుకొని నది. తరువాత మరికొన్ని నాటకములను గద్యమందు రచించి 1787 లో Don Carlos అను లక్షణ నిబద్ధ రూపకమును రచించెను. 99 లో Wallenstein అనుచరిత్ర నాటకమును మూడుభాగములుగ భావప్రాబల్య మేర్పడగల్పిం చెను. తరువాత Mary Stewart మున్నగు నాటకములలో

మానసవ్యాపారముల విమర్శించి వెలిపెను. కౌన్సీనా అనురూపకము యువన నాగరిక కాలపు జీవితమును చక్కని కవు మార కావ్యరీతులలో దెల్పుచున్నది. ఇవిగాక William Tell మున్నగాగల రూపకరాజము లనేకములు వ్రాసి యున్నాడు.

### జో హాన్ గెటే 1749-1832

రవీంద్రనాథటాకూరు, గాంధీమహాత్ముడు, అరవింద గోషు, ఈ ముగ్గురి తెలివితేటలను జీవితపద్ధతులను ఆత్మతత్త్వములను ఒక్కపురుషునియందు చేర్చి వీరికెవ్వరి కందని యనూనప్రభావ ప్రదీప్తుల జేజగిల్లు మహాపురుషుని భావింప గలమేని డాంటే కాళిదాసుల కావ్యశక్తి నిచ్చుట లూహింప గలమేని ఆమూర్తియే గెటే మహాకవి యనివిశదమగును. వీనిజీవితము పవిత్రోదార సదాచారముల నృత్యరంగముగ నాదర్శప్రాయమై సుహితుల్యముగ నుండెను. శమదమాది నియమములేగాక రవీంద్రుని జీవితమం దగుపడు నిత్యరసస్ఫూర్తియు కావ్యసౌందర్యము వీనియం దగుపడుచుండెను. జర్మనుల జాతీయకావ్యరీతి స్వకీయ భావానుభవముల జిత్రించు భావకవనమై యున్నది. అట్టిభావ విశాలవాలమగు జర్మను సారస్వతములో గెటే రచించిన కావ్యములు ప్రత్యేకభావ గీతములుగ నెంచబడుచున్నవి. ఈతను సర్వజ్ఞుడు, సమస్త విషయములందు జర్మనీలోని నవీనభావముల కుదురు ఈతని రచనలందు స్వకీయ జీవితానుభవములు లేతకాంతు లీనెడి పరతత్వచింతతో వెలుగొందియున్నవి. అంతకుపూర్వము రాసు ధీనిధుల సారస్వత ప్రభావమున వాడుకలోనుండిన

తూరద్రితార్కికపద్ధతులుగాని ఇటీవల ప్రాచ్యాదర్శనంపర్కమున నిబ్బెను, మేటరులింకు మున్నగు కవిపుంగవులం దగుపడెడి యవేద్య రూపవిహీనవేదాంతసూచనలుగాని గెటీయందగుపడవు. స్వీయానుభవ ప్రాచుర్యమే, లౌకికాధ్యాత్మికజీవితానుభవము లేయాతనిరచనలం దగుపడు ప్రత్యేకలక్షణములు. ఇందుచేత గెటీరచించిన రూపకములు కొన్ని సందర్భములలో నాట్యరంగపు యభినయ నియమములనుమించి భావగీతికాస్రవంతులై మితిమీరి యుండెను. కాని పాత్రస్వభావ నిరూపణమం దీతడు షేక్సుపియరు మహాకవిని సమీపించు ప్రజ్ఞాసామర్థ్య మొప్పియున్నాడు. మానవ మానసమనుభవించెడి భావసంక్షోభము జీవాత్మపొందెడి వికాసవైపరీత్యములు యోగివర్యుల నేర్పుతో లోచూపు నిందుతెలివితో లెస్సగ జూచి యనుభవించి శబ్దవైశద్య మొప్పెడి సొంపుగులికెడి లేతకైతలలో వెలిబుచ్చు మేటితెలివి ఈ మహాకవి కొప్పియుండెను.

చిన్ననాట హెర్డరువద్దజర్మనుల జాతీయసారస్వతమును షేక్సుపియరు కృతులను క్రోడీకరించగరచి వలచి 1774లో హెర్డరునడిపించుచున్న నవ్యసారస్వతో ద్యమాదర్శముల నిదర్శించుట కొక ట్రాజెడీ రచించెను. వెనువెంట Clavigo అను రూపకము ఆతరువాత ఈతని మహానాటకమగు Faust యొక్క తొల్లిటిపాఠము వెలువడినవి. గెటీ భావకవిత్వమందద్వితీయుడు, ఆనాటిశాస్త్రతత్వవముల లేవెలుగులంది కొనితన కృతులందు ఆత్మీయభావపరికాశమున రచించుచుండెను. వీని లో నీతడు లోతుకు దిగి యపూర్వమును భావిఫలదాయ

కంబునగు నవ్యపథముల దొరిక్కలేదు. కాని మానవ జీవితము నయముగ సుఖప్రదముగ పవిత్రముగ నుపయోగకరముగ నడుపించ నేర్పడి జీవిత సమస్యల కీతని గ్రంథములు శాశ్వతోపకారకములగు సమాధానము లొసగుచున్నవి. భావకవిత్వమునకు ప్రధాన గౌరవమొసంగియు ప్రకృత సమస్యలను జర్చించియు తరువాతి పరాసుదేశపు కావ్యరీతులను శాసించు మార్గదర్శియై గెటీ గతించెను.

అప్పటికి యూరపులో నెపోలియను చక్రవర్తి యుల్కాప్రకాశమున నతిశీఘ్రముగ నొక్కవెలుగున బడిఖవిల్లి పరాజయమొంది ప్రవాస శిక్షననుభవింప జనెను. యూరపులోని సమస్త దేశములందు జాతీయ భావములుదయించి స్వీయ సాంస్కృతరూపములను ప్రకాశింప జేయు కాలము దొచినది. ప్రకృతిశాస్త్ర సహాయమున పరిశ్రమలు విస్తారించి నవ్యజీవన సమస్యలందించు చుండెను. ఫ్రాంచి దేశమున సామాన్యజీవితకథలను భావగాంభీర్యముతో నాత్మానుభవప్రకాశముతో కావ్యవిషయములుగనొనరించి యభినవభావ కవితారీతులు నాటకములందును నవలలందును ఉపయోగించెడి పద్ధతులేర్పడుచుండెను. కళావిమర్శకులు ఇదివరకువలెకొన్ని ప్రాచీనసూత్రముల గైకొని వానిప్రమాణమున కావ్యాదుల ఖండించిశిక్షించుచుండుటలవాటుల మాని కవిహృదయమును తెలిసికొని కావ్యమందలి ప్రత్యేకలక్షణము లామోదించి కళోపాసకులకు సర్వస్వతంత్రమొసంగి లక్షణమునకుండిన యధికారమును మర్పించి కావ్యమునకు స్వాతంత్ర్యమహిమాప్రభావముల గాన్పుచు రసవ్యాఖ్యానమొనర్చుచుండిరి. ఫ్రెంచిదేశపు

నవీనభావకవితారీతులకు వలయు ప్రేరణ యుత్సాహము షేక్సుపియరు మహాకవి యాదర్శనమున నేర్పడినవి.

జర్మనీలో వీలాండుఅనుకవి(1733-1813) షేక్సుపియరు నాటకముల జర్మనుభాషలోనికి సంతరించెను. డెన్మార్కులో ఆన్స్లేగరు(1779-1850) అనుకవిగెటీదారుల నవలంబించి పురుషపాటవమొప్పు రూపకరీతులను యనంతమగు కథాకల్పన వైచిత్రములలో వికసింపజేసెను. ఈతని దృశ్యకావ్యములందు The eve of Saint John, Alladin మున్నగునవిపేరొందియున్నవి. ఈతను భావగీతములు, మహాకావ్యములు, పురాణములు పెక్కురచించి డెన్మార్కుజాతీయ కవిత్వమునకు మహోపకార మొనర్చెను. వీనితరువాత నచ్చటనే హెన్రిక్కు హెర్ట్జుఅనువాతడు 18 సంపుటములలో, లోకవిఖ్యాత కళానైపుణ్యమొప్పెడి నాటకములరచించె. అందు King Rene's daughter అనునది మిక్కిలి మెప్పొంది యున్నది.

ఆస్ట్రియాదేశమున గ్రిల్ పార్జర్ అను మహాకవియుదయించి గెటీ మున్నగు మహాకవులచ్చొరవొందు నాటకరత్నములరచించి యాస్ట్రియాదేశపు నవీనసారస్వతావిర్భావమునకు పోషకుడాయెను ఈతనినాటకము లసమానసౌందర్యమొప్పారుచు పలుభాషలసంతరింపబడినవి. అనేక దేశములలో బ్రిటన్నవ గౌరవముంకుకొనినవి. వీనిలో (Sappho,A faithful servant, Waves of love, The dream of life) మున్నగునవి ప్రత్యేకముగ మన్నింపబడుచున్నవి

19వశతాబ్దములో పాశ్చాత్యప్రపంచమున నన్ని దేశములందు విపరీతకవితావిర్భావము లేర్పడి పత్రికాప్రచురణ

యములను రాకపోకల సౌకర్యమునను ప్రతిభాసమన్వితము గు నవ్య కల్పన మేర్పడిన వెంటనే తక్కుడు బాసలలో సంతరింపబడుచున్నవి. మహాకవులు సమస్త దేశముల సన్మాన గౌరవముల నందికొనుచు దిరుగుచున్నారు. మంచిరూపకములు వెలువడిన వెంటనే అన్ని దేశముల నాట్యరంగము లందు ప్రదర్శింపబడుచున్నది. ఇప్పటికవులు ఒకదేశపు వారు కారు. ఒక జాతివారు కారు. ఇట్టి విపరీత ప్రకట నోపాయ మహిమచే సారస్వత రూపములు భావములు సత్వరముగ దిగంతవ్యాప్తి నొందుచున్నవి. మరియు ప్రజల యార్థికస్థితి బాగుపడి దేశములారాట మెఱుగని సుఖజీవనము సల్పుచు శిల్పశాస్త్రాదులందు ప్రత్యేకముగను విశ్వవిద్యాసమష్టిలోని యంగములుగను వేరువేరు తెరగుల విస్తరించుచున్నారు. ఇట్టిసందర్భములలో ఇదివరకువలె సారస్వతప్రసూనముల, కొన్ని పద్ధతులందు పరిస్థితుల ప్రభావమున కాలానుకూలరూపములు దాల్చినట్లు వివరించి చెప్పజాలను. నవ్యనాగరిక విలాసము దుకొనిన యుగములో ప్రతివిషయమందు తీరనిక్రొత్త రుచులు ఆరనియసంతుష్టి యెప్పటికప్పుడు కొత్తదారుల త్రొక్కిచూచెడి ప్రయోగస్వాతంత్ర్యము ముఖ్యాంశములై యున్నవి. అందుచేత 19 వ శతాబ్దపు రూపక చరిత్రము దేశక్రమమునగాక కాలక్రమమున మాత్రమే ప్రధాన కవుల జీవితాంశముల నిరూపించుచు విస్తరించెదము.

యూరపులోని నానాజాతు లత్యున్నతినొంది స్వతంత్రమగ వికసింపజేసిననెపోలియను తరువాతి భావకావ్యయుగములో నొకప్రక్క నింగ్లాండునందు బయిరను, టెనిసను,

బ్రౌనింగు మున్నగు మహాకవులు పలుతెరంగుల కావ్యక్రియా ప్రకియోగము లొనర్చుచుండిరి. కాని నాటకరచన మాంగ్ల దేశమున జల్లబడినది. ఈ కవుల పోకడలందు లోతగు వేదాంతసూచనలు ప్రాచ్యభావముల సూచించి రవీంద్రాది కవుల రాకకు దారిచూపెడి రీతులు ప్రాచీనకళావిజయమం దభిమానము ప్రధానాంశములై యుండెను. ఆంగ్లదేశమున జనసామాన్యపు జీవితావస్థలు సాంఘికసమస్యలు కావ్యరూప కములందుకన్న డిక్కెన్సు, టాకరీ, ఇలియట్టు, గాస్కెలు ఆస్టెను మున్నగు మహాకథకుల రచనలందు బాడగట్టదొడగెను. ఫ్రెంచి దేశమున నీవిషయములే వీని యామోదమున నేర్పడు నవీన భావవిస్తరణమార్గములచే సర్వతోముఖముగ కావ్యరూపక నవలాది రూపముల వికసించుచుండెను. ఇందు తొలుదొల్త జేర్కొనదగిన మహామహుడు వాల్మీకి సదృశకరుణాంత రంగుడు.

## XII

### విక్టరుహ్యూగో మహాకవి (1802–83)

కావ్యప్రపంచపు శిరోభూషణములలో నొకడు. వాల్మీకి, ఫర్దూసీ, డాంటీ, షేక్సుపియరు, గెటీ, సాఫోక్లీజు మున్నగువేర్ల తోజేర్చి గారవింపదగినమేటికవి. 1822లో కావ్య రచనమా రంభించి విపరీత కల్పనవైభవోద్వేగమున ననేక కావ్యములను గీతములను పద్యావళులనురచించిఅప్పటిపరాసురాజగులూయీ చార్లెసుల యభిమాన పోషణమనుభవించి 1827 లో ప్రజా స్వామ్యసాంఘికాదర్శము లుదయింప నాయేట క్రామ్వెల్ అను ఆంగ్లవీరునిచరితము దృశ్యకావ్యముగ రచించి 7

నికొకపీఠికను చేర్చెను. ఈపీఠికలో దేశకాలకథానియమములనాదేశించుప్రాచీన రూపకలక్షణములతిరస్కరించి షేక్స్పియరవలంబించిన స్వతంత్రపద్ధతుల నామోదించి ట్రాజెడీకామెడీల విషాదహాస్యశృంగార సంధర్భములను అన్నిటిని మహానాటకములందు ఒక్కచోటగూర్చి యల్లవచ్చునను సిద్ధాంతమున్ను ప్రతిపాదించెను. ఇందుమూలముననీతడు పారిసునగరములో సాహితీవ్యాసంగమున బేరొందుచుండిన గాషియర్ ముస్సెటు సాన్‌బోవ, డూమామున్నగు నవ్యమార్గాన్వేషుల చెలిమివడసెను. వీరందరుచేరి థియేటరు ఫ్రెంచియను నాట్యశాలను శాసించుచు, ప్రాచీనరూపకలక్షణంబుల పెగటార్చ యత్నించుచుండిరి. వీరినవ్యాదర్శముల నిదర్శించు కొరకు హ్యూగో 1829 లో Marion Delorme 1830 లో Hernani 1833 లో Lucrece Borgia, Mary Tudor అనురూపకములను సృజించి ప్రదర్శింపజేసెను. తరువాత ఈతని వ్యాసంగము చాలవరకు కథా కల్పన మందు చెల్లుచుండెను. హ్యూగో మానవస్వాతంత్ర్యము, సమానసుఖ జీవనము నీతివర్తనము దయాప్రవర్తనమున్నగునుదార జీవితాదర్శముల నెలకొల్పయత్నించుచుండెను. లోకమానిత సద్గుణంబు లెన్నియో నీతనియందగుపడుచుండెను. వీని కావ్యము లందలి లోపములు కూడ ఈమహాగుణభారముననే కలుగుచున్నవి. ఇతని నాటకములు షేక్స్పియరు పద్ధతివి కావు. గానావకాశములు లేనిఆపెరాలవలె మెలోడ్రామాల రీతిలోనుండెను.

వీనిసమకాలికులలో డూమా, మూసెట్టు, జార్జిసాండుము

న్నగుఫ్రెంచికవు లెందరో రూపకముల రచించుచుండిరి. వీరిలో మిన్నలగు అలెగ్జాండరుడూమా (1802—70) Monte Cristo మాంటిక్రిష్టోమున్నగు నవలల రచించి లోకఖ్యాతి వడసియున్నాడు. ఈతను రచించిన Henry III, Charles VII, La Tour De Nesle అనునాటకములునవీననవలల కన్న నెక్కువలోకజ్ఞానమునుకథా చమత్కారమును భావభారమున్ను కావ్యనైపుణ్యమును చాటుచున్నవి. ఈతని కుమారుడగు

ఛోటాడూమా (1824—95)

24 ఎండ్లప్రాయమున The Dame of Camelia అను నవలనురచించెను. దీనిని రంగోచితముగ కూర్చి ప్రదర్శింప నద్భుతమగు రూపక లక్షణములిందగుపడెను. తరువాత నీతడుఅనేకరూపకముల రచించి నవీనపరాసు రూపకరచయితలలో మేటియనుపేరుపొందియున్నాడు. నైతికసమస్యలను జర్చించుటకు సంఘసంస్కార ప్రణాళికలబ్రవర్తింపజేయుటకు నాట్యరంగ ముపయోగింపదగునని వీని యాశయము. La Question De Argent మున్నగు డూమానాటకములు సాంఘికసమస్యల సంపూర్ణముగ జర్చించుచు స్త్రీస్వాతంత్ర్యమునకు తోడ్పడినవి. కథాకల్పనమందు చక్కని రంగోచితసందర్భముల కూర్పగల సామర్థ్యమొకటియు పొలుపారునైలితని నవీనరూపకములకు కావ్యసౌందర్యమే ప్రాచుచున్నవి. లేనిచో నీతని నాటకములు సంఘసంస్కరణోపన్యాసములుగ జేరి యుండెడివి. ఈతని నైతిక సంస్కరణాదర్శములు మిన్నలైనను వీని సమర్థించుటకు గల్పింపబడిన యవస్థలు నీతిబాహ్యము గనసహ్యముగ, కొన్నితావుల భంగపడియున్నవి.

ఫ్రెంచికవి ఆగేరు (1820-89) ఆంగ్లకవిరాబర్టుసను (1829-71) సొసైటీయనునాటకమందును స్క్రైబుసార్డో అనునాతడు (1791-1861) సామాన్యసాంసారిక కథలలో రసవంత మగుగాథావిన్యాస మమర్చి నవీన సాంసారిక రూపక రీతులను విస్తరించియున్నారు.

కొపీ 1842-1908 అనుకవి విక్టరుహ్యూగో మొదలిడిన భావపద్ధతుల నందికొనియు రోస్టండు కవి Cyrano De Bergerac 1897 అను రూపకమం దును, మేటరులింకు Pelleas at Melisande (1892) అనునాట కమందును భావకవిత్వరీతులననువదించియున్నారు. వీరిభావ పూరితకల్పనాకథలు నాటకకవిత్వమునకు క్రొత్తతళుకులతికెం పుచుండ నింగ్లాండు ఫ్రెంచి దేశములలో గృహాన్త విషయములను దెలిపెడి కామెడీలు హాస్యశృంగార రసభరితమైనవి బయ లుదేరుచుండెను. స్క్రైబుసార్డో రచించిన నాటకములలో పెద్దహాయాడాలు బ్రతుకులలో నొదిగియుండు నీచభావములు వెలుగొందిజనరంజకముగ నేర్పడెను. కానినాట్యకళకిందువలన నెట్టి శాశ్వతోపయోగముకలుగలేదు. ఫ్రెంచి కామెడీలు అవినీతిని ఖండించుచున్నను భావప్రాబల్యమున నైతికాచరణ సదాదర్శముల నెలకొల్పజాలకుండెను. హెన్రీబెక్కు 1897-99 కావను (1858) హారివ్రూ (1857-1915) మున్నగు కవులందిన త్యము మిక్కిలిపిక్కటిల్లి ఫ్రెంచినాటకములనుండి రసప్రకోప సౌందర్యమెల్ల తొలగించివైచినవి. గ్వటీరియను అభినవకవి కొన్ని నిర్వేదనాటకముల రచించినను Pateur అను రూపక ము రసపోషణకు కొంత యవకాశమేర్పరచెను.

గొగాల్ (1809-5) అను రషియా దేశపు నవలరచయిత Revior అను హాస్యరూపకము రచియించి యున్నాడు ఇందు రషియా దేశపు సాంఘిక స్థితులు పరిహాసింప బడినవి.

క్రాసింస్కీ (1812-59) అను పోలెండు కవీంద్రుడు. Undivine comedy అను లోకఖ్యాత రూపకము రచించి యున్నాడు.

ఆంగ్లకవి జేమ్సుబెయిలీ (1819-1602) గెటీరచించినఫాస్టునాటకమును షార్ప్‌కొత్తరూపున వ్రాయదలచి 1839 లో Festus అనుస్వతంత్రనాటకమును రచించెను. ఇది తొలుదొల్తగా రచమొందిన కాలక్రమమున నందులో తరువాత జేర్పబడిన నైతికమత వేదాంత తత్వబోధనలతో బలువెక్కినన విహీనమై యల్లికపొందికలు మరుగుపడి ప్రదర్శనమున కుపయోగింపని కావ్యమైనది.

గస్టేవుఫ్రేటాగు (1816-95) అను జర్మనుకవి. Debit & Credit అనురూపకము రచించెను. ఇందు ధనికుల సంసారక్రమము చిత్రింపబడి యున్నది.

ఎమిలీఆగేయ (1820-59) అను ఫ్రెంచినాటకకవి నవీన సంఘాచారములను స్వభావవైశద్యముతో నాట్యరంగమున నగుపరచు కామెడీలను కల్పించిన మొదటి సాహసులలో నొకడు. మొట్టమొదట లక్షణమార్గములలో Lacigue మున్నగు పద్యనాటకముల రచించి యూవల Les Effrontes మున్నగు గద్యరూపకముల వ్రాయదొడగెను. అనువగు పాత్రస్వభావ నిరూపణము వెనుదీయని నీతిపటిమ సంఘపరిహాసము వీని రూపకములందు గోచరించెడి ముఖ్యలక్షణములు.

ఆస్ట్రొవిస్కీ (1823-96)అను రషియా దేశపునాటకకవి మాస్కోనగరమందు నివశించెడి చిల్లరవర్తకుల జీవితాంశముల గైకొని The Storm, The Bankrupt మున్నగు వన్నెగల నాటకములరచించియున్నాడు. ఈతనుమాస్కోనాట్యశాలకు కార్యనిర్వాహక సహాయమొనర్చుచుండెను.

ఆచాగరే (1832-1916)అనుస్పెయినుదేశపు కవిరాజ్య తంత్రిజ్ఞుడు వేదాంతి అన్నియుకలసినమహామతి ఎనుబదినాటకముల రచించియున్నాడు. యివియన్నియు యూరపులోని దేశభాషలలో నంతరింపబడినవి. ఈతను 1904 లో నోబుల్ బహుమానమొంది స్పెయినుదేశపు నవీన కావ్యోద్యమమున నాయకమణియై వెలుగుచున్నాడు. ఇతని నాటకములలో Mariana, Elgran Galeots మిగుల పేరొందియున్నవి.

## XIII

### ఆధునికనాటక కవిత్వము.

### హెన్రికు ఇబ్సెను (1828-1906)

నార్వే దేశీయుడు. చిన్నతనమున కొన్ని యిక్కట్టుల జిక్కి కష్టములనుభవించి 1819 లో కొన్ని భావగీతములను సామెతలను, సూత్రములను ప్రచురించెను. ఆవల విద్యాభ్యాస మొనర్పనెంచెనుగాని నాట్యరంగ మాతని నుత్సాహ పరవశుగావింప 1850 లో Catilino అను నాటకమును రచించెను. దీనివలన బర్గెనులోని ప్రధాన నాట్యశాలలో రూపకరచనమొనర్ప నియమింపబడెను. తరువాత 1857లో యిబ్సెనుక్రిష్టియానియా పట్టణములోని నార్వేజాతీయనాట్యశాలయాధ్యక్షుడుగ నియమింపబడెను. 58 లో The warriors

of Helgeland అను నాటకమును నార్వే దేశపు తొల్లిటి వీర గీతముల ననుసరించి రచించెను. తరువాత నొక ప్రహసనము వ్రాసి ప్రజాద్వేష మనుభవించి ప్రవాసుడై ఇటలీ యందు కొంతకాలము సంచరించి డ్రెస్డెను మ్యూనిక్కు పట్టణములలో కాలయాపన మొనర్చుచుండెను. ఈతనినాటకములలో Emperor, Galilean, Pillars of Society, Doll's house, Ghosts, Wild duck, Master builder, When we dead awaken అనునవి ప్రధానగౌరవ మొందుచున్నవి.

ఇబ్సెను మానవజాతినంతను పరిహసించెనేగాని నార్వేలోని దురాచారముల మాత్రమే ఖండించియుండలేదు. కాని మానవస్వభావ సామాన్యమగు హాస్యసందర్భముల కైకొనిన ను రూపకల్పనమందు తానెఱింగిన స్వదేశీయుల బాహ్యరూపములనే చిత్రింపవలసి వచ్చెను. ఇబ్సెను మహాకవి నాటకరచనమందు క్రొత్తదారుల మెట్టియున్నాడు. ఇతని ప్రతిభా విశేషములు సార్వకాలికోపయుక్తములని తెలిసికొనుట కెంతయోకాలము పట్టినది. మొట్టమొదట నీతని రూపకకావ్యపఙ్క్తులు నార్వేదేశపు భాషయందొప్పునట్లు యితరభాషలలో వెలువొందవని భ్రమపడుచుండిరి. కాని బర్నార్డుషా 1891 లో "ఇబ్సెను నాటకముల తళుకుబెళుకులు" అను విమర్శకగ్రంథము ను రచించియు ఎడ్మండుగాసె వీనికనేక అభినందన వ్యాసాంజలుల నర్పించియు వీనిప్రభావ మాంగ్లదేశమున జేర్చిరి. విలియము ఆర్చరు అను నాటకవిమర్శకుడు ఇబ్సెనునాటకముల నాంగ్లీకరించి యున్నాడు.

ఇబ్సెను రచించిన Peer Gynt, Brand అను నాటక

ములు కావ్యప్రధానములై యున్నవి. తరువాత నితడు ప్రహసన జాతీయముల జీవకళలుట్టి పడనేర్పరచెను, తుదకుభావ సంకేతికములగు నాటక పాత్రలను గల్పించెను. స్వభావ చిత్రీకరణ మందీతడు చూపిన లోతుచురుకులు జీవించియున్న వ్యక్తి స్వరూపముల బింబీకరణము మిక్కిలి దుస్సహాముగ నుంఛెను. కానికథావిన్యాసమందు స్వగతములను విష్కంభాది ప్రస్తావనలను తోసివుచ్చి కథాంశవు వివరీతా వస్థతో మొదలిడి కాలక్రమమున జరిగిన జరగనున్న వృత్తాంత మంతయు వెలువడునట్లు నేర్పునై యల్లియున్నాడు. ఈ తెలివి Rosmersholm అను రూపకమందు సంపూర్ణ వికాసమొందియున్నది.

ఇంగ్లాండులో రాబర్టునను రచించిన కామెడీల ననుసరించి సర్ ఆర్ధరుపినేరో 1855- ఇబ్సెను ప్రభావ మొకంత చవిజూచియు 1889 లో Profligate అను నాటకమును రచించెను. అందు సాంసారిక కథారూపకము మామూలు గొడవ కన్న నెక్కువ భావగాంభీర్య మేర్పడి క్రొద్దిలో ఇబ్సెను రూపకముల బోలియుండెను. పదంపడి ఈ కవి His house in order అను రూపకమందు ఇబ్సెను నైజముగు కథాకల్పన చాతుర్యమును పాత్రపోషణ పద్ధతులను వెలిగించి చూపెను. అనేకులు ఇబ్సెను ననుకరింప యత్నించిరి కాని లాభమెక్కువకనపడనందున ఇబ్సెను రీతులం దేవగింపుజనించినది.

హెన్రీ ఆర్ధరుజోన్సు (ఆంగ్లకవి 1851-) 19 వ శతాబ్దపు మెలో డ్రామాను అనుసరించి The Silver King మున్నగు కామెడీల మూటినిరచించెను. ఇందుల బరిహాసింపబడిన సాంఘిక విషయములు జాతీయ నత్వమొవ్వాచు విషయమైశా

ల్యమున భాషాసామర్థ్యము నటక్కరితనము నైతికదార్బల్యము వట్టాటోపము దురభిమానము మున్నగు నీచలక్షణముల పవిత్రాదర్శములతో ఖడించు చురుకు తళుకున వాసికెక్కియున్నది.

## మారిసుమేటరులింకు 1862.

బెల్జియము దేశపు మహాకవి 1889 మొదలు నల్గుబడి నాటకములను కావ్యములను రచించి 1911 లో నోబుల్ బహుమానమును పొందియున్నాడు. ఈతని నాటకములు కీలుబొమ్మలాటలకొరకు ప్రధానముగ వ్రాయబడినవి. ఇతని గద్యము పద్యసారళ్యమున సాధుకోకిలల పదసంవంతియై చల్లగ ప్రవహించుచు నీనిరూపకలక్షణంబగు నాత్వికరస నిరూపణమందద్వితీయ సౌకర్య మేర్పరచుచున్నది La princes Melene, Mona Vanna Betrothal మున్నగు ననేకనాటకములీతని కళాపద్ధతుల దెలుపుచున్నవి. మానవ జీవితమందు వ్యక్తమగున వేద్యరహస్యముల దెలిసికొనుటకు కీతడు యత్నించుచుండును. కొన్ని సమయములలో నవేద్యసూచనలకు రూపకకల్పనమొనర్చి నాటకకథనేర్పరచును. ఇతని పద్ధతులు ఉత్ప్రేక్షాదూషితములనియు, సాంకేతికములనియు భావసూచకములనియు పలుతెఱంగుల ఖండింపబడినవి, ఈతని నాటకములలో కథావస్థల నేర్పడుచేష్టా సంచలనము చాలవరకు తగ్గింపబడినవి. అవస్థలు సూచింపబడునేకాని అభినయాంశముగా ప్రదర్శింపబడవు, మానస సంచారమై ఖరులు ముఖ్యముగ స్వాత్వికర సానుభవమందేర్పడు ప్రశాంతచిత్తవృత్తులు మాటర్‌లింకురూపకములందు చక్కగనిరూపింపబడినవి.

### హాప్ట్‌మన్ 1862

జర్మను నాటకకవి. 1912 లో నోబెలుబహుమాన మందికొనిన Die Weber మున్నగు నాటకముల రచించెను, ఈతని మొదటికల్పనలందు సమకాలిక సంఘాచారములు భావాదర్శములు ధైర్యముగ మనసు విప్పివెలపరించ బడినవి. స్వభావచిత్రమందు నవీనజీవితములోని నీచావస్థలు హాస్యకర మగు వైశద్యముతో చూపబడినవి. కాని కామెడీరచన మందీతడు యిమాన్యుయల్ క్వింటు అను రూపకమందును Atlantis అను దానియందును క్రొత్తపోకడల రుచులేర్పరచి యున్నాడు. ఈతని నాటకము లనేకబాషలలో జేర్పబడినవి.

### బర్నార్డుషా (1856)

ఐరులెండులో జన్మించి 1879 లో లండను నగరమందు పారస్వత జీవనమేర్పరచుకొని వచ్చి చేరెను. కొంతకాలము నవలలు విమర్శనలురచించి గాన శిల్పాదివిషయములందు లోక విఖ్యాత విమర్శకాధికారము సంపాదించియున్నాడు. ఈతను సాంఘిక రాజకీయ విషయముల కూడ జర్చించుచుం డును. అనేక సంపుటములలో దట్టముగ నిండెడి నాటకపరం పరల గల్పించి పేరెక్కియున్నాడు. ఇతను వాదప్రతివాద ముందు కడునేర్పరి. హాస్యము ఆక్షేపణ వెక్కిరింపు మున్నగు వాదసాధనము లీతనిగ్గె వశము. నాటకములు కడుపెద్దవై తుదివరకు పర్యవసానము తేలకుండును. వీనిలో Back to Methusaleh, Man and Superman మున్నగునవి ఈతని తత్వా భిప్రాయముల దెలుపుచున్నవి. పకృతిలోని శక్తులను సాధించి వశపరచి వాని సహాయమున కార్యభ్రంశ మేర్పడకుండ ఎక్కువకవముతో నెక్కువ ఫలమొందెడి మానవుడు మహా

పురుషులని భావించి యిట్టి వానినేత్రుతత్వమున ఇటువంటి శక్తి నందరు సంపాదించు యుద్దేశ్యముతో మానవలోకము యత్నించి యన్నివిధముల ముందడుగు వేయుచున్నదని ఈతని యభిప్రాయము. నిరంతర సద్భావయోజనమే స్వర్గమనదగును ముందుకు నడువ యత్నించుచు బోర్లపడుచుండెడి మానవజాతికి దారిచూపి తోడ్పడుటయే పరోపకారమే బ్రహ్మానందము. ఈ భావములను బర్నార్డు పాత్రనాటకములలో వివరించియున్నాడు. ఇతని కథాకల్పనము లోపభూయిష్టమైవాదోపన్యాసముల నడుమనుక్కిరి బిక్కిరిగ సన్నగిలినిస్సార నీరసరూపమున నుండును. చిలిపి వెక్కిరింపులు పలగాకివాగుడు భావ గాంభీర్య సౌందర్య మొప్పెడి యుదార సందర్భములనడుమ తలజూపి చెలరేగి కథాసారళ్యమును రసావస్థను చెరిచియు సభ్యముగ జేయుచుండును. కాని కామెడీలలో సాంఘిక విషయములను అవలీలగ చురుకు పోటులతో దర్శించి పరిహసించి సంస్కరించెడు నైపుణ్య మీతని యందుమూర్తీభవించియున్నది.

జాన్ గ్లాసువర్థీ రచించిన నవీననాటకములలో కొంత సదుద్దేశ్యముగు పడినను వీని యుత్తము నాటకముగు Strife అనునది కూడ నాటకరచనమందు ఎట్టి కళాసిద్ధి నొందినదని చెప్పజాలము.

సర్ జేమ్సు బారీ 1860- అనేక కామెడీలను విచిత్ర రూపకములను రచించియున్నాడు. వీనిలో 1904లో వెలువడిన Peter Pan అనునది వన్నె కెక్కియున్నది.

ఐగులెండులోని డబ్లిను నగరమందు ఆబీథియేటరులో

కామెడీ రచనమ దు కొన్ని ప్రయోగ పరీక్షలు జరుగుచున్నవి. ఇందు యీట్సు, సింగ, మున్నగు కవులు నాట్యకళాపరిణామ మెరుగదలచి పాటుపడు చున్నారు. సింగారచించిన Playboy of the western world 1907. వీరి పద్ధతులదెలుప గలదు.

ఇంతలో యూరపునందు ప్రాచ్య దేశముల కావ్యనాటక రూపములు ఎరుకగలవారి యుల్లము సలయించుచున్నవి. రవీంద్రనాథటాకూరు రచించిన కొన్ని నాటకములు జపాను దేశమున వాసికెక్కిననోఆ రూపకములు బొమ్మలాటలు చీనా దేశపు నాట్యరీతులు పాశ్చాత్యుల గౌరవమొందియున్నవి. వీనినన్నిటిని పరీక్షించి చూడ లోకములోని అన్ని దేశము లందు కావ్యవైఖరులు రూపకస్వరూపములు కొంచె మించు మించుగ నొకేరీతిగ నుండునని తేలుచున్నది. ఆయాజాతి యొక్క ప్రత్యేక జాతీయత యొకింత యగుపడుచుండును కాని కథాంశమందును కల్పనపద్ధతులందును దేశభేదమున జనియించు ప్రత్యేకవిభేదము లగుపడవు. ప్రస్తుతము యూర పులో బొమ్మలాటలందు మూగాభినయము దు సినీమారుప యోగించెడి యభినయమందును జనాదరణ మెక్కువ కనబడు చున్నది. ఇప్పుడు జీవించియున్న పాశ్చాత్యనాటక కవులలో ఇదివరకు పేర్కొనబడనివిఖ్యాతనామధేయుల గొందరి నీయెడ నుదహరించెదము.

Byornson బ్యోర్న్సన్ 1832-1910.

నార్వే దేశపు కవితిలకము. కావ్యములు నాటకములు నవలలు, పిట్టకథలు సమాన నైపుణ్యముతో రచించి, 1903

లో నోబెలు బహుమానమందికొనెను. ఈతని మొదటినాటకము, Lame Hulda, వెలువడిన వెంటనే ప్రజామోదమును వడసి మిక్కిలి గౌరవింపబడెను. తరువాత ఇటలీలో రెండు సంవత్సరములు నివసించి, 1861-1862 లో King Severre, Ligurd the Bastard, అను చారిత్ర రూపకత్రయమును, రచించెను. వీని కళాప్రాభవమున, వీనిపేరు జగమంతయు నిండిపోయెను. తరువాత క్రిస్టియానియాలోని, జాతీయనాట్యశాలకు సూత్రధారుడై, పెక్కు రూపకముల రచించెను.

## తామస్సుహార్డి 1840.

అంగ్లనాటకకవి, నవలవ్రాయసీ. కొంతకాలము శిల్పిశాస్త్రమభ్యసించి యావల 1860 మొదలు 70 వరకు కొన్ని పద్యకావ్యముల రచించి 71 లో తొల్లిటి నవలను రచించెను. ఈతని నవలలు, ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన మాలపల్లివలె నొక ప్రత్యేకమండలిలోని ప్రజలను వారి వాడుకభాషను లక్షించి వ్రాయబడినవి. ఇట్టి రాష్ట్రాభిమానముచేతను, భాషాభిమానము చేతను, యీతని కావ్యరీతు లొకవిధముగ నుపకరించుచున్నవి. ఇంతియేకాక మానవగుణసమష్టి నవలోకించి, యథార్థసమభావములతో చిత్రించు నేర్పుకూడ యుండెను. ఇతనికిథలు లెక్కలేనన్ని కలవు. కథలకన్న భావగీతములే చిరకాల ముండవచ్చును. ఇందలి పాత్రివాచికములు, తన యభిప్రాయమును సూచించవనియు, లోకములో నితరులనుకొనెడి తలపుల దెలుపుననియు హార్డి చెప్పుకొనును. కాని వీనిలో నీతని జీవితానుభవము, ఆత్మీయభావవికాసమున లేతవన్నెల సొంపులీనెడి, ముద్దుకైతలలో

కలుగుచున్న వనుటకు సందియమగుపడదు. ఈతని కథాకావ్యములందు, మానవజన్మ నిరుపయోగ ప్రయాసమనెడి తత్వమగుపడుచుండును. 1904 లో నెపోలియను, కయ్యముల కాలపు, యితివృత్త మెత్తుకొని Dynasts అను మహానాటకము, అనేకభాగములుగ రచించెను. ఇది రూపకరూపమున కల్పింపబడిన మహాభారతమువంటిది. డూమా రచించినబహు సంఘటనవలలం దెట్టి విస్తీర్ణకథాప్రపంచన మగుపడునో అట్టిపొందిక చెడని మేటికథ సర్వాంగ సామంజస్యమున మహాకావ్యపరిమాణములో నూహించి నేర్పుమైనిర్వహింపబడినది. మానవుడు తానెరుంగని తన్నుమించిన భూతప్రపంచములో గన్నుగానక తానే మిన్నయని మిడిసి వ్యర్థుడై స్వాభిమాన విదగ్ధుడై తొట్రుపడి యులికి దుఃఖించుచుండుననియీతని యభిప్రాయము. మనమెరుగని దూరబలవత్తర శక్తులెవ్వియో గాకతాళీయముగ నడ్డుతగిలి మనయత్నముల భంగపరుచుచుండును. ఈభావము Dynasts మహానాటకములో చిత్రిసౌందర్య మేర్పడచికిత్రింపబడినవి. మును మొదలు భావసంక్షోభము దానిగలిగించు కథావస్థలు మానవాహంకారమునకు దోచెడి పెనుబింకమున చిత్రింపబడినవి. ఆవలనెచ్చటనో, కడుదూరమున రెక్క తెరవుల విహరించు భూతగణంబుల చూపులో చీమలపోరాటమువలె నగుపడు స్వల్పరూపమున మానవావస్థలు చిత్రింపబడినవి. అనగా మనదృష్టిలో బ్రహ్మాండమైకాల్యమున నగుపడు మనగొప్పలు, చేతలు, పలుకులు, రాగకోపములు, విశ్వదృష్టిలో నత్యల్పనిర్నిమిత్త నీచావస్థలో నగుపడుననుభావమీ నాటకము తెలుపుచున్నది. వాచక

ములోని పద్యములు దేవతాపాత్రిల పాటలు, సంభాషణము, అన్నియు రమ్యముగ కూర్పబడినవి. ఈనుహానాటకము దేశ చరిత్రల వెలుపు నాటకకవిత్వమున క్రొత్తమార్గముత్రొక్కి- పండితమాశ్రితమై వెలుగుచున్నది.

## సర్ జేమ్సుబారీ 1860

ఆంగ్లరచయిత. లండనులో పెద్దపదువులగలచి 1887 మొదలు కథలను వ్యాసములను నవలలనురచించి 1891 నుండి నాట్యసమస్యలను విచారింప దొడగెను. 1894 లో Professor's Love Story అను హాస్యరూపకము రచించెను. కాని దీనిలో పెక్కు- దోషములున్నవి. 97 లోనీతడు రచించిప్రదర్శించిన The Little Minister అను నాటకముతో నీతని నామర్థ్యవైభవ్యములు తెల్లమయినవి. "ఏమీ ఇతడు నాట్యరంగము నొక బంగారు గనిగాచేసినాడే?" అనిస్టీవెన్సనుఅచ్చెరువందునట్లుగా లండనులో నొకేదినమున ఈతని నాటకములయిదారు ప్రదర్శింప బడుచుండెను. The Wedding Guest, The Admirable Chricton,Little Mary, Peter Pan ప్రధాన రూపకములు, Peter Pan ఆంగ్ల నాట్యరంగమున భాసిల్లు రూపక రాజములలో నొకటి. ఇందు బారీయొక్క- నిజస్వభావానుభవములు ప్రకాశించుచున్నవి. తరువాత యితనుమరి కొన్ని రూపకములను వ్రాసియున్నాడు. The Twelve Pound Look, A Kiss for Cendrella మొదలగునవి నూంగ్ల ప్రేక్షకులకు నిరంతర నాట్యవినోద మొసంగుచు ప్రస్తుతము మిక్కిలి జనరంజకముగ నున్నవి.

—♦సింగ్ 1871 — 1909♦—

ఐరు లెండు దేశపు నాటకకవి. జనసామాన్యపు జీవిత మును చక్కగ బరిశీలించి యున్నాడు. డబ్లినులో ఆబీనాట్య శాలయందు రూపకప్రయోగ పరీక్షలు జరుగుచుండెను. వాని కొరకీతడు The Shoadow of the Glen, Riders to the sea, The well of Saints, the Tinkers Wedding, మున్నగు నాటకముల రచించి ఐరులెండులో ప్రస్తుతము నడుచుచున్న రూపక సంస్కార ణోద్యమమునకు గేలూత నిచ్చియున్నాడు. ఇతని రచనలో పల్లెటియందములు మంచి పటుత్వము గోచరించును. ఇతని రసవిభావన మసాధారణము. ఇదియు స్వభావచిత్ర మందలి నైపుణ్యముచేరి యీతనినాటకములకు వన్నె వెట్టినవి.

—♦యీట్సు 1865♦—

ఈసంవత్సరపు నోబులు బహుమాన మొందిన ఐర్లెండు దేశపు కవిపుంగవుడు. డబ్లినులోని విద్వన్నాట్య రంగమును నెలకొల్పిన ధీమంతులలో నొకడు. Countess Kathleen అను నాటకము రచించియున్నాడు.

వీరుగాక గార్డనుక్రేగు, అనంజరో, డ్రింకువాటర్, మున్నగు ప్రసిద్ధరూపక రచయితలెందరో నవీన నాట్యరంగ మును తమ రూపకసమర్పణచే వెలిగించుచున్నారు. ప్రస్తుత ము అన్నివిధములగు రూపకములు ప్రజామోద మనుభవించు చున్నవి పూర్వకాలమున ప్రాచుర్య మిప్పటియంత లేకుం డెను. నాటకకవులు మున్నుగాగల కళోపాసకులు ప్రభుమం దిరంబుల నాశ్రయించి తమ కృతులను వెలుపరించి స్థానిక గౌ రవ మనుభవించుచుండిరి. వీనిలో నిలువగల సత్వముండిన

మంచికృతులు స్వదేశమునుదాటి యితరసీమల జేరగలిగెను. కవులు రాజాశ్రితులగుటచే నెక్కాలమున నేదేశవు రాజమౌళి సామ్రాజ్యవైభవ మనుభవించుచుండెనో నాట్యాది సరసకళల పోషించు యౌదార్యమొప్పి దీనికివలయు సంస్థల నేర్పరచుచుండెనో, ఆదేశముననే మేటికవుల కృతు లుదయించు చుండెను అదికాక ప్రజలకు విజయోత్సాహము లేర్పడిన జాతీయ మ్మహోదశలలో కళావిజయ మేర్పడుచుండెను. ఇప్పుడు ప్రజాపోషితమై యనంతమగు నవకాశము లేర్పడి నాటక కవులకును నటులకును అనూహ్యావకాశము లేర్పడినవి. మరియు నాధునిక ప్రచురణ సాధనములచే నొకచోటి కళాస్వరూపములు భూమండలమెల్ల గ్రమ్ముకొనుచున్నవి. రుచులనంతము పోషకులు జనబాహుళ్యము. అవకాశములు నిండార ననుకూలించుచున్నవి. ఇందుచే ననేక విధములగు రూపకరీతులు ఏక కాలమున నాదరింపబడి పెంపొందుచున్నవి. శాసించు ప్రభువులుగాని యధికారి పరిషత్తులుగాని పూర్వపు ప్రాభవమున నవ్యరచనా సాహసమును అడ్డగింపజాలవు. అందుచేత ప్రస్తుత కవులలో నెవరుమేటిరో యేరూపకములు కాలశిక్షలో నారితేరి నిలువగలవో చెప్పజాలము. అన్నియు నాదరింపబడుకతన రూపక ప్రాశస్త్యమునుగాని కవి యోగ్యతనుగాని నిశ్చయముగ నిర్వచింపజాలము. సారస్వత వికాసము జాతులు కష్టనిష్ఠుర మనుభవించు పేదదశలో జాతీయ సత్వపూరితమగు మోటు తెరవుల గొద్దిగను విపులైశ్వర్య మనుభవించెడి శాంతి సుఖజీవనములో లక్షణాలంకృతమగు చిత్రవైఖరులను విస్తరించుచు, లక్షణమునకును, కళాస్వాతంత్ర్యమునకును, నిరంతర

మగు వైరుధ్య మేర్పడుచు వీని విజయపరాజయ క్రమములతో సారస్వత చరిత్రము నిండియున్నది.

19 వ శతాబ్దాదియందు భావస్వాతంత్ర్యమును జాతీయపతిత్వమును సర్వసమత్వమును సూచించు ప్రాకృత వాఙ్మయ రూపకము లెక్కువ యేర్పడినవి. ఆ శతాబ్దాంతమునకు భావగాంభీర్య సూచకములగు చిత్రవైఖరులు, రుచికరములాయెను. ఇరువదియవ శతాబ్దములో ప్రాచ్యపరచింత పాశ్చాత్య సారస్వతమందు గౌరవింప బడుచున్నది. యెట్లైనను కడచిన నూరు సంవత్సరములలో యూరపులోని ప్రతిదేశమందు నానావిధములగు సారస్వత స్వరూపములు ప్రజాపోషితములై వన్నెకెక్కుచున్నవి. యీస్కిలసు, మూల్యేరు, షేక్సుపియరు, గేటీ, యిబ్సెనుమున్నగు, నవతారకవులు యెన్నడోకాని దైవప్రసాదమునగాని జనియింపనేరరు. ఈకాలములో వేలకొలది రచయితలు నాట్యాదికళల సేవించుచుండ మహాకవి యవతారముల సకృద్ధావిర్భావములు అసంభవము కావచ్చును. కాని లలితకళల విమర్శనయు, నవ్యకలనయు ప్రయోగపరీక్షయు పూర్వమెన్నడును లేని విశాలావకాశము లతో జరుగుచున్నది. యూరపులోని చరిత్రాంకముల నీవిధి జూచినందున పైప్రకరణములోని రూపకవికాస సందర్భములు లెస్సగ గోచరించునని నమ్ముచున్నాము.





# ఆటకోలను

## నాట్యరంగము.

థియేటరు అను శబ్దమునకు చూచెడితావు, లేక దృశ్యప్రదర్శన ప్రేక్షకసభ, అను అర్థములు చెల్లుచున్నవి. ప్రస్తుతము, గానవినోదములను, రూపకాభినయములను, సలిపెడి, కట్టడమునకు పేరు.

తొల్లిటి యవననాటకములు ఆరుబయట నాడబడుచుండెను. రంగస్థలము దేవతామంటపముగ నుండెను. గానమేళము నృత్యగీతములతో యీమంటపమును బరివేష్టించి, కూర్చుండియు తిరుగుచును, హంగుగావించుచుండిరి. ప్రధాననటులుమాత్రమే మంటపముమీద నెక్కి యభినయించుచుండిరి. తరువాత కొంతకాలమునకు సంచారీనాట్యసమాజము లేర్పడ పల్లెటి బజారులలో నటులు తమ సామానుబండ్లపై నెక్కి వానినే రంగస్థలముగ నుపయోగించి యాడుచుండిరి. తరువాత B.C. 500 లకు యాతెన్సుపట్టణములో తొల్లిటి శిలాశిల్పిత నాట్యమందిరము, ముప్పదివేలమంది కూర్చొను అవకాశముతో నిర్మింపబడెను. ప్రాచీన నగరరాజములలో

నిట్టి వెనుకట్టడము లేర్పడెను. రోమక నాట్యశాలలు యవన పద్ధతులలో కట్టబడినవి. ఇందు పరిషత్ సభ అర్ధవలయా కారమున సోపానపరంపరలతో, గట్టబడి పైన కప్పుగలిగి యుండెను. మధ్యమధ్య జనులు వచ్చిపోవుటకు మార్గము లుండెను. రంగస్థలమునకును ప్రేక్షక సోపానములకును నడుమ గానమేళములు తీర్చియుండిరి.

మధ్యకాలములు మతప్రచారక రూపకములు క్రైస్త వాలయములందును, సత్రములందును ప్రదర్శింపబడుచుండెను. నవీనయూరపులో మొదటి నాట్యమందిరములు 1548 లో ప్యారిసుపట్టణమందును, 1580లో రోమునందును కట్టబడినవి. ఇంగ్లాండులోని మొదటిథియేటర్లు బర్బేజి మహానటునిచే 1576 లో కట్టబడెను. తరువాత 1600 లలో యాతడు లండనునందు బ్లాకుఫేరు నాట్యశాలను, గ్లోబుథియేటరును కట్టించెను. ఈనాట్యశాలలు ఆరుముఖములుకలిగి పైన కొంత వరకు తెరచుకొని రోమకపరిషత్తులను, ప్రస్తుతపు సర్కసు డేరాలను పోలియుండెను. క్రిందిగోతిలో సామాన్యజనులు నిలుచుండి, ఆటను చూచుచుండిరి. నాట్యరంగము మంటపమువలె సమాజాంగణములోనికి పొడుచుకొని యిరుప్రక్కల పెద్దమనుష్యులుకూర్చుండు ఉత్తమాసనము లుండెను. తరువాత నాట్యరంగము మంటపాకృతి మాని వెనుకకు జరిగి చుట్టును మూయబడిన చిత్రపట రూపమును దాల్చినది. ఈనాటి జగద్విఖ్యాత నాట్యశాలలలో ప్యారిసునగరమందు 1875 లో కట్టబడిన ఆపిరామందిరము, మిలానుపట్టణములోని స్కాలామందిరము, నేపిల్సులోని సాన్ కార్లోనాట్యశాల,

డ్రెస్‌డన్ మ్యూనిక్ నగరముల జర్మనురాజ నాట్యభవనములు, బేరిత్తులో వాగ్నరుమహాగాయకుడు నిర్మించిన గానభవనము, న్యూయార్కులోని మాడిసనుదియేటరు మున్నగునవి మిగుల ప్రసిద్ధిజెంది యున్నవి. మాడిసనుథియేటరులో రంగస్థలము మూడంతస్థుల మందిరములపై గూర్చబడుచుండును. ఒకసీను ఆడుట పూర్తికాగానే, అది విద్యుత్సహాయమున బొంబాయిలోని యెలెక్ట్రిక్కు లిఫ్టువలె క్రిందికిదిగిపోయి పైనున్నసీను స్థానమునకు దిగును.

నాట్యరంగమందు చమత్కారమగు సీనరీచిత్రములను, గల్పించుమార్గములు యవనసూత్రధారులెరిగియుండిరి. కాని యీకాలములో విద్యుద్దీపములసహాయమునను తక్కుడురంగ పరికరములయంత్రసౌకర్యమునను, నాట్యరంగములో సూర్య చంద్రుల యుదయాస్తమయములు, నదీసాగరజలసంచలనము, తుపానులు పిడుగుపాటులు మున్నగు ప్రకృతివైచిత్ర్యములు యథారూపముగ నచ్చంపుటందములతో జూపబడుచున్నవి. లక్షలకొలది వ్యయపరచి ప్రకృతిననుకరించు రంగభ్రాంతి నేర్పరచ యత్నించుచున్నారు. కాని కొందరు ఆడుబయటను, తెల్ల తెరలయెనుటను. నాటకములాడి అభినయమే ప్రధానాం శముగ నొనర్పదలచుచున్నారు.

మహాత్ములు నివసించుచుండిన, ద్వారక, అయోధ్య నైమిశారణ్యము మొదలగు ప్రదేశములు తీర్థస్థలములై బరగి నటుల, యూరపులో కొన్నినాట్యశాలలు, తొల్లిటనుండియు లోకోత్తరమగు రూపకముల బ్రదర్శించి యు మహాకవుల తెలివితే తేట లంతరమందే గ్రహించి యాదరించియు, మహానటులను

జేర్చి యాడించియు, నాట్యకళలో క్రొత్తదారుల స్వతంత్రించి ద్రొక్కియు, మిన్నలై పేరుపెంపుల వడసియున్నవి. ఇట్టి నాట్యశాలలలో గొన్నిటి యుదంత మీదిగువ నుదాహరించె దము.

(1) డబ్లినుపురములోని ఆబీధియేటరు—1898 లో మామూలు బజారు నాటకములకన్న నెక్కువ కళాచాతుర్య మొప్పెడి నాటకముల నాడు తలంపుతో ఐరిషునాట్యసాహితీ మండలి నెలకొల్పబడినది. ఫే—గారి మానేజిమెంటులో నీ సమాజము The Hour Glass, Kathleen మున్నగు నాటక ముల బ్రిదర్శించెను. ఇందలి సౌకుమార్యము, స్వాతంత్ర్య ము, లేతచందనములు చూచి మెచ్చి హార్నిమన్ దొరసాని 1904 లో నీసమాజము వారుచితముగ నుపయోగించుకొరకు ఆబీ ధియేటరు కట్టించి ఇచ్చెను. ఇప్పుడాసంఘము అయిరిషుజాతీయ నాటకసంఘముగ వ్యవహరించుచు, యీట్సు, సింగా, మూర్టిను, మూరు, కొలం, ఎర్త్వైను, డగ్లసుహైడు, బెర్నార్డుషా, మున్నగు నాధునిక లోకవిఖ్యాతనాటకకవుల కల్పనలు బ్రిదర్శిం చుచున్నది. కామెడీరూపకమును లేత చందములలో గులికింప జూచెడి పుణ్యస్థలములలో నిది ముఖ్యమైనది.

(2) Academy of Dramatic Art లండను. నాట్య విద్యాలయమును 1890 లో సర్బీర్బాముట్రీ యను మహానటుడు స్థాపించియున్నాడు. ఇందు నటులు నాట్యశిక్షగరచు చున్నారు.

(3) ప్యారీసునగరములోని థియెటరు ఫ్రెంచీయు అను 1680 సం॥ లో లూయీ XIV చక్రవర్తి శాసనమున

మాల్వేరుమహాకవిరూపకముల బ్రదర్శించుకొరకు కట్టబడినది. 1689 ఫ్రెంచిజాతీయనాట్యశాలగ నంగీకరింపబడి, రానీను మహాకవి కృతులను బ్రదర్శించెను. 1900 లో తగులపడి తిర్గి వెంటనే గాడెట్టను ధార్మికునిచే కట్టించబడినది. 1793 లో జాకబీను పితూరీదారులు దీనిని బహిష్కరించిరి, కాని 1812 లోనె పోలియనుచక్రవర్తి మరలనుజ్జీవింప జేసియున్నాడు. ఈ నాట్యశాల ఫ్రెంచిజాతికి చెందియున్న నాట్యపరిషన్మందిరము. ఇందులో మొదట నాట్యవిద్యనభ్యసించినతరువాత వేతనము గొనుచు కొంతకాలము నటులు అభినయించుచుండవలెను. వీరినాటకములలో ప్రతిపాత్రమును క్రమశిక్ష నొందిన యధికారినటులే ధరింతురు. ఈనటులలో మిక్కిలిపేరెక్కినవారు కొంతకాలమునకు అధికారిమండలిలో ఎన్నికవలన జేర్చుకొనబడుదురు. నాటకపు ప్రకటన పత్రములమీద అధికారి సభ్యుల నామములు ముద్రించుచుందురు.

(4) లండనునగరపు డ్రూరీలేను నాట్యశాల 1661 లో కట్టబడినది. ఇందు ప్రదర్శింపబడిన మొదటిఆట బోమంటు ఫ్లెచ్చరులు రచించిన The Humorous Lieutenant, కిల్లిగ్రూ అను నటునిచే నభినయింపబడినది. తరువాత 1672 లో తగులబడి సర్ క్రిస్టఫర్ రెన్ను అను మహాశిల్పిచే 1794 తిరిగి కట్టబడినది. ఇదియు 1809 లో తగులబడి తిరిగి 1812 లో బెంజమిన్ వయట్టు అనుశిల్పిచే కట్టబడినది. ఇందు కీను మాక్రెడీ మున్నగు మహానటులు చిరకాలమభినయించుచుండిరి.

(5) లండను—గ్లోబు థియేటరు—1599 లో దీన్ని బర్బేజీమహానటుడు షేక్స్పియరుమహాకవి చేరి సొంతముగ

కట్టుకొనిరి. ఇందు షేక్సుపియరుకూడ అభినయించుచుండెను.

(6) మాస్కోనగరములో నాట్యకళాస్వరూపము నిర్ణయించుటకు ఒక రూపకప్రయోగ నాట్యశాల నెలకొల్పబడియున్నది. ఇటులనే యూరపు అమెరికాఖండముల రాజధాని పట్టణములలో సాహిత్యపరిషత్తులు కళాపరిషత్తులు ఆయాజాతికొక్కొక్కటి యుండి పాశ్చాత్యకళా విన్యాసమును శాసించి మంచిదారుల నడిపించుచుండును. పాశ్చాత్యులలో విజ్ఞానసంపాదనమందు దురభిమానములు తక్కువ. ప్రపంచములలో ఏదేశమున నెవ్విధమగు మంచియున్నను కళాస్వరూపముకండినను సారస్వతరూపు లగుపడినను ఆదరముతో గైకొని తమభాషలోనికి నంతరించి దాని యుపయోగమూరసి ఇట్టి దినదినప్రవర్ధమాన విజ్ఞానాతిశయముతో బలుతెరంగుల నభివృద్ధిజెందుచున్నారు. గర్వాభిమాన దురహంకారములు వదలి కనువిచ్చి విజ్ఞానప్రపంచమును చూచి మన యనుభవముల విస్తరించి మానవజాతియొక్క అనుభవసమష్టిని మన జాతీయప్రబోధములతో జతపరచి సమన్వయముచేసి యణుత్వమును గలించిన మానవానుభవమును ఒకకంటితో చూచుచు మఱియొకకంటిని నవ్యాదర్శములపై నిలపి కళాజీవనమునలుపుచు లక్షణశృంఖలములలో చిక్కికొనక గర్వాభిమానతమిస్రమున గ్రుడ్డిపోవక నిరంతరభావ సంచలనమునకు నవ్యకళాస్వరూపముల బ్రయోగించిచూచుచు స్వతంత్రించి నడచినగాని మననాట్యకళ యభివృద్ధి నొందనేరదు.

(7)



## II

## అభినయము

ప్రాచీనజాతుల మహోత్సవములందు నాటకములంకు రించినట్లు అభినయముకూడ దేవతారాధనమునందును, కులాచారములందును జనించినది. మొట్టమొదటి యభినయము మూకచేష్టలుగ, కేవలము ఆంగికాభినయమై యుండెను. తరువాత పాటలు సంభాషణము కూడ నటుడు వుచ్చరించ వలసివచ్చెను.

యవననాటకములు ప్రహసనములు దేవతారాధన క్రమములనుండి వికసించినవి. ఇందు మేళనాయకుడు నాటకముల వ్రాసి పాటలనల్లి వానినభినయించెడిరీతి తక్కుడు మేళగాండ్రకు గరపుచుండెను. వీరకథల పాడునపుడు మేళనాయకుడు రసావేశమొంది వీరునిలక్షణములు తనయందారోపించుకొని తన మనోవృత్తులను ఆంగికాహార్య వాచికరీతుల బ్రకటింప యత్నించుచుండెను. ఇదియే నాటకాభినయమందు మొదటిమెట్టు. యవననాటకములలో నుపయోగింపబడిన ముఖవేష్టనములు Masks ముఖమందు భావప్రకటన మొనర్పకుండ జేసినవి. ఇట్టిస్థితిలోనే యవనరోమకనటుల నాట్యకౌశలము, కృత్రిమ ముఖాచ్ఛాదముల వెనక మరుగుపడియుండెను. మహోపన్యాసకుల రీతులందు భావోద్దీపన మొనర్చెడి యభినయకౌశల మగుపడుచుండెను. అయిదవశతాబ్దము మొదలు 15వ శ॥ వరకు నడచిన వేయిసంవత్సరములలో పాశ్చాత్యవిజ్ఞానము నిద్రావస్థయందు అభివృద్ధిగాంచక తొట్రుపడుచుండెను. యూరపు అప్పుడు తమోనిలయము గనుం

డెను. మరల 15 వ శతాబ్దములో మేల్కొని నవ్యనాగరికబీజ ముల జల్ల మొదలిడినపుడు, ఏర్పడిన మొదటినాటకములు నాట్యాభినయములు యవనప్రాచ్యభూములలో నేగతి నుద యించినవో అట్టి శైశవావస్థనే ప్రగమ్మరననుభవించినవి. మతప్రచారమునకై క్రైస్తవ మతాంశముల నితివృత్తముగ గైకొని పూర్వమువలెనే ముఖవేష్టనము ధరించిన నటులచే నభినయింపబడెను. తరువాత నాటకప్రదర్శనములు జనసామా న్యమందికొనిరి. తొల్లి యవనరోమకసీమలందు నాట్యాది కళలు స్థానికనగర ప్రభుత్వములచే పోషింపబడి నగరనివాసు లందరు ఉచితముగ జూచునవకాశము లేర్పడినట్లు షేక్సుపియరు నకు పూర్వము యూరపులోని నాటకప్రదర్శనము స్థానికపరి పాలనల యాధీనమున జేరెను. ఆశ్లీల, శృంగారమును క్రోధాదిరసములను యథారూపముగ ప్రకటించు అభినయ రీతులు నీ ప్రదర్శనముల నొక్కింత కష్టతరముగ నొనర్చెను మొదటినుండియు మిరకిలు మిస్టరీరూపకములలోని ప్రధాన పాత్రములు మతాచార్యు లభినయించుచుండ నందలి హాస్యప్ర సంగములు జనసామాన్యపు నటులచే నడుపబడెను. తరువాత ప్రాకృతనటులే నాటకమంతయు జరిపినపుడు వీరి యన్వయలో పము అభినయదారిద్ర్యము వికృతపదోచ్చరణము హాస్యాస్ప దముగ నుండెను. వీరు వూహూర తిరుగుచు వీధులలో నాట కము లాడుచుండిరి. తెరలు రంగములు లేవు. కాని వాని సూచన జేయుకొఱకు కొన్ని యసందర్భపు సందర్భముల గూర్చుచుండిరి. ఇంతవరకు నటులు స్వీయ వినోదార్థము ఐచ్ఛికముగ నటవిద్య నభ్యసించుచుండిరి. జర్మనీదేశమందు

హేనుశాక్కు అనునతడు తొల్లిటి నాటకమేళమును వృత్తిపద్ధతులమీద నెలకొల్పెను. ఫ్రాంసులోకూడ నటులనే ప్రహసనములు మూకాభినయమును ప్రదర్శించు వృత్తిసమాజములు యేర్పడెను. కాని వీని రంగపరికరములు నాట్యశిక్షయిటలీలో నుండినంత పాటవమును పొప్పకుండెను. యిటలీహాస్యరూపక పాత్రములు చాలవరకు యొకేవిధమగు నిర్ణీతస్వరూపములగుటచే నెవరికి వారు యిండ్లవద్ద నాయాపాత్రల గరచుచుండిరి. ఇందువలన ప్రదర్శన సమష్టిలో కొన్నియతుకులు సహకారదారిద్ర్యము యేర్పడినను నటులంతము తెలివితేటలను స్వతంత్రప్రయత్నములలో వికసింపజేసి కవికల్పితావస్థలకు మెరుగుదెచ్చెడి యవకాశములుకూడ గలుగుచుండెను. వీరు కంఠస్వరమును సకలరసభావ ప్రదర్శనానుకూలముగ నలవరచి గాన మభ్యసించి యభినయరీతులందు స్వతంత్రమార్గముల త్రొక్కుచుండురి. ఇట్టిప్రత్యేకశిక్ష నొందెడి యిటలీప్రహసకుల నటకీర్తి యూరపులో సర్వత్ర గౌరవమొంది మాల్యేరు మున్నగు మహాకవులుకూడ వీనిపద్ధతు లవలంభించు నంతటి గౌరవ మందికొనిరి.

ఇంగ్లాండులో యెలిజబత్తుపరిపాలనమందు షేక్సుపియరు మహాకవి రచించిన రూపకరాజములు భావాభినయనమున కెక్కుడవకాశము గలిగించెను. బర్బేజి అను నటుడు ఆ కాలములో మిగుల ప్రసిద్ధుడైయుండెను. కాని నాట్యరంగము వుపన్యాసవేదికవలె మూడువైపుల తెరచుకొని సభాంగణములోనికి జొచ్చుకొనియుండెను. ఇందుచే నటవైఖరులు యీనాటి నాటకములందువలె చిత్రవిచిత్రరూపముల నిలువక

మంటపములో నిలుపబడిన శిలాప్రతిమల సొబగు లనుకరించు చుండెను. అనగా యెదుటనుండి చిత్రపటమును చూచినట్లు కాక ప్రక్కలనుండియు చూడదగిన రమ్యాకారముల నటుడు దాల్చవలసియుండెను. మరియు నప్పటి సంభాషణోచ్చరణము మహోపన్యాసముల కుచితమగు గంభీరబోధకపద్ధతులలో నడుచుచుండెను. బాలురు స్త్రీవేషముల ధరియించు చుండిరి. కొన్నిసమాజములలో అన్నిపాత్రలు బాలురచే నభినయింపబడి మిక్కిలి ప్రజారంజకములై జరగుచుండెను. నైతికసంస్కర్తల పరిభావదినములలో బాలురే స్త్రీవేషమును నియతముగ దాల్చుచుండిరి. ఆవల రెండవచార్లిసు సింహాసనమెక్కిన తరువాత (Restoration) ఫ్రెంచి యాచారము ననుసరించి స్త్రీనిహాస్యనాయికగ మును మొదల లాంగ్లరంగమున ప్రవేశపెట్టిరి. మాల్యేరు స్వయముగవచ్చి తనరూపకము లభినయించు తరిఫీదు నొసంగెను. ఫ్రెంచిదేశములో మాల్యేరు మరణానంతరమునట ప్రసిద్ధిగాంచిన బారను అను నటశేఖరు డశేషప్రతిభావంతుడై యుండెను. ఇంగ్లాండులో బెట్టరటన్ను హేంలెట్టు పాత్రమును కడుజాగరూకతతో నభినయించెను. వీని యభినయములో వుదారధీరగుణములు, అధికారమర్యాదలు భయానకభీభత్సరసములు ప్రబలముగ ప్రకటింపబడు చుండెను. అనౌచిత్యముల జాలవరకు శిక్షించి నయముగ నభినయించెను, గాని యీతని వాచికము నన్యాసరీతులలో యీతని యొంటి విరుపులు, శిలాశిల్పరూపములలో నుండెను. అభినయమందు కావ్యార్థమును పాటించెను, గాని తన బుద్ధికౌశలమును, విభావస్వాతంత్ర్యమును యుప

యోగించి యుండలేదు. తరువాత 18 వ శతాబ్దాంతమున గారిక్కు నటశేఖరుడు షేక్సుపియరు నాటకములందు అనేక వేషముల దాల్చి అభినయరీతులందు వాచికోచ్చారణమందు స్వభావయాథార్థ్యమును చక్కని చిత్రపోకడలను, ప్రవేశ పెట్టెను. భూమికాధారణయందు చారిత్రపరిజ్ఞాన మెక్కువ యుపయోగించ లేదు. పాత్రస్వభావమునకు క్రొత్తరుచు లేర్పరచ లేదు. కాని కవినిర్దిష్టవిషయమును, కావ్యమందలి యర్థభారమును నిరుపమభావాభినయశక్తితో ప్రదర్శించెను. ఇతడభినయించిన తెరవు లిప్పటికిని లోకమాన్యములై, నాట్య విద్యార్థులచే నభినయవేదములుగ గరవబడుచున్నవి. ఇతడు రంగస్థలమును వెనుకకు జరపి అభినయావస్థలు చిత్రపటము లోని బొమ్మలవలె నిలుపబడుచున్నట్లు అగుపడెడి నవీనరంగ విరచన మేర్పరచెను. వీనితో సమకాలికుడగు జర్మను నటుడు ష్రోడరు చిరస్మరణీయుడై యున్నాడు.

గారిక్కు చనిపోయిన తరువాత యూరపులో నభినయ రీతులగురించి పెక్కువిమర్శకసమస్య లేర్పడెను. పాత్రస్వభావమును లోకానుభవ మనుసరించియు మానసశాస్త్ర సూచనల వెలుగునను, లోతుగ పరిశీలించి కవిసూచితమగు సత్వమునకు విభావానుభవవైశాల్య మేర్పరచి యభినయింపవచ్చునా? నాటకమందు కవిసూచితమైన పాత్రస్వభావమును పురాణేతిహాసశాస్త్రపరిశోధనవలన నిశ్చయపరచుకొన వచ్చునా? నాటక ప్రదర్శన మందలి యభినయావస్థలను చిత్రలక్షణ మొప్పునట్లు జేయుటకు యెట్టిదుస్తులను, తెరలను, ఆంగికవిన్యాసమును, చూపవలయును? నాట్యకళలో విచిత్రలక్షణములు

146 నాట్యోత్పలము

దివ్యసూచనలు, యెటుల గల్పింపవలెను? అభినయము మామూలు జీవితమందగుపడు నడతలకు యథారూప అనుకరణముగ నుండవలెనా? లేక రసభావముల ప్రకటించుననిలాక్షణికులంగీకరించిన నిర్ణీతముద్రలుగ నుండ వలయునా? మున్నగు నాటకసమస్యలు విమర్శకులచేతనూ, నటులచేతనూ లక్ష్యలక్షణ సమన్వితముగ పరిశీలింపబడుచుండెను. నటుల సామర్థ్య ప్రభావములబట్టి యొక్కొక కాలములో నొక్కొక నటరీతి జనామోదకరమై ప్రమాణముగ నంగీకరింపబడుచుండెను.

క్లైరను, సిడ్డన్సు వాచికాంగికములందు విచిత్రగంభీర రీతుల విస్తరించిరి. ఇట్టి నటనపై రుచి పెలుబ్బిన వెనుక, టాలమా, లెమేతేరు, రాకీలు మున్నగు నటులు ఫ్రెంచిదేశమందును, కీను, మాక్రిడీ మున్నగువారు యింగ్లాండునందును యథారూప స్వభావాభినయము మేలని నిర్ణయించుచుండిరి. ఫెల్ప్సు ప్రాచీననట మర్యాదల నిలుపుచుండ, ఇర్వింగు, ట్రీ మొదలుగాగల నవీననటశేఖరులు అభినయరీతులందలి చిత్రోచిత స్వరూపములను బరిశీలించుచు, మానసశాస్త్రసహాయమున పాత్రస్వభావమునకు, నవ్యవిలాసములను లోతు తలపులను గలిగించుచు శాస్త్రకళా ప్రపంచమును, నాట్యరంగాభివృద్ధికి నుపయోగించుచున్నారు. చిత్ర, శిల్ప, కావ్య, సంగీతాదులందు యెటులనో, అభినయమందుకూడ అటులనే ఒక్కొక్క కాలమందు అప్పటి మహానటు డేర్పరచిన, నాట్యాదర్శముల ననుసరించి రుచు లేర్పడును. ఈరుచులు మరియొక మహానటుడు వచ్చి యభినయాచారమును మార్చువరకు, నాట్యా

దర్శములుగ నుండును. నటవృత్తిలోనుండెడి జనబాహుళ్యము స్వతంత్రింపనేరక మెప్పువడసిన ప్రసిద్ధనటుల అభినయరీతులను అనుకరింప జూచుచుండును. నాట్యాభినయ మభివృద్ధి నొందుటకు అభినయ రీతులను సమ కాలికాచారములకు, నిత్యజీవనపు భాషోచ్ఛరణము, నడతలు, పోకలు, మర్యాదలు మున్నగు వాని కనుకూలముగను వున్నట్లు మార్చవలసి యుండును. కళావిన్యాసమునకు భావస్వాతంత్ర్యమే సాధనము. కాని నాటకాభినయము ద్రవ్యసంపాదనకు సంబంధించియుండుటచే నవ్యమార్గముల ద్రొక్కుటెంతయు కష్టతరముగ నున్నది.

ఆదర్శప్రాయమగు నాటకాభినయ మభిలషించు పాత్రధారులు ఈక్రింది లక్షణము లొప్పునుండవలెను. సర్వాంగసౌకుమార్య మొప్పెడి యందగాడై యుండవలెను. కమనీయమగు రూపము మర్యాదలు కలిగి కత్తిసాము మున్నగు వ్యాయామశిక్షలచే శరీరాంగములన్నియు, చక్కని దృఢరూపమున వికసింపజేసి నానావిధములగు అంగభంగములకును, మూర్తిస్వరూపధారణమునకును స్వాధీనమగునట్లు సాధన జేయవలెను. ముఖమందలి కండలను శిక్షించి లలితసుకుమారసుందర సద్భావములను, వీరగాంభీర్య భయానకాదితీవ్రభావములను యిచ్చచొప్పున ప్రకటింపగల నేర్పులో నుంచవలెను. నానావేషముల ధరియించు నేర్పేర్పడవలెను. ఆపాత్రమును యేప్రసిద్ధనటు డెటుల సంభావించి యభినయించెనో తెలిసి యుండవలెను. పాత్రస్వభావమును తెలుపు పురాణేతిహాసములు, అప్పటిమర్యాదలను సూచించు చిత్రశిల్పాదులను

చూచియుండవలెను. హస్తవిన్యాసము, నేత్రవిక్షేపణము, సర్వాంగముల కథాసందర్భమున కనుకూలమగు భంగ్యక్రమములో నిలిపి యుంచగల నేర్పు సంపాదింపవలెను. ఏరసమున కెట్టి భంగముచితమో, యేరసమును ప్రకటించిన నెట్లు మూర్తి రామణీయక మేర్పడునో, తెలిసికొని యభ్యసింపవలెను. జ్ఞాపకశక్తి, కంఠస్వరము చక్కగ సాధింపవలెను. రంగపటమున నలువురతో గూడి యభినయించునపుడు చిత్రలేఖకుడు రమ్య రేఖావిన్యాసముల జింతించి యమర్చిన విగ్రహము లెంత యందముగ నిలచియుండునో పటములోని విగ్రహములన్నియు, ప్రధానకథాభిముఖులై యమర్పబడియుండునో యట్టియున్నోన్నత రూప సమ్మేళనమై చిత్ర్య మొప్పారు భంగుల నిలువనేరవలయును. అనగా నటు లెవరికివారు స్వేచ్ఛావిలాసమున నభినయించుచు నొండొరుల ద్రొక్కుచు, మరగుపరచుచు, ప్రకృత రంగచిత్రమును గల్పింపక, భంగసామంజస్య మేర్పరచు సహకారములో చిత్రకాంతుల గల్పించు నడవడి నిలుకడలతో మెలగవలయును. సమాసములను విడిమాటలను భావద్యోతకంబుగ నుచ్చరింప నేరవలయును. ఇందున పాత్రస్వభావమును, అవస్థను బరికించి, ఇప్పటి సంభాషణాచారములకు మిక్కిలి దూరముగాని రీతిలో నుచ్చరింపవలయును. స్వగత పరగతాభిప్రాయముల దిలకించుచు, తానాసమయమున నభినయింపవలసినను లేకున్నను జరుగుచున్న కథాసందర్భమున జాగరూకుడై నటించవలెను. పలుకుచుండినను, మిన్నకున్నను, పాత్రవ్యక్తిత్వమును అనుభవించు సూచన లందించుచుండవలెను. రూపకమందు కవి నిర్దేశించిన భావానుభవముల నెల్ల

కథాక్రమమున తనయందావేశపరచుకొని ప్రకటింపగలుగ వలెను. తరువాత నాటకకవి యొసంగిన కథాకల్పనము సంభాషణలు, కొన్ని యవస్థాసందర్భముల సూచించు సంగ్రహావాక్య సూచనలుగాని, యీ అవస్థల సంపూర్ణభావానుభావవికాస మంతయు నటుని మతిప్రభావముననే విస్తరింపవలసియున్నది. ఇందుకు వలయు భావనస్వాతంత్ర్యము నౌచితీవిభ్రంశమేర్పడ కుండ నుపయోగించు శక్తి నటున కేర్పడవలయును. నాటక కవులు సూచించు కథావస్థల, రసభావవ్యాఖ్యానవిస్తీర్ణ మంతయు నటుని యభినయకౌశలముపై నాధారపడియున్నది.

మంచినటుడగువాడు సుందరలలిత రూపములను కణ్ఠస్వర గాంభీర్యపాటవంబును, సమానసైపుణితో జూపగల మొత్తని స్వాధీన ముఖాంగములు కలిగియుండవలెనా? నానాస్వభావము లొప్పు వివిధపాత్రముల నొప్పింపగల సామర్థ్యము ప్రసిద్ధి నటుల కవసరమా? లేక తానొప్పింపగల పాత్రమునే స్వీకరింపవలెనా? లేక తాగ్రైకొనిన పాత్రస్వభావమును తనయభినయరీతుల కలవియగునట్లు మార్పవచ్చునా? ఈసమస్యలు పలుమారు చర్చింపబడినవి. అన్ని వేషములను దాల్చి మెప్పింపగల నటులు సర్వసమర్థులుగ జనసామాన్యమున నెంచబడుదురు. కాని తమ వ్యక్తిలక్షణములను శక్తిపరిమితులను వీనివలనగలుగు లోపములను అభిమానాదులను సంపూర్ణముగ నశింపజేసుకొని పాత్రస్వభావమును, నిండుబింకమున తమయందారోపించుకొని పాత్రముతో సంపూర్ణసారూప్య మొంది చేష్టావాచిక సాదృశ్యమున నభినయించగల నటోత్తములు గానరారు. అథవా అట్టి వ్యక్తాహంకార శూన్య

మగు పురుషుడు లభించినను వానియందు ప్రతిభాస్వాతంత్ర్య ముండదు. కాని కవిహృదయమును నిరసించి తనకు తోచిన రీతి పాత్రస్వభావ మన్వయించుకొని తన యభిమానములు సిద్ధాంతములు స్వకీయచేష్టావాచికరీతులు పాత్రాభినయమందు ప్రకటించెడి నటుడు, అయ్యవారిని చేయబోయి కోతిని గల్పించిన శిల్పివలె, నాట్యభ్రష్టుడై సిగ్గొందవలసివచ్చును.

కాని యీకాలములో కొన్నివిధములగు రసభావము లను ప్రత్యేకపరిభావముతో నభినయింపగల మహానటులను సభాపరాభవ మేర్పడకుండ నాట్యరంగమున నుపయోగించు కొరకు వారి కలవియగురీతినే పాత్రస్వభావపోషణము గల్పించి నాటకముల రచియించుచున్నారు. యూరపులోని మహా నటులలో పాత్రిస్వభావముతో సంపూర్ణసారూప్య మొందెడి వారు కొందరున్నారు. మరికొందరు తమ యభినయకౌశ లమున కనుకూలముగ పాత్రస్వభావమును మార్చువారును కలరు. షేక్సుపియరు విరచితమగు వణిక్పురవర్తకోదంత ములో షైలాకుపాత్రను అభినయించుచు, యిర్వింగు మహా నటుడే క్రూరలోభిని భావసౌందర్యమొప్పెడి గభీరదయాస్వాం తునిగ జిత్రించెను. యెల్లెను టెర్రీ మాక్ బెత్తుసతీమణిని పచ్చి నెత్తురు ద్రావగోరెడి క్రూరపిశాచముగ గాక నారీజన నైజ మగు లలితమాధుర్య మర్యాదాలంకృతగా నభినయించెను. ఇట్టిమార్పుల గావించుటలో బర్నేజి, గారిక్కు, సరాజర్న హార్టు మిగుల స్వాతంత్ర్యమూని యున్నారు. నటులు తామభినయించు పాత్రల అవస్థాసంజనిత రసోద్వేగ మనుభ వింపవలయునా? లేక అట్లు అనుభవించిన నటనమాత్రమే

జూపవలయునా? అభినయావాలోకనమున పరివత్తు వివిధ రసానుభూతి జెందవలయునా? లేక ప్రకృతిలో ఆరసమొం దెడి ప్రకటనవైఖరులు నేర్పుమై నటుడనుకరించినాడను సంతసానందమొక్కటియే జెందవలయునా? ఆంగ్లస్త్రీవేషధారులు (నటీవర్గము) శోకరసాభినయమందు నిక్కముగనేడ్చిరి. కాకెలీను రసానుభవము నటసిద్ధికి మూలమని తలచుచుండెను. ఈతని యభిప్రాయములో జీవితావస్థల యథారూపస్వభావ నివేదనము యేకళయందును యుపయోగించదనియు, జీవితావస్థలను, రసభావములను, స్వభావవిరుద్ధమగు నతిశయోక్తితో విస్తరించి వెల్లడించినగాని కళాలక్షణమగు రామణీయక మేర్పడదనియు, విశదమగుచున్నది. నాటకములోని ఆంగిక వాచకాభినయములు నిత్యజీవనపు పలుకుచేతలను మించెడి విస్పష్టతతో రసభావప్రకోప స్వరూపమున నుండినగాని, ప్రేక్షకులందు సంతుష్టి నేర్పరచజాలవు. అభినయములో శోకరసముకన్న లేనగవ్రతళుకుసొగసుల జిలికించు సందర్భము లెక్కువ కష్టలభ్యములు. అభినయము రూపకకవియొక్క భావమంతయును చూపలేకుండుటయు, పెంచి మరింత యందముగ జూపుటయు కూడ గలుగుచుండును. నటుడు స్వకీయముగ జీవితావస్థల రససందర్భముల నూహించి యభినయింప గలడేని యాతని శేముషీసంచారములు లోతుతలపుల ముత్తెంపుగనుల వెదుకనేర్చెనేని యాతని యభినయము, సమయానుకూలత నెరింగి నవోన్మీలనవికాసదీప్తుల వెలుగొందగలదేని కవికెట్టి విశ్వరహస్యపరిజ్ఞానముండునో యట్టిలోచూపు తెలివిచురుకులు నటులకబ్బెనేని కవికథాకల్పన మందెట్టి స్వాతంత్ర్య

మూని ప్రకృతియవస్థల మార్చి రంగిచ్చి రూపకములందు చిత్రించునో అటులనే నటుడు కవికృతరూపకమును తనయిచ్ఛ చొప్పున మార్చి వెలిగించి నటింపవచ్చును.

కొందరి మతములో సూత్రధారునకే యిట్టి యధికార మొప్పిదమగుననియు నటుడు నిస్స్వాతంత్రుడై కీలుబొమ్మల వలె నాతని యాజ్ఞ నంగీకరించి నిర్ణీత వాచికాంగికరీతులలో కథాంశమును నడుపవలెననియు, కవిగాని సూత్రధారుడుగాని నియమించిన దారి నతిక్రమించి చరించెడి స్వాతంత్ర్యము నటునకొల్లదనియు, కొందరభిప్రాయ పడుచున్నారు. ఈసమస్య లు యెన్నటికి తీరనివై యుండును. నాట్యకళ ప్రజాహిత ముగ నుండుటకు కవి ప్రయత్నమొకింతయు, నటయత్నమొ కింతయు జతపడవలయును. నాటక వృత్తాంతమగు కథాంశ మును గూర్చి యుభయుల అభిప్రాయములు ఒకటైనచో కవి వాక్యముల నభినయించుటయే నటునకు కర్తవ్యము. కాని, నటుని రసానుభవము మిన్నయగునేని స్వతంత్రించి యభిన యించవచ్చును. అందుచేత నటుని యభినయ స్వాతంత్ర్య మాతని ప్రతిభావిశేషమున నాధారపడి యుండును.





# ఆటరిక్కలు.

## మహానటులు

ప్రాచీన యవనరోమక రాజ్యములందు రూపకకర్తలు తమ తమ నాటకములలో అభినయించుచుండిరి. నాటకప్రదర్శనము ప్రభుత్వాధీనమునందుండి నటుల తరిఫీదు చేయుటకును, నటపద్ధతుల నిర్ణయించుటకును, తగిన కట్టుదిట్టము లుండెను. నాటకములలోని మేళపుహాంగులో స్త్రీలుండి సంగీతము పాడుచుండిరి. కాని నాటకమందలి స్త్రీ పురుష పాత్రములు మొగనటులే స్వీకరించుచుండిరి. యవనదేశములో నాట్యవృత్తి యెక్కువ ప్రజాగౌరవమొంది యుండెను.

ఎలిజబెత్తు కాలములో లైసెన్సు పొందని నటులు, దొంగలు, బిచ్చగాండ్రు మొదలగు తిరుగుబోతుజాతులలో చేర్పబడిరి. ఆ కాలములో నటప్రముఖులందరు యేదోయొక సమాజములో జేరియుండవలయును. స్త్రీలు స్త్రీవేషముల ధరియించు కాలమరుదెంచిన తరువాతనే నాటకములు రమ్యముగ నుండ మొదలిడినవి.

కడచిన రెండు వందల సంవత్సరములలో పాశ్చాత్య దేశములందు ప్రసిద్ధిగాంచిన కొందరి మహానటుల జీవితములను యీదిగువ నుదహరించుచున్నాము.

నటోత్తములై, నాట్య వ్యవహారములందు చిరకాల మారితేరిన, సోఫాక్లీజు, జాన్సను, షేక్సుపియరు, మాల్యేరు, వాగ్నరు మున్నగు వారు రచించిన రూపకములే మిక్కిలి ప్రదర్శనార్హములై యున్నవి. నటులుకాని కొందరుకూడ నిట్టి మహానాటకముల రచించిరి. కాని రంగశిక్షనొందినవారి రూపకకవిత్వము, సామాన్య పాండిత్యము గలిగి, కనువిచ్చి లోకమును జూచుచు, పరువు, పాయా భాగ్యము, పాండితీ గరిమచే నేర్పడు గర్వాహంకారములు లేని నిసర్గసూరులరూపక కల్పనమే మేలని తెలుపవచ్చును. పాండిత్య విశేషమున లక్షణమర్యాద లవలంబించిన కవులు, నటులు, రెండవతరగతి కళాసిద్ధిచెందియున్నారు.

## బర్బేజి

1597లో మరణించెను. ఆంగ్లనటుడు. షేక్సుపియరు మహాకవికి ప్రాపక మొసంగిన లీస్టరు ప్రభువు గారి నటమండలిలో నొకడుగనుండి 1577 లో స్వతంత్రముగ నింగ్లాండులోని మొదటి నాట్యమందిరమును నిర్మించెను. దానిని "ది థియేటర్" అని పిలుచుచుండిరి. తరువాత "గ్లోబు థియేటరు"ను మార్చి తిరిగికట్టెను.

## బెట్టరుటను (1635—1719)

ఈతను 28సంవత్సరముల యీడునుండి ఆంగ్లకవివర్యుల యభినుతులు పొందుచు నశేషప్రతిభాశాలుడగు నటుడుగ

హేమార్కెటు నాటకశాలలో చివరవరకు అభినయించుచుండెను. బోమెంటు ప్లెచ్చరులు రచించిన (Maid's Tragedy) లో మిలాంటియసు అను పాత్రమునుకూడ నటించెను. ఈతని భార్య మిసెస్సుసాండర్సన్ అనునాపె షేక్సుపియరు నాయికల బ్రదర్శించుటలో మిక్కిలి పేరొందియుండెను.

## డేవిడ్ గారిక్కు 1717—79

ఆంగ్లమహానటుడు. పల్లెటిగదువు కొద్దిగా నేర్చి లండను జేరి జానుసనుగారి విద్వన్మండలిలో ప్రవేశించి 1740 లో లీతీయను నాటకమును బ్రదర్శించి అందు హారెలికిను హాస్యపాత్రమును ప్రసిద్ధనైపుణ్యముతో నభినయించి యావల మూడవ రిచ్చర్డు పాత్రమును సకల ప్రేక్షకజనాభినుతంబగు నద్భుతవైఖరి నభినయించి మెప్పొందెను. ఆవల డూరీలేను సమాజములోను కొంతకాల మెల్లెందునందును, షేక్సుపియరు నాటకముల ప్రధానపాత్రలను అభినయించుచుండెను. గారిక్కు వచ్చువరకు సుమారు నూటఏబది సంవత్సరములు ఇంగ్లాండులో షేక్సుపియరును తలంచినవారులేరు. ఈతని అభినయ వ్యాఖ్యానముల మహిమచే జగదైక రూపకకవియగు షేక్సుపియరుపేరు మరల వాసికెక్కినది. హామ్లెట్టు, మాక్బెత్తు, కిచ్చర్డు పాత్రములను నిరుపమ స్వాతంత్ర్య కళావైభవముతో రంగస్థలంబున గన్నుర నవతరించినట్లు జూపుచుండెను. ఈతనిని వెస్టుమినిస్టరు ఆలయములో షేక్సుపియరు శిలామూర్తి పాదతలమున సమాధిచేసిరి. ఈతని మరణసమయమున జాన్సనుభట్టాచార్యు డిట్లు పలికెను. "మానవప్రపంచపు సరసనిర్మల నాట్యజీవన మీతని మరణముతో నష్ట

మించినది. నాట్యకళ చీకటులు గ్రమ్మి నీచదశలో జిక్కి యున్నది."

## —♦ ఫాసిటు 1820 - 98 ♦—

ఆంగ్ల నటీతిలకము. నోలెన్ కవి రచించిన గూనివాడను నాటకములో జూలియాపాత్ర అభినయించి మెప్పువడసెను. ఆవల మాక్రెడీ నటునితో చేరి ఆతనభినయించిన షేక్సుపియరు నాటకము లన్నిటిలోను తక్కుడు నాటకములోను నాయికవేషమవలంబించి యా మహానటుని నాయకపాత్ర నిర్వహణ మెంతయు వన్నెవెట్టెడి రీతి నాడుచుండెను.

## ♦ సర్ హెన్రీఇర్వింగు 1838 – 1905 ♦

ఆంగ్ల మహానటుడు. పదునొకండేండ్ల ప్రాయము నుండి చావువరకు అభినయించుచుండెను. రెండు సంవత్సరములు ఎడింబరోలో నిండమ్వద్ద కొన్ని పాత్రలనాడి యావల 1860 లో బోసీకోల్టు రచించిన "Hunted down" అను నాటకములోని దొంగ వేషమును ధరించి లండను ప్రజల సంతోషపెట్టెను. ఆవల ఏల్లెనుటెర్రీతో కూడి లండనునందు అనేకనాటకములలో నాయకపాత్రను ధరించెను. షేక్సుపియరు మహానాటకముల మిక్కిలి నేర్పుతో నాడుచుండెను. తరువాత 23 ఏండ్లు లిసియము నాట్యశాలలో కావ్యప్రధానముగు భావరూపకముల నాడుచు గీటీ రచించిన ఫాస్టు ప్రదర్శనమునందు విశేషధన మార్జించెను. తన నాటకమండలితో నింగ్లాండునందు సంచరించుచు నాంగ్లప్రేక్షకులకు నపూర్వమగు నభినయాదర్శముల నెలకొల్పుచుండెను. ఈతని సమకాలికులలో నిన్నిరకముల వేషములు ధరించగల ఆంగ్లనటులును లేరు.

కాని ఈతనిరూప మనుకూలముగ నున్నను స్వభావము విషాద పాత్రధారణమునకు అను వైనది కాదు. విగ్రహము చిన్నదిగను గొంతుక సన్నముగను నుండి, భావప్రకోప మగుపరచెడి రసావేశము పొందకుండెను. అందుచేత రోమియో, ఆథెలో, లియరు మున్నగు కేవల విషాద పాత్రముల నభినయించుటలో, నీత డపజయము పొందుచుండెను. చింతాక్రాంత విషాద స్వరూపములజూపునపుడు హేమ్లెట్టు, మాక్ బెత్తు, కొరియలేనను, రిచ్చర్డు పాత్రములలో వీని యభినయము బాగుండెను. కాని కంఠస్వర మనుకూలించలేమి కొంత హాస్యసాంకర్య ముండిన హాస్యవిషాద పాత్రమందు షైలాక్ మున్నగువానిలో నీత డద్వితీయుడు. క్రౌర్యము, అసూయ, భయము, భీభత్సము, టక్కరి, దొంగగుణము ప్రదర్శించుపట్ల ఈతని సామ్యం. పీటరు ది గ్రేటు డూ గాస్ కు మొదలగు వానియందు కరుణార ... భావసూచకమగు మౌనముద్రలు గభీరమహోదార స్వభావము చూపవలసినప్పుడు ఈతనిమించిన నటుడు ప్రపంచమున లేడని చెప్పవచ్చును. ఈతని పెద్దకుమారుడు

## హెచ్. బి. ఇర్వింగ్ (1870-1919)

పేర్వడిన నటకౌశలమెువ్వాచు అనేక నవ్య నాటకములలో ప్రధానపాత్రముల నభినయించెను. రెండవకుమారుడగు L.S B. Irving(1871-1914)యిబ్సెనురచించిన నాటకములందును దోస్టొవ్స్కీకవి రచించిన Crime and Punishment అను దానియందును గౌరవమెుప్ప ఆడుచుండెను.

### సర్రాబెర్న్ హార్ట్ (1845-1923)

ఫ్రెంచినటీతిలకము. పారిసునగరమున జన్మించి 1860 లో కాన్సర్వేటరీలో నాట్యకళగఱచి, 1862 లో కామెడీఫ్రాంకేసునందు రాసీనుమహాకవి రచించిన ఇఫిజీను నాటకములో పెద్దపేరొందెను. ఆవల అనేకనాటకసమాజములను, నాట్యమందిరములను స్వాధీనపరచుకొనెను. మనోవృత్తి వైకల్యములు ముఖ్యాంశముగ గల లోకఖ్యాతపాత్రిలనేకముల సరసముగ నభినయించెను. ఈమె స్త్రీపురుషపాత్రముల రెంటిని స్వభావచాతుర్య ముట్టిపడినట్లు నిర్వహించి పాశ్చాత్యనాగరిక ప్రపంచమున విశేషగౌరవ మొందెను. ఆమెగాత్రము, రూపము, నాట్యప్రతిభా భువనమోహనమై కులుకారుచుండెను. రాకేలుతరువాత నింతటి యభినేత లేరనియు నాట్యావతారమనియు నెంచబడెను. ఈమె నాట్యరంగమున విఖ్యాతి గనుటయేగాక చిత్రశిల్పములందును నాటకకథా రచనమందును పద్యకావ్యములందును మెచ్చదగిన కళాకల్పన మొనర్చుచుండెను. రసాభినయ మొనర్పదలచెడి నటుడు పాత్రస్వభావముతో సంపూర్ణసారూప్య మొంది పాత్రావస్థల మనఃపూర్వకముగ తనయందారోపించుకొని సహృదయముగ నభినయించవలెనని ఈమెసిద్ధాంతము.

### సర్ ఫ్రోబిసిసిన్ రాబర్టుబెన్సన్ 1858

ఆంగ్ల మహానటుడు. ఆక్సుఫర్డులో పెద్దచదువులగరచి లిసియమ్ థూరీలేను మున్నగు నాట్యశాలలో షేక్సుపియురు నాటకములను అభినయించుచుండెను. మాన్స్పీల్డురచించిన సాంపే నాటకమును ఆడెను. షేక్సుపియురు కృతసీజరు పాత్ర

ప్రదర్శనమునకు మెచ్చి జార్జిచక్రవర్తి 1916 లో నీమహానటు నకు వీరబిరుదమొసంగి గౌరవించెను. ఈతడు షేక్సుపియరు జన్మస్థానమందు ప్రతిసంవత్సరము కవిపూజా మహోత్సవము యిరువదైదేండ్లనుండి జరిపించుచున్నాడు. 1901 లో ఇంగ్లాండునందు ఒక నాట్యకళాశాలను ఏర్పరచియున్నాడు.

### సరాసిడ్డన్సు 1755-1832

ఆంగ్లనటి. పోర్షియా మున్నగు షేక్సుపియరు నటీవేషములను విషాద స్త్రీపాత్రములను ధరించుచు డూరీలేను మున్నగు నాట్యశాలలలో తనసోదరుడగు కెంబెలుతో గూడి యభినయించుచుండెను. 18 వ శతాబ్దాంతమున నింగ్లాండులో నీవనితాశిరోమణి చక్కదనమునకును తెలివిచురుకులకును మిక్కిలి మెచ్చుబడి రెయినాల్డ్సు గెయిన్సుబరో మున్నగు చిత్రసార్వభౌముల చిత్రాంజలు లందికొనినది.

### టాల్మా (176?-1826)

ఫ్రెంచినటుడు. కామెడీఫ్రాంసు కేసు నాట్యశాలలో షేక్సుపియరురచించిన నాటకములందు ప్రధానభూమికల దాల్చుచు నావల రిపబ్లికుథియేటరులో విషాదపాత్రముల బ్రదర్శించుచు ఆకాలములో పాశ్చాత్యనాట్య ప్రపంచమున మేటినటుడను కీర్తినొంది నెపోలియను చక్రవర్తి యభిమానమునకు గురియై వెలుగుచుండెను.

### ఎడ్మండుకీను (1787-1833)

ఆంగ్లనటుడు నటసంప్రదాయమున జనించినవాడు బాల్యములో దారిద్ర్యదోషముచే పెక్కువంతలజిక్కి నాటకవాచకముల వచించుచు మొగ్గలిడును జీవించుచుండెను.

ఇట్టిస్థితిలో ఆంగ్లసామ్రాజ్యవిధాతయగు మూడవజార్జి కట్టెమటు తన నిసర్గనటచాతుర్యమును ప్రకటించి యావల డ్రూరీలేను కంపెనీలో నటుడుగ ప్రవేశించెను. ఈతని మొదటివిజయము షైలాకుపాత్రాభినయమం దేర్పడెను. తొలుదొల్త ప్రజలీతని నాట్యస్వాతంత్ర్యమును అభినందింపకుండినను క్రమముగ విషాదపాత్ర నిర్వహణమందు మహాస్వతంత్రునిగ నంగీకరించిరి. మెస్సింజరు రచించిన నాటకములందు సరుజైల్సు ఓవరిచ్చు పాత్రాభినయమునను ఆటలలోను ఈతనికీర్తి వెల్లువిరిసినది. ఈతని జీవితకాలములో యింత పెద్దనటుడు లేడని కీర్తి గడించి నాలుగు రెండు లక్షల రూప్యముల వేతన మనుభవించుచుండెను. పొట్టివాడైనను చక్కనికళలకట్టు మొసపుపు లీనెడి కనుదోయి సొంపుగలిగెని కంఠమాధురీ జనాకర్షణ ప్రభావముకలిగి తొలుకరిమెరుపువలె భావప్రాచుర్యవైదుష్యముతో షేక్సుపియరు రూపకములకు నవ్యరస వ్యాఖ్యానముల గల్పించుచు బైరను హాజులెటు మున్నగు విమర్శకుల మెప్పులందికొని 1833 లో ఓతెల్లో పాత్రనభినయించుచు "ఓతెలో! మీపరిభావ మింతటితో తీరిపోయినది." అను వాక్యము లుచ్చరించుచు జారిపడి చనిపోయెను.

## మాక్రెడీ (1793–1873)

ఆంగ్లనటుడు ఐరులెండులో పుట్టి ఇంగ్లాండులో చదువుకొని 1810 లో రోమియో పాత్రమందు విఖ్యాతి వడసెను. సిడ్డెన్సు నటితోచేరి లండను డ్రూరిలేను కావెంటు గార్డెను మున్నగు నాట్యశాలలలో షేక్సుపియరు నాటకములకు మెరిసెను ఆటలను అభినయించుచుండెను. తరువాత హెలెను ఫాసిట్టు

తోచేరి హేమార్కెట్టు నాట్యశాలలో లిట్టను రచించిన రిషే లో నాటకమందును మరికొన్నిటి యందును ప్రధానపాత్ర మాడుచుండెను. షేక్సుపియరు నాటకములు 17వ శతాబ్దాంతమున గ్రమ్మరత లయెత్తి ఆనాటికవులవక్షి ప్తములచే మిక్కిలి కళాహీనముగ నసభ్యముగ జేయబడెను. మాక్రెడీ మిక్కిలి శ్రమగొని వానినెల్ల సవరించి షేక్సుపియరు నాటకములను నైజపరిభావమున సంస్కరించి ప్రదర్శనోచితమగు పాఠముల నేర్పరచెను. ఈతని గొంతు నడత మిక్కిలి యందముగ నాత్మగౌరవ మేర్పరచు ధీరభావములతో నిండియుండెను. నటవృత్తిని గౌరవాస్పదమగు నున్నతమర్యాదకు బాత్రమొన ర్చవలెనని పాటుబడుచుండెను. యవనరోమక నాటకములను నాట్యకళను గూర్చిన యితరభాషలందలి పుస్తకములను శ్రద్ధతో జదువుచు పేర్వాసినపుత్రుడై, భక్తుడై, తండ్రియై, సుగుణాలవాలమై, దయాసత్య సౌశీల్యములకును నాట్యకళా సర్వాధికారమునకును ప్రసిద్ధుడై టెనిసన్ మహాకవి పద్య పూజల నందికొనెను.

ఎడ్మండుకీను రెండవ కుమారుడగు చార్లెసుకీను (1811-68) ఎల్లెను కీను అను అతనిభార్య షేక్సుపియరు నట నటీ నిర్వాహణమందు మిక్కిలి వన్నెకెక్కి యున్నారు.

**ఫెల్ప్సు (1804-78)**

ఆంగ్లనటుడు. ఈతను హేమార్కెట్లో 1837 లో మొట్టమొదట షైలాకు వేషము ధరియించి పేరెక్కె ఆవల మాక్రిడీతో మాక్బేతునందు అభినయించుచు 1844లో సాడ్లెరు నాట్యశాలను నెలకొల్పి 18 సంవత్సరములలో షేక్సుపియరు

విరచితములగు ముప్పదియొక్క నాటకములను నైపుణ్య మేపార నభినయించినాట్యరంగమునకు ఆంగ్లజాతీయజీవనములో విపులప్రభావగౌరవము లేర్పరచెను. విషాదహాస్యవేషము లను సమాన చాకచక్యముతో నభినయింపగలిగెను. మాక్లీను రచించిన Man of the World అను నాటకమందు పరమ లౌక్యుని భూమికదాల్చి చూపిన నటసామర్థ్యము ఈతనియభి నయ పరిణామమును చూపుచున్నది.

### సర్ హెర్బర్టుట్రీ (185?-1917)

ఆంగ్లనటుడు. ఇంగ్లాండు, జర్మనీలలో విద్యాభ్యాసమొ నర్చి యావల షెరిడను షేక్సుపియరు నాటకాభినయమందు పేరువడసి తొల్లి హాస్యపాత్రధారిగ ప్రసిద్ధిజెందెను. తరువాత అనేకనాటకములలో విషాదవీరభూమికల నందికొని మెప్పిం చుచుండెను. ఫాల్సుస్టాపు మున్నగు హాస్యవేషములే యీతని కళానైపుణ్యమును చాటుచున్నవి. నాట్యరంగమును వస్తు లను మిక్కిలి ధనవ్యయముతో డవులుమీరగ నలంకరించు చుండెను. ఇట్టి వివరీతరంగాలంకారము జనసామాన్యమునకు రుచికరముగ దోచినను, కావ్యమందలి భావమును మరుగు పరచుచు, నటసామర్థ్యమును లెస్సగ పరిశీలించుటకు ప్రతి కూలమగు అన్యాకర్షముల నేర్పరచుచున్నదని కొందరభి ప్రాయపడుచున్నారు.

### రాషేలు (1821-1858)

ఫ్రెంచినటి. బాల్యమందుమిక్కిలి చాతుర్యముగుపరచి నాట్యశిక్షను పొందుచు, పదకొండుయేండ్ల ప్రాయములో ఫ్రెంచికాన్సర్వేటరీలో సభ్యురాలై 1838 లో కార్నెల్లీ రచిం

చిన హొరేసు నందును, రాణీనునాటకముల్లందును నాయిక
వేషములనాడి పేరొందెను. ఆవల విషాదనాయికగ యూర
పులోని రాజధానులన్నిటియందు పేరొప్ప వెలఁగుచుండెను.

### సర్ జాను ఫోర్బ్సు రాబర్టుసను, 1853.

స్కాటులెండుదేశములో జనించి తండ్రివద్దను ఫ్రెంచి
దేశమునను, ఫెల్ప్సువద్దను, కళారహస్యముల గఱచి
1874లో లండను నగరమందు Mary Queen of Scots అను
నాటకములో ప్రథమవిజయమొందెను. తరువాత, బాం
క్రాఫ్టు బారెట్టు, యిర్వింగు, హేరుమున్నగు నటులతో
గూడియు, తన తమ్మునితోడను గూడి అనేక కామెడీలందు
ట్రాజిడీలందు పెద్దవేషముల ధరించుచుండెను. ఈతనివాచి
కము మిక్కిలియందముగ నుండెను. ఈతని హామలెట్టు వేష
ముకళాపరిణామమును చూపుచుండెను. ఈతని భార్య గెరు
ట్రూడు సుప్రసిద్ధనాటకము లన్నిటియందు నాయికావేషము
వేయుచుండెను. ఆపెసామర్థ్యముకూడ నీతనితో తుల్య
మైనదే.

### యెల్లెనుటెర్రీ (1848)

నటదంపతుల కూతురు. ఆంగ్లనటి. వాట్సుఅను చిత్ర
లేఖకుని పెండ్లాడి యావల విడచినది. ఎనిమిదవయేట
నాట్యరంగమున కాలిడి యింగ్లాండులో సుప్రసిద్ధ నటీనటు
లందరితో తులదూగి యాడుచు షేక్సుపియరు నాయికాస్వ
భావనిరూపణమందు ఆంగ్లనటీమణిమణియైజెన్నొందుచుండెను.
పోర్షియా, జూలియట్టు మున్నగు వేషముల కీమె పెట్టినపేరు.
అనేకవివాహములు చేసికొనినది. తరువాత షష్టిపూర్తిచేసు

కొని షేక్సుపియరు నాటకములగూర్చి యుపన్యసించుచు, దిరుగుచున్నది.

ఈమెసోదరుడగు ఫ్రెడ్ టెర్రీ మరియొక టెర్రీయు నట లోకమున విఖ్యాతపాత్రధారులై పేరొందియున్నారు.

### సర్ జార్జి అలక్ జాండరు (1858–1918)

ఆంగ్లనటశేఖరుడు. యిర్వింగువద్ద తరిఫీదుపొంది సెంటు జేమ్సు లిసియంయున్నగు నాట్యశాలలలో అభినయించుచుం డెను. ఇతడు యీనాటి సాంఘికజీవనమును తెలుపు హాస్య నాటకములలో పెద్దమనుష్యుల నిత్యజీవనపద్ధతు లభినయించు టయందు కడునేర్పరి.

పాశ్చాత్యదేశములలో యిక్కాలమున నాటకబహు రూ పకవిశేషము యొక్కొక దానియందు ప్రత్యేక సాధనమొనర్చి లోకమాన్యముగ నభినయించు వారనేకులుగలరు.

మెలోడ్రామాలో గెట్టి, క్రైగు, హారిస్, మెల్విల్లి, పెరిన్సు, నెవిల్లి, బాలెట్టు, మున్నగువారు యెందరోగలరు.

వీరువిషాదనాటకాభినయమునందుపై జెప్పినవారితోసమా నముగకీర్తిగడించినపాశ్చాత్యనటశేఖరులలోబారను, షాడరు, లామేటరు, డాపీలు, యాడిక్లైరు, కెండలు, రీహాల్, కాల్వ ర్టు, హేరు, కాంబెలు, విండమ్, సాల్ విపీ మున్నగు నటనటీ ప్రముఖులు పేరొందినదగియున్నారు. వీరిజీవితములు పైవా నివలెనే అభినతపాత్ర నామోదహరణముతో పుట్టుచావుల తే దులతో నింపనిష్టమొల్లక నింతటితో విరమించుచున్నాము.

ప్రస్తుతమున, పాశ్చాత్యదేశములలో ఈక్రింద పేరొం-

నబడిన నటనటీ ప్రముఖులు విఖ్యాత కళాస్వతంత్రులై వెలుగొందుచున్నారు.

హెన్రీ ఎయిన్లీ — ఆంగ్లనటుడు వయసు 43 ఏండ్లు.
ఎర్నెష్టు ఆల్మనీ — వ॥ 70 సం॥ ఇటలీదేశపు ఆపెరానటి.
మేరీ ఆండెర్సను — లోకవిఖ్యాతయగునటీ.
లీనా ఆష్వెలు — వ॥ 56. ఆంగ్లనటీ.
బోర్షియరు — గారిక్కునాట్యశాలలోని నటసూత్రధారి.
థామసుబర్కు — వ॥ 32. ఆంగ్లఆపెరానటుడు.
చాలియపిన్న — వ॥ 48. రష్యాదేశపుఆపెరాగాయకుడు
యలోనోడూడురా — వ॥ 62. ఇటలీదేశపు విషాదనటీ.
గల్లీకర్సీ — ఇటలీ ఆపెరానటీ.
మిల్లీగిల్బర్టు — ఫ్రెంచి హాస్యనటీ.
సర్‌చార్లెసు హాట్రే — ఆంగ్లనట శిరోమణి.
జెరోము — వ॥ 63. ఆంగ్లహాస్య నటుడు.
మేరీలోహర్ — ఆంగ్లనటీ, గ్లోబుధియేటరు.
మదాములున్నీ — ఆంగ్ల ఆపెరానటీ.
సర్జాన్‌మార్టిన్ హార్వీ — ఆంగ్లవిషాద మహానటుడు.
మాడెసెలిల్ — వ॥ 60. ఆంగ్లనటీ.
నెల్లీమెల్బా — ఆంగ్ల ఆపెరాగాయని చక్రవర్తి
మెక్రీసీల్బన్ — మెక్రీకమార్తె పేక్సుపియరు నటీ.
మేరీఫిల్‌ఫోర్డు — వ॥ 23. లోకఖ్యాత సినీమానటీ.
సినర్‌సమార్కో — వ॥ 49. ఇటలీదేశపు లోకఖ్యాత, ఆపెరాగాయకుడు.

| | |
|---|---|
| రిచ్చెర్డుస్ట్రాసు | వ॥ 58. జర్మనుఅపెరా గానసంస్కర్త. |
| మేరీటెంపెస్టు | ఆంగ్లభావ నటీశిరోమణి. |
| యిరినీవాన్బర్గు | ఆంగ్లనటీ తిలకము |
| సర్ గెరాల్డుడూమా రియర్ | ఆంగ్ల నటుడు. |
| గ్లాడీసుకూపరు. | ఆంగ్ల సెనీమానటీ. |
| సిబిల్ తారన్డైకు | ఆంగ్ల నటీ. |
| హెర్బీ బైయిన్టను | ఆంగ్ల నటుడు. |

# ఆటతోటల కమ్మతెమ్మెరలు

## మారీసు మాటర్లింకు.

[బెల్జియము దేశపు షేక్స్పియరు అని ప్రసిద్ధిగాంచి, 1911 లో నోబుల్ సారస్వత సన్మాన మందినొనిన మారిస్సు మేటరులింకు 1864 లో. గెంటునగరమున పుట్టి 1890 అగాయతు అనేక నాటకములను, విమర్శక వ్యాసములను రచించియున్నాడు. వీరి కృతులు పెక్కుభాషలలోనికి సంతరింపబడినవి. లాడ్రామా, మాడర్నా, అను వ్యాసములోని అభిప్రాయములు రసస్వరూపమును తెలుపుచు పాశ్చాత్య నాట్యరంగమున బొడగట్టుచున్న భావిపరిణామమును తెలుపుచు, తెలుగు వారలకు ఆదరణీయములైయున్నవి.]

### నవ్యనాటకములు.

ప్రాచీన నాటకము లభియించుచున్న నటులు తమ పాత్రస్వభావ వ్యాఖ్యానమును, అభినయమును, నవీన నాటక పద్ధతులలో క్రమముగ సంక్రమింపజేయు చున్నారు. అందుచే మేము నవీన నాటక సాహిత్యమునే విమర్శనాంశముగ గైకొనుచున్నాము.

ఈ నాటి నాటకములో గథాకల్పనము, అవస్థావైష

రీత్యము చాలవరకుతగ్గి యుద్వేగము చచ్చుచున్నది. మానస సంచారవైఖరుల విస్తరించుటయు, నైతికసమస్యల లోతుపాతు లరసిచూచుటయు, అభినయానుకూలమగు స్థూలరస భావ గాథా ప్రకటనముకన్న నాధ్యాత్మికచింతయు, నవేద్య దివ్యతత్వానుభూతియు, నవీననాటకములలో ప్రధానాంశము లగుచున్నవి. మరియు సాత్విక సౌందర్యమొప్పెడి రసానంద మభిలషింపబడుచున్నది. ఈనాటి నాగరికనాట్యరంగమందు వీరుల బొబ్బలింతలు, దెబ్బలాటలు, పల్లటీలు, ఉద్రేకపూరితమైన రసాభినయము క్రమముగ సన్నగిలి, సాత్విక సందర్భ సూచనమే గారవింపబడుచున్నది.

జీవులెల్లరు చచ్చుచున్నారు, కాని, ప్రకృతిలో జంతుజాతకముల కష్టావస్థ మరణాంతముగమాత్రమే పరిణమించదు. మనుష్యునికష్టములు తడిగుడ్డతో గొంతుకోసినట్లు "ఆలర్కం విషమివ సర్వతః ప్రవృత్తం" క్రమముగ హింసించునేకాని, అమాంతముగ బ్రాణావధి తెచ్చిపెట్టవు. ఈప్రకృతిసందర్భమే, నాటక రచయితలు గ్రహించి, నాటకములను చాలవరకు విషాదాంతముగనుండు పూర్వాచారమును మరలించుచున్నారు.

యవన నాటకములు రచయింపబడి యభినయింపబడిన కాలములో ఆనాటిప్రజలు తమ నిత్యజీవితములో నాటకములం దుద్దీపింపబడిన భావములను, జీవితావస్థలను కొంచ మించు మించుగ ననుభవించుచుండిరి. షేక్సుపియర్ నాటకములకు మూలగాథ లొసగిన ఇటలీ, నార్వే, స్పెయిన్, జర్మనీ, ఫ్రెంచిదేశముల వీరకథలు కొంత పాతబడినను వానిలో నిర్దేశింపబడిన జీవితావస్థలు, భావములు

షేక్స్పియరు కాలములోని ప్రజాజీవితమందు కొంతవరకు అనుభూతమగుచుండెను. అథవా వీనిమరేవుయింకను ప్రజలకు కలుగలేదు. ఈనాటిమానవలోక మానాటి మర్యాదల నెల్ల మరచినది. ఈనాటి యువతీయువకులు రోమియో జూలియట్టు లవలంబించిన వలపుతెరవుల విశ్రృంఖలశృంగార విస్తరణము పొందకున్నారు. వీధులలో రహంత మాటపట్టున గడ్డమువిూద సవాలుచేసి, కత్తిదూసెడి యాచార మంతరించినది. కావ్యఘణతుల జీవించుట, నాటకవైఖరుల సంచరించుట విమప్రయోగములు, దయ్యాలగోలలు, చచ్చినవారినీడ లరుదెంచి పలుకరించుట, విచిత్రవర్ణాలంకృతమైన దుస్తులు రాచక్రీడలు "సాయంకాలే వనాంతే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం" ముచ్చటగా ముద్దులాడెడి యలవాటులు యివియన్నియు నవీనలౌకిక జీవనమందుండి తొలగిపోయినది. తల్లిదండ్రులు ఒప్పుకొననికన్యను పరిణయింపజూచిన యదృష్టహీనుని చరిత్రము, వియోగభారము, షేక్స్పియరు మహాకవి రోమియో జూలియట్టునాటకములలో వివరించియున్నాడు. అందలి యల్లికబిగివి కావ్యపాటవము, అందలి రసములు, భావములు, కథాకాలపు దేశాచారములకు, ఆనాటిపరిస్థితులకు సంబంధించి యందముగ దోచుచుండును. కాని అవి యన్నియు నీనాటిజీవమార్గముల కపరిచితముగ నున్నవి. ఓతెల్లోవంటి అనుమానపుమనిషి, మ్యాక్బెత్తు లియరు, హ్యాంలెట్టు మున్నగు సత్త్వములు యీనాడు చూడనేరము.

ఈకాలపు జీవితావస్థలగ్గలొసి యందముగ రసభావములు పెంచి చిత్రించుట కలవికాదు. కావుననే నాటకములకు

ప్రాచీనగాథల నవలంబింపవలయునని కొందరు హెచ్చరించుచు న్నారు కాని కవికూడ యీనాటివాడే! వాని అభిప్రాయములు నమ్మకములు యిప్పటి పరిస్థితులబట్టి యుండునేకాని వెనుకటి వాని ననుసరింపవు. ఇప్పటికిని భావికళ్యాణమం దాశాబంధ ములు భావినరకమందలి భయకంపనములు కలవుగాని, ప్రజలు దేవతా ప్రీత్యర్థమందును, భక్తివీకరణముల కార్యనిర్వాహక సామర్థ్యమందును నమ్మకున్నారు. ఇప్పుడు మనుష్యుడు సుఖదుఃఖము లన్నిటికిని భౌతిక కారణములను, మానసవైప రీత్యములను, మూలముగనెంచు భావనప్రజల కలవడినది. ఇట్టివారు పూర్వకాలపు నమ్మకములతో పూర్వగాథలయందే విధి సంతుష్టిపొందగలరు? బయటివస్తువులందు సౌందర్య మూహించుటలేదు. అసలు మన మానసమందుగాక పరిస్థితు లందు ఠేమిరస సౌందర్యములున్నవి? దేవుడు మానవావస్థ లలో నిత్యానుభూతి జూపునను నమ్మకముపోయినది. మానవ పౌరుషమును వితర్కించు విధివిధానమందు నమ్మకముపోయి నది. ఇందులో మానవుని భంగపాటులు, నొడుదుడుకులు అవితర్కితఫలప్రాప్తులు, అన్నియు హేతువాద ప్రవాహమున నస్తమించుచున్నవి. అందుచే నాటకములందుగాని, గాథలం దుగాని పాత్రపోషణము కేవల భౌతికసందర్భముల ననుస రించియే మానసవ్యాపారముల నంటియే చిత్రింపవలసి వచ్చినది.

లౌకిక జీవనమునుగూర్చి ప్రజల దృష్టిపథము మారినసం దున వీని చిత్రించు నవీననాటకముల భాషయు నాలంకారిక సౌందర్యరీతుల వదలి, లౌకిక సాధుత్వ మొందవలసి వచ్చి

నది. కావ్యము శబ్దమయము, శబ్దము భావసంజనితము, భావము సాధుత్వ మొందినప్పుడు పదజాలమ్మంతయు సాధుత్వ మనుభవింపక తప్పదు. పూర్వకవులు రచించిన పరిస్థితులు, నమ్మిన యభిప్రాయములు, నిత్యమని భావించిన విధిదైవత ములు, మరుగువడినవి. ఇప్పటికవులు తమ నాటకములలో కల్పన బాహుళ్యమునకును, అలంకార సౌందర్యమునకును మారుగ, నైతిక మానసిక వీధులలో సంచరించిభావనాప్రపంచమున కావ్యపోషణ మొనర్చుచున్నారు. మానవ చైతన్య మును లోతుగ పరిశీలించుచున్నారు. ఇది భావకవులందు గద్యకథకులందు నైతిహాసకులందు నీతిప్రవక్తలందు సహ్యమై నవియేకాని నాటకకవులు కేవలము వేదాంతులవలె భావకవు లవలె నిశ్చల నిశ్చంచల భావవిస్తరణమందు సంతుష్టి నొందఁ కూడదు. నాటకమునకు ప్రధానమైనది అభినయ సంచలన ము. కవి ప్రత్యేక మనస్థితు లొప్పవాడు. నటులు వానిభా వార్థమును గ్రహించి వానిపలుకు లుచ్చరింపవచ్చును. కాని తెరయెదుట సామాన్య ప్రవృత్తులుగల ప్రేక్షకమండలి జీవసంచల నాందోళనావేశ పూరితులై యుందురు. కవిగాని నటు డుగాని వీరి యాశయముల మెరుపు ననుభవించక వాని చేగ దళించక నుండనేరడు. జనబాహుళ్యము అవస్థాభేదములను కథాంశపు త్వరితగతిని అపేక్షించుచుండ రసభావముల నిప్పా పొంగుల గోరుచుండ వాని యుత్సాహము సంక్రమింపక యేకవియు, నటుడును ప్రవర్తింపనేరడు. అందుచే యీనాటి కావ్యాదర్శములకును నటనీమములకును నాటక ప్రయోగము నకును పరస్పరవిరోధమేర్పడినది.

కాని సంచలనము మనుష్యుని నీచావస్థకు సంబంధించి యున్నది. అనుభవముల సంఘర్షణముచే రసతరంగముల భంగపాటులచే యాకర్ష అనబడు సంచలన మేర్పడుచున్నది. నీతినీమములకును,అనురక్త విషయమునకును వైరుధ్య మేర్పడి నప్పుడును కామితార్థమునకు విధినిర్ణయము లడ్డము వచ్చినపుడును, రసప్రకోపమేర్పడి భావము లుప్పొంగి వీనిచే మానస మొందు సంచనలము బాహ్యాంగములందు అభినయమై గోచరించును. ఇది నవీననాటకాంశములందు పూర్వపువానిలో కన్న విస్ఫుటముగ పెంచబడుచున్నది. పూర్వము పాత్రబాహుళ్యముచేతను, అవస్థాభేదమునను గూర్చబడిన గాథావిస్తారము సామాన్యపు తెలివిగల నటులచే నుద్దీపింపబడెను. ఈ నాటి నాటకములలో విపరీతజీవితావస్థలుండవు. పెద్ద భంగపాటులేర్పడవు. అల్లిక పెంపు లుండవు. కొద్దిమంది పాత్రములు, సామాన్య జీవితావస్థలు తోపజేసెడి భావములను యుదయింపజేసెడి రసములను తమ చైతన్యవీధిలో విస్తరించి చల్లని సాత్వికావస్థలలో లేతపలుకుల తీపిచందములతో నభినవ మర్యాద లనుకూలంబుగనుచ్చరించి, రసోదయమేర్పరచవలసి యున్నది. ఇందువలన నైతిక మానసిక వ్యాపారోల్లేఖనము జేయు నవీన నాటకముల నభినయించువారు సాత్వికరసస్ఫూర్తి వెలిగించు మహాసమర్థులై యుండవలెను.

ఫ్రెంచినాటకములు నైతికజీవనములోని సామాన్యావస్థలను నాట్యరంగమునజేర్చినవి. డ్యూమాతండ్రి కొడుకులు అవలంబించినమార్గమే యూరపులోని నవీన నాటక కవిత్వమునకు ఆధారమైనది. కాని యివి చాల పేలవముగను

ష్టపి. పంచాయితీసభలకు అభియోగాంశములగూర్చు లౌకిక విషయములు, నీతిసూత్రముల జర్చించునవయ్యును, రసవత్కావ్య సందర్భములు కానేరవు. చైతన్యము నీతినిర్వచనమున కందరాని యశేద్య వస్తువిచారణయం దెక్కువ సంచార సౌలభ్యమొందుచున్నది. చేతనాదృష్టిలో జగత్తును చూచిన జగమునందు పరస్పరవైషమ్య మంతరించి, సాత్త్వికసమత్వమే గోచరించుచుండును. ఇట్టి రససిద్ధి జోరన్సన్ను హాటమన్ నాటకములలో మొలకెత్తి యిబ్సెను చేతిలో పరిణామముస్వరూపము నందుకొనినది.

చైతన్యము విశుద్ధమైనకొలది, విశాలమైనకొలది, అందలివిశేషములు యెక్కువవిమర్శనీయమగుచున్నవి. చీకటిలో జిక్కి, మాయానిబద్ధమై రజోగుణముతో పొంగివడెడి చిత్తము సర్వసామాన్యమై, లౌకికమై వింతగతుల నడువజాలదు. ఇట్టి చేతనము రాతిచట్టులో గొండసారియలనడుమ బిగిసి, రొదసేయుచు, తల్లడిల్లెడి పసహానివలె భంగపాటులతో నుపద్రవముగ విలయప్రకోపమున నాటకముల దెగటార్చుచు, పరుగిడుచుండును. క్రమవైశాల్యమొందు నది చల్లగ ప్రశాంతగామనోజ్ఞకమై మింటిపైతేలెడి మబ్బుపింజల రేతరంగులను మూపుపై దాల్చుచు, తటంబుల నలంకరించు నగారామ సౌందర్యమును ప్రతిబింబించుచు, మహాసీమమై, సస్యోపకారకమై చల్లని మేనియందములతో జాలువారుచుండును. అటులనే విశాలానుభూతిగల చైతన్యము శాంతయుచులీనెడి రససమృద్ధితో నిరాడంబరముగ, మనోహరముగ సంచరించుచుండును. ఉత్తమచేతనాయుతులగువారి రాజసము సామాన్య

మానవముల రాగద్వేషములకన్న చల్లగ సాత్త్విక రసానుభవ సౌందర్యమున విప్పారిందియుండును.

వికసించని బుద్ధిలో అసత్యములు, పొరపాటులు, అభిమానములు, సాంప్రదాయములు, ఆచారములు, మూఢాభిప్రాయములు, పెల్లుబ్బి సనాతన ధర్మ పాటవంబున నని వార్య బలప్రభావమున వెల్లువై పొంగుచుండును. ఇట్టి నీచచైతన్య సంచారమునసే గర్వము, స్వాభిమానము, విధి విధానమందలి నమ్మకములు, నిత్యజీవితములో పరతత్త్వ మడ్డువచ్చునను దైవభక్తి, కసితీర్చుకొనెడి కోరిక, వీర సంతాప భావములు పాతివ్రత్య ఆదర్శములు మున్నగు ననంఖ్యాక ములైన చిత్తవిభ్రాంతులు మొలకెత్తి మూఢ విశ్వాస పోషితములై మానవధర్మములవలె గోచరించుచుండును. ఇట్టి మాయాసంజనితమగు అపధర్మవివేచనమువలన యీధర్మముల పరస్పర విరోధము వలన ప్రాచీన నాటకముల దుడుకుపోకడలు, గాథా విస్తరణము పైబడాయి, రూపుడాలు, ప్రాకృత జనామోదకరంబుగ నేర్పడియుండెను. వికసించిపండిన మానసము, విశాలమై విప్పారిందిన చైతన్యము, సామాన్య లౌకికులు ధర్మములనిభావించి నిర్వహింప బూనెడి మూఢ విశ్వాసములకు లోబడను. పరిణత చైతన్యము ఆత్మ ప్రబోధములనంటి సంచరించునేకాని లౌకిక ధర్మముల నంగీకరింపదు. వానికొరకు దుర్వికార విభ్రాంతినొంది, గర్వము, స్వాభిమానము, సంప్రదాయ గౌరవము, కామక్రోధముల తప్పుదోవలు వెతుకపోవదు. దుర్నయశీలురకు మరణాది కఠిన శిక్షల విధించదు. దురభిమానముల కెడముండదు.

కిన్నిళ్ళు, కోపములు, పరితాపము, పశ్చాత్తాపము, యేడ్పులు, బొబ్బలింతలు, పులికిపాట్లు, ధర్మసమ్మూఢచేతనము మున్నగు దుర్వికారములు, పండి వెలుగొందిన మానసమందు గోచరింపవు. ఇట్టి నిరహంకార మానసమందు భక్తి తాత్పర్యములు, ధర్మాభిమానములు నశించి, అపకారమూహింపకుండుట, జగదుపకారమే చింతించుట, తనయందు నిఖిల భూతములందు సమహితత్వంబున మెలంగుట, యిట్టి ప్రశాంత సద్భావములే చల్లని తత్వరసముతో నుప్పొంగుచుండును. ఇట్టి చైతన్యమే రససిద్ధి నొందుచున్నది కాని విశుద్ధసాత్విక రసోదయ మేర్పడినపట్టున నాటక బీజములు మొలకెత్త నేరవు.

ఇబ్సెన్ను మహాకవి నాటక సాహిత్యమునకు ఒనర్చిన మహోపకారము యిందుననే యున్నది. గాథాప్రవచన మందు చల్లని శాంతరసము యుదారచేతనాప్రవృత్తులు అవరించి ప్రేక్షకులను నిర్మల సద్భావములలోనుదార సాధురసానుభవములో ముంచివైచును. కథాంశమున లేనీకలో లౌకిక ప్రవృత్తుల రాగద్వేషము లందుకొనుచు బాహ్య ధర్మార్థ నిర్వహణ సంకల్ప సంచలితులై గ్యాసులైటు వెనుక గోడ మీద నాడెడి ఛాయా మూర్తులవలె అనతి వైశద్యమున నాడుచుండును. నటులు కథాంశములో నీచవృత్తుల భీకరావిర్భావమేర్పడినను నాటకము నావరించు దివ్యతేజస్సులో కథాంశమగు రాజసము, తమోగుణ సహజమగు రేచీకటిలో దేలుచుండును. ఇబ్సనురచించిన నాటకములలో ప్రాచీన మహాకవుల కావ్యాలంకార సౌందర్యముకాని, విస్ఫుటరసా

క్రోశనముకాని, నిండువెలుగున విప్పొంగి తేజరిల్లెడి గాధావస్థలుగాని గోచరింపవు. ఇబ్సెనునవీన నాటక రచనమందు అపూర్వమగు రసస్ఫూర్తికి యత్నించి యున్నాడు. కాని యాతనికూడ రసముయొక్క నిజస్వరూపమును ప్రకటింపలేక పోయెను. మానవ మానసము కాలపరిణామమున దివ్యనైర్మల్యమొందగలదు. జన బాహుళ్యమనుభవించు చేతన సంకల్పములు విశుద్ధసాత్త్విక రసస్ఫూర్తి నొందెడి భావ పరిణామములో నాటకములందు విషాద సందర్భములు శూన్యమై కళ్యాణ సంతుష్టియే ప్రధానాంశమై వెలుగగలదు. సర్వధర్మములు స్వకాభిమానములు నశించి యౌదార్యము సమత్వము న్యాయము యీ మూడుమాత్రమే మానవ మానసపునేతలై నడిపించుచుండును. రాగల భావినాటకములలో నిట్టి దివ్యచైతన్యము స్థూల మానస లక్షణములైన అహంకారము అజ్ఞానము ఔదాసీన్యములతో సంఘటించి యాత్మవిజయమునకు యత్నించు సందర్భములు మాత్రమే ప్రధానాంశమై బరగనోపును. హాట్మను జోర్నసన్ను మిర్బోయిట్టి నాటకముల రచియింప నుద్యమించియున్నారు. కాని వారి క్రియాసిద్ధి నవీనాదర్శములకు జంకియున్నది. మానవ జీవితములో విజ్ఞానాభివృద్ధిచే రాగద్వేషముల విపరీత విస్ఫోటన మంతరించి లోకహితైక జీవితాదర్శములు సర్వసమత్వ మభిలషించెడి జగత్కళ్యాణ సంకల్పములు, పరిణామాదర్శములుగ నేనాడు వెలుగగలవో, యేనాడు మానవ చైతన్యము విశుద్ధసాత్త్విక రసానంద మనుభవించునో, ఆనాడు కళ్యాణాంతమగు శాంత రసప్రధానమైన చావులు కోపములు శోకములు విషాదములు

లేని నవ్యనాటకము లుదయింప గలవు. మానవనైజము శాంత సమత్వములొంది నాటకరంగము నత్యాంతరసోపేతమై చెలువొందు జగత్కల్యాణ సత్వర ప్రాప్తికి బుద్ధి మంతులెల్లరు యత్నింపవలెను.

—♦ ఇబ్సెను మహాకవి ♦—

(హెన్రీ అర్థరుజోన్సు 1912 లో నొసంగిన "నవ్య నాటకపద్ధతులు" అను ఉపన్యాసమునుండి సేకరింపబడినది.)

యూరపులోని నవీననాటక కవిత్వమును పరిశీలించు పట్టున ఇబ్సెనుమహాకవి యొనర్చిన నాట్యసేవ యాలయగోపురమువలె మిన్నంటి మిన్నయై మున్ముందు కన్నుల దాకుచుండును. ఈ మహాకవి, నవ్యరూపకపద్ధతుల నెలకొల్పి దారి జూపిన స్వతంత్రకల్పన సమర్థుడు. కావ్యస్రష్టయేకాడు — చిరకాలమునుండి వేరులిడి పాదుకొనిన రూపకలోపముల పెకలించి త్రుంచివైచిన కావ్యసంస్కర్త. కాలదూషితములై నీరసనిర్బంధములై సరసరూపక విరచనంబున కడ్డుదగిలెడి నాట్యమర్యాదల సడలించి, రూపకరచనా స్వాతంత్ర్యమును సంపాదించిన కవివీరకేసరి. క్రొత్తయాటల మొదటివేల్పు— ప్రాతమర్యాదల రూపుమాపెడి శమనమూర్తి — కవిస్వాతంత్ర్యమును గాపాడు రాజసనిలయము. సత్యము, ధైర్యము, చిత్తశుద్ధి, కరుణానుకంపములు, వీని పాత్రలలో మెరుగారుచున్నవి. నాటకరచనమం దశేషముగ గద్యవైఖరుల విస్తరించి, స్వగతోపన్యాసములను, నిరర్థకమగు నర్థాంతరన్యాస మహోపన్యాసములను, విపరీతభావ సంక్షోభమును, దొంగనీతులను, దుఃఖనివారణము కొరకును, సుఖప్రాప్తికొర

కును, భగవంతునిదలచెడి సాపేక్షకంబగు దైవచింతను, ఆశా నిబద్ధమగు భక్తిమెరలను, ఇంకా ననేకవిధములగు రసభావ ప్రకోపన సందర్భములను, తుడచివైచి నిరుపమసుకుమార రసశోభితంబులగు రూపకరాజముల గల్పించు స్వతంత్ర కావ్య కలనాచతురుడు, నేర్పులపోగు. విపరీత బాహ్యాందోళన వ్యక్తపరచు సందర్భములకన్న వాచికాంగికములందు, పెడసరి పోకడల కనుకూలించు దుడుకుపట్టులకన్న, ఆత్మానుభవముల లలితసద్భావ నిరూపణము,లో తలపులు లేతచందములు, మనోవ్యాపారముల సూక్ష్మవికాసము, అంతరాత్మ యనుభ వించెడి రహస్యావేదనములు, వీనిచే నుదయించు మృదుభావ తరంగములు నటకౌశలము జూపుటకెంత యుపకరించునో లలితసుందర సద్భావ సూచకములగు లేతపలుకులు సరసాభి నయములు నాట్యరంగమున నెట్టియసమాన కళావిలాసముల కూర్పగలవో ఇబ్సెను రూపకములందు నిదర్శింపబడి యున్నది. చప్పని భావముప్పొంగజేసి రక్తికట్టెడి సందర్భములకన్న లోతలపుల తేటవెలుగులే రూపకకవిత్వమునకు శోభాసాం ద్రత్యమార్దవముల గల్పించునని ఈతనినాటకములు రుజువు చేయుచున్నవి.

మహాకవు లందరివలెనే ఇబ్సెను మతిపరిభావము స్వభావ చిత్రీకరణమందుకన్న విభావపరిపంచమందునే వెలు గొందుచున్నది. షేక్స్పియరు, గెటీ, సోపోక్లీజు, మున్నగు కొందరు మహాకవులు రాగపరిపంచమును వీడి యున్నత విజ్ఞాన శిలాతల్పమున యోగసమాధిలో సాక్షీభావమున విశ్రమించి కడుదూరమున లోయ లోతున నీచపరిచార

మొనర్చు జీవవాహిని నవలోకించి యంటియుంటని పెద్దచూపు లతో మానవజీవితావస్థలను చిత్రించుచుందురు. యిబ్సెను మహాకవి యిట్టి పరిశాంత సాక్షీభావమూనక నిత్యజీవితపు ప్రచండ భీకర వాతాహతిలోమునింగి దెప్పరిల్లుచు దాని కష్ట నిష్ఠురములనొకవిధమగు కరుకు వైరాగ్యముతో ననుభవిం చుచు తన యాత్మానుభముల అంతఃక్షోభముల, మనస్తాప ముల జిత్రించుచుండును. ఈకాలమున యూరపులోని మతి మంతులూహించు తలపుల నందికొని తత్వజ్ఞుల దారినంటి కాలానుగుణ భావవికాసమును పొందియున్నాడు. ఆత్మ సంరక్షణ మపేక్షించి యత్నించువార లద్దాని గోల్పోవుచుం దురు. ప్రాణమువిడువ సిద్ధమగు ధీరులే యద్దానిగావగలరు.

అనుభవించి తెలుసుకో. తెలుసుకొనుటకే జీవింపుము. అనగా నైహికభద్రమును అన్వేషింపక స్వానుభవమున తార కమంత్రమూరసి దేహప్రాణముల లెక్కసేయక నుత్తమభావ చలితాత్ముడవై జీవించి కృతార్థుడవుగమ్ము అనెడి సూత్రమును ఈనాటి తత్వజ్ఞశంకారవమై బరగుదానిని ఇబ్సెను రూపకములు పరసముగ బోధించుచున్నవి.

ఇబ్సెను నివసించినది యొకచిన్న దేశము. వీని లోకా నుభవము, సంకుచితావకాశములలో సన్నగిలి హ్రస్వదృష్టి దోషమొంది యున్నను వీని యాశయములు అననుభూతమగు విశాల ప్రపంచమును గూర్చియెత్తోజూచుచున్నవి. ఇతను కావ్య సౌందర్య సందర్భముల గుర్తించిన రసికుడు కాడు. కావ్యశిల్పి యు కాడు. కాని యదార్థనిర్వచనముం నససూనసాహాస మేర్పడి లౌకికజీవితమందగుపడు టక్కరిభేషజముల దునుమాడు

శరకుపలుకులగురుపించుటలో నిరాఘాటముగ దుముకుచుండెను. ఇందీతని మరిపింపగల కవి లేడు, ఇక నుండబోడు. ఈతని కల్పనలు చదువరుల నాకర్షించి శాసించు నేర్పొప్పియున్నవి కాని సుందర సుకుమార కల్పనలందించు లలితసంతోష మొదవింపజాలవు. యౌవన వసంతోదయమున పలుకులు కులతో సయ్యాటలాడు యువజనోదంతములు వీనికి రుచించ లేదు. ప్రణయలేఖలం దుదాహరింపదగిన శృంగారసుభాషితము లీతని పాత్రములలో మందునకైన నగుపడవు. బుద్ధిహీనులను, నిరుత్సాహులును, దుర్బలాత్ములును, అగువారినీతడు నిర్దయుగ దునుమాడుచుండును. నవీనవర్తకపద్ధతుల విశ్వసించి ధనరాసుల గడించు లోభప్రవృత్తియే పరమసాధ్యముగ నూహించు నవీన నాగరికమర్యాదల నెంతమాత్రము సహింపడు. మానవజాతిలో ముప్పాతిక మూడువీసములు తలపగూడని నీచస్వభావమున బొరలుచుందురనియు వీరిని రక్షించి యుద్ధరించెడి దారి గానరాదనియు, ఆశాభంగము నీచదుర్మరణము వీరికనివార్యముగ గలుగనోపెడి వ్యవస్థయనియు ఇబ్సెను రూపకము లేర్పరచుచున్నవి. కాని బలవంతులకీతడు కేలూతనొసంగుచున్నాడు, స్థిరధీరుల నుత్సాహపరచి కార్యశూరుల జేయుచున్నాడు. ఆత్మవిచారణ మొనర్చు పరచింతాపరుల కెంతయు విజ్ఞానసంతోష మమర్చుచున్నాడు. స్వారాజ్యసంపదలభిలషింపని, యాత్మగౌరవనిగ్రహము లాడవపి నీచభావిసల దండించు దుడుకరియయ్యును స్వతంత్ర మనోవృత్తిలేర్పడిన యాత్మవంతుల సదా దర్శములనెంతయు పెంచి బలపరచి పోషించుచుండును. యథార్థవాదులను ధీరసత్త్వలీతని గారె

వింతురు. నీచస్వార్థదుర్గుణజీవనముకన్న, వెఱ్ఱితలపుల వలవరింతలలో మతి వికిగి తొట్రుపడెడి యాత్మవిహీనజీవనముకన్న ప్రళయపయోధివీచికాగమనమే, విలయపయోద భీకరాశని నిపాతమే మేలనిదలంచు మేధావులీతని రచనలకర్ఘ్యపాద్యాదులొసంగి గౌరవింతురు.

ఇబ్సెను మహాకవిని దూషించి భూషించిన విమర్శకుల స్వభావములు యీతని రూపకలక్షణమును తెలుపగలవు. లోకసామాన్యమంతయు ఇబ్సెను ప్రభావమును దూరి యారబోసినది. కాని యీతని ప్రతిభాసామ్రాజ్యమెట్టకేలకు నాత్మవిదూరుల యేవగింపులమించి జయించి విజయవైభవమున దేజరిల్లుచున్నది. నాట్యచరిత్రలో నీతని పవిత్రనామధేయమా చంద్రతారార్కముగ జగన్నాథగోపురసౌందర్యగాంభీర్యమున జెన్నొంది ముదిచావులెరుగని నిండుబింకమున నిలువగలదు. లోచూపు లమరని పిరికితొత్తలు, మంచిచెడ్డలారయని నీచవిమర్శనలు గుగ్గిలపువెలుగువలె చివాలున మండిపడి వెంటనే చల్లారి ధూమమాలిన్యమున నంతరించినవి. దూషక విమర్శకులు మడసిపోయిరి. కవిప్రతిభయమర్త్యమై వెలుగుచున్నది.

## హెన్రీఅర్థరుజోన్సు 1861

(ఆంగ్లనాటకకవి—విమర్శకుడు—నాట్యోద్యమ మందుత్సాహభరితమగు నుపన్యాసముల నిచ్చుచు నాటక కళను సంస్కరింపబూనిన మేధావి Renaissance of the English Drama అను విమర్శకగ్రంథమును రచించి యున్నాడు. 1912లో అమెరికాలోని సెంటులూయీనగరమున జరిగిన సర్వకళా

సమావేశమునకు యీతడర్పించిన the Corner Stones of the Modern Drama అను మహోపన్యాసమును సంగ్రహించి దిగువ తెనిగించి ముద్రించుచున్నాము.)

## నవ్యనాటక ధర్మములు.

కళావిషయములలో బుద్ధిమంతులు దేశకాలవిభేదముల పాటింపకూడదు. విశాలహృదయముతో స్వాభిమాన దురహంకారముల వీడి కళాసౌందర్యమే రససమృద్ధియే ప్రధానాంశముగ నెంచి కళాప్రపంచము నవలోకించి యన్యోన్య సహకారమున కళాస్వరూపముల సంస్కరింపవలయును. ఇందువలన జాతీయసత్వమున కెట్టిప్రమాదములు గలుగనేరవు పైగాపర ప్రతిభా సంపర్కమున భావోద్రేకమేర్పడి నిజసత్వముప్పొంగి కాలానురూపమగు క్రొత్తచిగురుల దాల్చగలదు. విజ్ఞానప్రపంచ పర్యటన మెన్నడును జాతీయకళా సంప్రదాయముల మాపనేరదు. ఇట్టిదుస్థితి సంభవించుటకు బదులు జాతీయకళా స్వరూపములు క్రొత్తవెలుగులతో విఁతచురుకులతో కళాసర్వస్వ సౌరభమొప్పారు ఆమనివిరియందమున జెలువొందగలవు.

నాటకకళ జనసామాన్యమునకు సులువుగ నర్థమగుచు మిక్కిలి రుచించునదియై యున్నది. ఇతర కళలను అనుభవించుటకు ప్రత్యేక శిక్షాసంస్కారములవసరమగుచున్నవి. నాటకములజూచి సంతసించుట కెట్టిశిక్షలనవసరము. అందుచేత రూపకసాధనముచే నైతికసుర్యాదలను జాతీయభావములను సదాచారమార్గములను రుచికరమగు రీతులలో ప్రజల

దువ్యాపింప జేయవచ్చును. సంఘసంస్కరణమునకు నాటక
ముపయోగించునట్లు సంస్కరించియలవరుచ వచ్చును.

నాట్యప్రపంచ వృత్తాంతమారయ రెండు ముఖ్యవిష
యములు గోచరించును. అభినయంబున జీవితావస్థల ననుక
రించెడి వేడుక సర్వదేశములందు అన్నికాలములలో నగు
పడును. అనుకరణము జంతుజాలములలో కూడ నగుపడు
చున్నది. జంతువులు తల్లులచేష్ట యనుకరించి జీవనోపాయ
ముల సాధించుచున్నవి. నాట్యవృత్తి మానవనైజ సంజనిత
ముగ దోచుచున్నది. అనాగరికజాతుల మొదలు సంపూర్ణ
నాగరికవికాస మనుభవించెడి మానవసంఘముల వరకును
నాట్యకుతూహలము అనేకరీతుల నాశ్రయించి కాలక్రమమున
వికసించుచు జాతీయజీవనములో ప్రధానకళాంశముగ బరిగణిం
పబడుచున్నది. నాట్యలలామ కొన్నివేళల మతసాంఘిక
నిబంధనల యొత్తిడిలో జిక్కియుండెను. కొన్నివేళల నీచ
మర్యాద లాశ్రయించి శోభావిహీనయై సిగ్గువడినది. ఒక
ప్పుడు పసితనపుచిలిపి చేతల చిందులిడుచు, ఒకప్పుడు బూతు
కూతల మోటతొడవులదాల్చి యసహ్యముగ నసభ్యముగ
నగుపడెను. కొన్నిసందర్భములందు పలుకులందములుగాని
వస్తుస్వరూప సౌందర్యముగాని గోచరింపని విపరీతరాజసంబున
భీకరభయానకమూర్తియై మితిమీరుచుండెను. ఇంకొక కాల
మున లేతపలుకుల ముద్దుగుమ్మయై సొంపులగురిపించుచు కొం
డొక సమయమున సిగ్గుదలంచక విచ్చలవిడి గంతులిడు గణా
చారివలె డాబుషోకుల దాండవించుచు బలుతెరంగుల మిడిసి
పడుచు ననేకరూపములతో అనేకవడలతో ఎప్పటికప్పుడు

మారుచుండు వార్ధికసొబగులతో వన్నెచిన్నెల వెలుగొం దుచు గులుకుచు నిలుచుచు నడచుచు శతభంగీయుత దివ్య రూపమున కెడ తెరపిగానని బలాయువ్య సంపదలతో నాట్య సుందరి మానవచరిత్రాంకముల నలంకరించుచున్నది. ఏవు సొబగులు దేశకాలావస్థల ననుసరించి మారుచుండెనేకాని ఏదో ఒకరూపమున మానవజీవిత మందన్ని వేళల నాట్యలలామ బహిర్వ్యక్తమై తన కళాప్రభావ మగుపరచుచునే యున్నది.

నాట్యచరిత్రము దెలిపెడి రెండవయంశ మేమన— అవస్థానుకరణము మానవ మానసపు నిత్యస్వభావమైనను, పాశ్చాత్య చరిత్రలో నాల్గుమారులు మాత్రమే, నాలుగు ప్రత్యేక జాతీయవిజయ సందర్భములందు రూపకకవిత్వ మతి శయించి యుల్లుకొనునది. యవనచరిత్రలో నొకమారు, ఎలిజబెత్తునాటి ఆంగ్లవిజయోత్సాహమున నొకమారు, పదునాల్గవ లూయీ ప్రోచుచుండిన పరాసుకళామండపంబున నొకమారు స్పెయినుదేశపు సామ్రాజ్య వికాస సందర్భమున నొకమారు మరల ప్రజాస్వామ్య స్వాతంత్ర్య సంతోషమను భవించెడి పరాసుసీమలందు 19 వ శతాబ్దమునను రూపక కవి త్వమనుతదివ్య వైఖరుల విస్తరించియున్నది. ఇటులనే ప్రపంచములోని యితర దేశములందు విజయసంతోషమేర్పడిన శాంతసంపన్న సమయములలో రూపకరచన మొప్పొంగి వెల్లు విరిగినది. నాట్యవృత్తి మానవస్వభావమాశ్రయించి జనించు నదయ్యును ఆయాదేశములు గెలుపు కులుకులతో మిడిసిపడ నె విజయావకాశములందే యందమగు రూపకరచన ఏర్పడుచు వచ్చినది. (హిందూదేశములోని భాసకాళిదాస శ్రీహర్షభవ

భూత్యాది మహాకవుల రూపకరచన మిట్టి విజయసందర్భము లందే విస్తరించెనని నమ్మవచ్చును. కాని కృష్ణరాయల కర్ణాటసామ్రాజ్య వైభవంబున గావ్యశిల్పములు బెంపొందినవే కాని నాటకరచన మేర్పడలేదు. ఇటులనే మహారాష్ట్ర సామ్రాజ్యవిస్తరణావకాశమున భక్తివాఙ్మయ మభివృద్ధి జెందెనే కాని నాటకరచన ముదయించలేదు. ఇది పైజెప్పిన రూపకోత్పాదక సందర్భములకు భిన్నముగనున్నది. కాని శివాజీ కృష్ణరాయల లౌకికవిజయము హిందూమతసంరక్షణార్థమేర్పడినదే కాని లౌకిక దిగ్విజయ సంకల్పములవలన గలుగలేదు. అందుచేత నాకాలములో భారతీయుల యానైయ మూవరాధికారలంపటను దొలగించి మత స్వాతంత్ర్యమును నిలుపుకొను యావేశముతో మెలగుచుండెను. నాటకరచన కనుకూలమగు విజయగర్వమేర్పడినను, శాంతసంపన్నసుఖజీవన మమరియుండలేదు. మరియు తురకల కత్తియదలింపులలో తమస్వాతంత్ర్యమును నిలుపుకొనుటకు ప్రాచీనమర్యాద లతిక్రమించకుండ కట్టువడియుండిరి. భావసంచలన మేర్పడలేదు. ఇటీవల హూణరాజ్యపు సమాదరణంబున నొకవిధమగు పూతమెరుగు లౌకికపు శాంతిసంపదలేర్పడి, పాశ్చాత్య సభ్యతా సంపర్కమున భావస్వేచ్ఛయలవడి హిందూదేశములోని భాషలందు విరివిగ రూపకరచనమేర్పడుచున్నది.) ప్రజలు శాంతచిత్తులై శత్రుభయంబునగాని మతవినాశకభీతిచేగాని తల్లడిల్లని శాంతియుగములలో విజయగర్వమే పారెడి జాతీయవైభవసమయములలో, జీవితానుభవము లెక్కువ గలుగుచు

డెడి నాటినంపన్న నాటిదరి(ద్ర)కాలములలో రూపకరచనాకుతూ హాల ముదయించుచుండును.

ఎలిజబెత్తుమహారాణికాలమం దాంగ్లరూపక కవిత్వము పరిణతరూపలావణ్యమున బెంబొంది సొంపెక్కియున్నది. ఆవల నింగ్లాండులో స్వతంత్రరూపకరచన మస్తమించెను. 17 వ శాతాబ్దాంతమున ఫ్రెంచిమహాకవి మాల్యేరు మార్గము లను సరించి డ్రైడెను మున్నగు కవులు రెస్టరేషను ప్రహాసనంబుల గల్పించియున్నారు. మాల్యేరు, డాంటే, ఇబ్సెను మహాకవుల వలె ప్రకృతియందగుపడెడి నీటిసూత్రములు గమనించి, నిత్య జీవనములో ననుభూతమగు రసభావసూచనల నందికొని స్వ భావసౌందర్యమే పారు కథాకల్పన మొనర్చియున్నాడు. అం దుచే మాల్యేరురూపకములు నీతిభోదకములై యున్నను స్మృతి వాక్యపాటవంబున దేశికమర్యాదలంటక కావ్యలక్షణమగు రసస్ఫూర్తితో జెలువొందుచున్నవి. వీని యాదర్శమున రూప కకవిత్వ మవలంబించిన డ్రైడెను మున్నగు కవులు నీతిభోద యే అభిమానసూత్ర ప్రతిపాదనమే ప్రధానాంశముగ నెంచి నీతిబోధకొరకు గడుంగడు హేయమగు నీచావస్థల జిత్రించి భంగపడిరి. షేక్సుపియరు మహాకవి యశశ్శరీరమును దా ల్చినదాది నేటివరకు నింగ్లాండులో గోల్డుస్మిత్తు రచించిన She stoops to Conquer, షెరిడను రచించిన The School for Sandal The Rivals. అను నాటకములు మూడుమాత్రమే మాననీయ కళాసౌకర్య మొప్పుచున్నవి. ఆంగ్లేయు లఖండరాజ్యవిస్తారమున నిత్యసంచలనోద్వేగ మనుభవించుచు మహోద్యమముల దలపెట్టి గొనసాగించుచు నిరంతర భావ

సంచలన మొందుచు పలు తెరంగుల జరించుచు బ్రపంచరంగ మునననంతజాతీయేతిహాస నాటకముల నభినయించుచున్నారు. ఇట్టి నాటకకథాసందర్భ వైచిత్ర్య మాంగ్లేయుల జీవనములో వెలుగొందుచున్నను కడచిన రెండువందల సంవత్సరములలో రూపకకవిత్వ మాంగ్లదేశమున బీడువడి వన్నెదప్పినది. యిట్టి ప్రతిభాదారిద్ర్య మెందునగలైనో విచారించినయడల నాంగ్ల రూపకముల సంస్కరించుమార్గము లారయగలము.

మాల్యేరు మొలపించిన పరానురూపక కవిత్వమునేటి వరకవిచ్ఛిన్నముగ మాసనీయ మహాకవులచే ననేకనవ్యరూపముల విస్తరింపబడుచున్నది. హోమరు, వర్జిలు, డాంటీ, షేక్స్పియరు, గెటే, మున్నగు పాశ్చాత్య జాతీయకవిశేఖరులతో దులదూగుపరాను మహాకవులందరు నాటకమును సాహిత్యపరిణామముగ నూహించి రూపకకల్పన మందశేషచాతురీ విలాసముల జూపియున్నారు. మాల్యేరు, కార్నెల్లీ, వాల్టేరు, హ్యూగో, రేనార్డు, మరివో, బొమార్కెయా, డూమాతండ్రి కొడుకులు, మూసెట్టు, ఆగేరు మున్నగు వాఙ్మయధురంధురులందరు ప్రదర్శనోచితమగు విషయానేక సంకలితమగు విచిత్రరూపకముల గూర్చి పేరొందియున్నారు. ఇప్పటికిని పదిమంది మేటికవులాదేశము లోకానందదాయకమగు రసవద్రూపకముల రచించి రూపకసాధనంబున సాంఘికసమస్యలను జీవనమర్యాదలను కళాధర్మములను బ్రతుకుతెరవులను విమర్శించి సంస్కరించు చున్నారు. మాల్యేరు రూపకములు వినా, చదివినా నటింపజూచినా యంత మనోహరముగ చురుకు నడకలతో వింతకథలతో రసవైభవముతో స్వభావ సౌందర్య

ర్యముతో భావగాంభీర్యముతో నీతిప్రబోధక పటుత్వముతో పలుకు సొగసులతో కూర్పుటందములతో నమేయసౌందర్య రాసులై గులుకుచుండునో అట్టికావ్యసౌకర్యములన్నియు నిండారువడుచు పొగరువ నీనాటి ఫ్రెంచినాటకములందు విలసిల్లియున్నవి. ఆంగ్లరూపకకవిత్వము షేక్సుపియరు నేర్పుకూర్పులలో భువనైక స్సామ్రాజ్య మనుభవించియు మానసాంభోజ సౌందర్యమున జెలువొందియు తరువాత నూరుపేరు లమరని నీచదశ జిక్కియుండ మాల్యేరు పాతినపరాసురూపక బీజములను దినము క్రొత్తదొడవుల నందగించి లోకమాన్యముగు విరిపూత లొందనేల?

షేక్సుపియరు కాలము చెల్లినవెనుక నింగ్లాండులో పవిత్రముగు క్రైస్తవాదర్శములజాలెడి నీతిబోధకుల ప్రభావముదయించినది. వీరు నాటకప్రదర్శనములను నీతిబాహ్యముగ నెంచి పెద్దమనుష్యులు, సంస్కారులు నాట్యశాలలకు పోవకూడదని శాసించిరి. ఇందువలన నాంగ్లదేశమున విద్యాసంస్కారమేర్పడని ప్రాకృత సమాజములే నాట్యమందిరముల కరుగుచుండిరి. నీతిప్రవర్తలసంతతులే, యమెరికా భూభాగముల జేరి వలస విడిసిరి. అక్కడ వీరి యాచారములు ఇంగ్లాండులోకన్న నెక్కువ కాలము ప్రజాభీష్టముల శాసించుచుండెను. అందుచేత ఇంగ్లాండు అమెరికా దేశములలో రంగసౌందర్యమును విపరీతభీకరావస్థలను చూచి యానందించు పాటకపు పరిషత్తులే నాట్యకళను పోషించుచున్నది. టాప్సీపరు సీనును, పాటలు, టపాలు, వెకిలిముద్దులు, దుస్తొరబములు నీచహాస్యములు, ప్రాకృత మర్యాదలు, మిక్కుట

ముగ నుప్పొంగు నాటక ప్రదర్శనములు పాటకపు జనుల నెక్కువ సంతోష పెట్టుచుండును. ఇట్టి నాటకము లింగ్లాండు అమెరికాలలో ప్రబలియున్నవి. నిత్య వ్యాపారపరిశ్రాంతి నపనయించు వినోదాభిలాషతో ప్రజలు నాటకముల జూడబోవుచున్నారు. అచ్చటకూడ నాటకము లోని కథాంశములను అభినయరీతులను మంచిచెడ్డ లెఱుంగువే డుకతో శ్రద్ధగ బరిశీలింపక, నెచ్చెలికరతలంబుల వలపుగీటు లతో నలయించుచు పలుకుటొయ్యారములకులికి ముద మొందుచు కాలయాపన మొనర్చుచుందురు. ఇట్టియుదా సీనప్రకృత సమాజములకు రుచించు నాటకములే ఇంగ్లాండు అమెరికాలలో వాసికెక్కి ప్రజాసంతోష మొద వించి మితిలేని ధనార్జనమొనర్చుచున్నవి. ఈ రెండుదేశము లవారలు, జగన్నాటక కథాభినయ సందర్భములం దసమాన మేధావిభూతితో నలరారుచుండినను సరసరూపక రచనాప్రద ర్శనములందు నీచమర్యాద లాశ్రయించివెనుకపడియున్నారు. అమెరికాలో మంచిచెడ్డలెఱుంగని పాటకపుజనులు నాట్యవే శ్యల నాశ్రయించుచున్నారు. కొందరు చదువుకొనిన బుద్ధి మంతులు అప్పుడప్పుడు నాటకముల కేగుచుందురు. కాని నాట్యకళయందు తమకున్న యభిమానమును బహిరంగముగ జూపుటకు సిగ్గొందుచుందురు. అమెరికాలో ఎక్కువ ధనవం తులై విద్యావంతులై మర్యాదస్థులై సదాచారసంప్రదాయ గౌరవమున వాసికెక్కిన యుత్తమజనంబులు తమ పూర్వుల సంప్రదాయము లనుసరించి నాట్యకళయం దుదాసీనులై వర్తించుచున్నారు. అందుచేత అమెరికాలోని నాటక స్వరూ

షనిర్ణయము చాలవరకు తత్కాళాపోషకులగు జనసామాన్యపు నీచరుచులచే నాదేశింపబడుచున్నది. ఇంగ్లాండులో నీతిబోధకుల ప్రభావముననూ రెస్టరేషను రూపకముల నీతిబాహ్యతగలిగించిన ఏవగింపువలననూ పెద్దలు నాట్యవిషయములందు పాల్గొనకున్నారు.

. మరియు నాంగ్ల దేశమున 18, 19 వ శతాబ్దములలో మహోనీయగుణగరిష్ఠులై వెలింగినమహాకవులునాటకములరచింపలేదు. రూపక కవిత్వము సారస్వత పరిణామ మనెడి తలంపు లాంగ్లదేశమున నస్తమించినవి. కవులు విమర్శకులు నాటకముల నేవగించి లలితకళలలో దీనికి నెలవొసంగనందున, నాట్యకళ ప్రాకృతజనాభీష్టల కనువగు రీతులలో విస్తరించి యున్నది. (నాట్యకళను సంస్కరించు ప్రయత్నములు, కానరావు. చిత్రము, కావ్యము, శిల్పము, నృత్యగీతాభినయములు మున్నగునవేక లలిత కళల సహకారమున నాటకకళ యుండగించుచున్నది) వీనిపరస్పర సంబంధములారసి సరస రూపక ప్రదర్శనమందు వీనిలో నేది ఎంతవరకు తోడ్పడదగునో నిర్ణయించు సంకల్పమెవ్వరికిని కలుగలేదు. నటులకు నాట్యకళా రహస్యముల దెలిపెడి శిక్షావకాశము లేర్పడలేదు. (నటులు, నాటక కవులు, విమర్శకులు, ప్రేక్షకులుస్వీయ చిత్తానుసారముగ వర్తించుచున్నారు. కాని యన్యోన్య సహాయమున రూపక సౌభాగ్యమేర్పరచు తలంపుతో మెలగకున్నారు. ఆంగ్ల నాటకములు పామరజనంబుల వినోదపరచి డబ్బుదోచెడి వెకిలి మల్లరియైనవే కాని ప్రజల సారస్వత నైతిక కళా జీవనమును

జాతీయాదర్శములను సాంఘిక ధర్మములను సంస్కరింపు సదా దర్శముల సూచింపకున్నవి. అనగా ఆంగ్లేయుల సాంఘిక జాతీయ జీవన పద్ధతుల సంస్కరించుటకు నాటకములుపయోగింపకున్నవి. ప్రస్తుత కాలమందాంగ్లేయులు పరదేశవాఙ్మయ కోశముల గొల్లవెట్టి విజాతీయ రూపకముల సంతరించి ప్రదర్శించుచున్నారు. తమ జాతీయ స్వభావమున కనువగు స్వతంత్ర రూపకముల రచింపకున్నారు. మరియు నాట్య రహస్యమెరుంగని కులుకులాండ్ర బత్రికలందుమిన్నంట నుగ్గడించి నీచాభినయ పద్ధతులకసహ్యమగు గౌరవ మేర్పరచుచున్నారు. ముద్దులీనెడి లేత మొగము తళుకులాడెడి చురుకు చూపులు సిగ్గుదలచని వెకిలి వలపులు లేనగవు పూల వాసలు, లొల్లాయి పాటలు, వింత కూతలు, పోకిరి పలుకులు, నటీలక్షణంబుగ నెంచబడి యాంగ్ల ప్రేక్షక సమాజముల నమితోత్సాహ సంభ్రమానంద తరంగ సందోహమున దేల్చి నుక్కిబిక్కిరి చేయుచున్నవి.

పై చెప్పిన కారణములచేతను ముఖ్యముగ కవులు, విమర్శకులు, పత్రికలు, నటులు పనివడి యన్యోన్య సహాకారమున నాట్యకళాభివృద్ధికై పాటుపడని కతమునను నాట్యకళా సంపోషణ మజ్ఞానజనంబుల పాలిట జేరి యుండినందునను ఇంగ్లాండు అమెరికా దేశములందు నాట్యకళ నీచలక్షణ విదగ్ధమై యింపు దప్పి లలితకళా సౌందర్య మొప్పకున్నది. ఇందుచే షేక్సుపియరు అస్తమించిన దాది యాంగ్లభాషలో విశ్వవిఖ్యాతి గాంచిన రూపకము లేర్పడలేదు.

ఇక పరాసు సీమలందు పదునాల్గవ లూయీశకము నుండి నేటివరకును నాటకకవిత్వ మవిచ్ఛిన్నముగ నవనవోన్మేష విలాస సంపదలతో విస్తరించిన యనుకూలావకాశము లరయజూచెదము. ఫ్రాంసులో కూడ నాటకములు కొంత వరకు ప్రేక్షకానంద సంపాదన ముద్దేశించి రచియింపబడుచుండెను. కొంతవరకు నీతిబోధనము సాంఘికధర్మ ప్రాచుర్యము రూపకోద్దేశ్యముగ నాచరించుచుండెను. కాని ప్రజాసంతోషమే, ధర్మనిరూపణమే, ప్రధానాంశముగ ఫ్రెంచికవులు భావించి యుండలేదు. వీరు కాళిదాసాది హైందవమహాకవులవలె రూపకకవిత్వమునకు వాఙ్మయమకుటమర్యాద నొసంగి కావ్యసౌందర్యమే కల్పనచాతుర్యమే ప్రధానాంశముగ నెంచిమిక్కిలి జాగరూకులై రచించుచుండిరి. ఫ్రెంచికవుల రూపకములు పరాసు సాహిత్య పరిషత్తులోని విద్వాంసులచే జక్కగ పరిశీలించి పరిష్కరించి దిద్దిదిద్ది మెరుగెట్టబడుచుండెను. యేటరు ఫ్రెంచీయలోని నాట్యసిద్ధులీరూపకముల నభినయించి చూచి వాని యభినయసౌకర్యమును ప్రదర్శనయోగ్యతను తీరికమీద జర్చించి వలసినమార్పు సూచించుచుండిరి. రసరహస్య మెఱింగిన విమర్శకులు కావ్యకలనాచతురులగు కవిపుంగవులు రూపకముల బరీక్షించి సంస్కరించి తమ విమర్శనోద్దేశ్యముల బత్రికలందు బ్రచురించుచుండిరి. ఇవ్విధముగ రూపకకవులు నటశేఖరులు కావ్యశాసకులు చేరి సంస్కరించిన రూపకవిశేషములు పత్రికలలో జనసామాన్యమున కర్థమగు తేలికవైఖరులలో విరివిగ ప్రకటింపబడెను. ఆవల నాటకము నచ్చొత్తి దేశములో పంచబడెను. ప్రేక్షకులు అచ్చుపడిన

రూపకములను వానిపై నడుదెంచిన విమర్శనములను జక్కఁగ
జదివి నాట్యసభల కేగుచుందురు. అచ్చట సర్వాంగశిక్షా
న్వితులగు నటశిరోమణు లీరూపకముల నభినయించుచు
నుత్తమ నాట్యలక్షణముల బ్రదర్శించుచుందురు. వీరి యభి
నయరీతులను సామాజికులు శ్రద్ధతో బరికించి నాట్యకళా విచ
క్షణయం దసమాన నైపుణ్యమును గరచియున్నారు.
ప్రపంచములో నెచ్చటను పరాసునాట్య సభలందుగూడి
ప్రేక్షకవర్గమును బోలు రసికమండలి యగుపడదు. ఇవ్విధ
ముగ పరాసు సాహిత్యపరిషత్తుయొక్క ప్రభావమునను థియే
టరు ఫ్రెంచీయొక్క నాట్యాచార శాసకసామర్థ్యమునను
పత్రికావిమర్శనల సత్కారతిరస్కార నివేదనాసక్తి చేతను పరా
సుప్రజల నాట్యరుచులు మేలితెరవుల వికసించి యలౌకిక
రసవిచక్షణశక్తు లొప్పుచున్నవి. నాట్యకళకు సంబంధించిన
లలితకళలన్నియు నాట్యోపయోగిసత్వమున నలవరచబడి
రూపకప్రదర్శనము ఔచిత్యభంగమొదవకుండ నుచితరీతులలో
బ్రకాశించుచున్నది. ఇంతియేగాక ఫ్రెంచి రూపకకవులు
ఎప్పటికప్పుడు ప్రజామానస మాకర్షించు సాంఘికనైతిక
ధర్మములను జాతీయాదర్శములను కథాసంవిధానము జార
కుండ రససౌందర్యము కొరవడకుండ గాపాడుచు తమరూప
కములందు వెలిగించి నాటకమును జాతీయసాంఘికాచార
సంస్కారణమునకు ముఖ్యసాధనముగ నుపయోగించిరి. అందు
చేత పరాసునాటకము వినోదసంతోష మొసంగెడి లలితకళా
విశేష మగుటయేకాక జాతీయచరిత్రములో నొక ముఖ్య
సాధనమై యుపయోగ సౌందర్యముల రెంటిని సిద్ధింపజేయు

చున్నది. ఇట్టి పరిస్థితులు, శిక్షాక్రమములు విచక్షణరీతులు ఏర్పడినందున, నన్నితరగతుల జనులు పనివడి శ్రద్ధాభక్తు లేపార రూపకకవిత్వమును వాఙ్మయ పరిణామముగ నూపిం చిపోషించినందున ఫ్రాంసులో నేటివరకు " కావ్యేషు నాటకా రమ్యాః " అను న్యాయము సార్థకమై రూపకవాహినీ ప్రవా హామనంతగుణ శోభితమై యెడతెరపిలేని మేటియందమునఁ జాజిల్లుచున్నది.

ఆంగ్లదేశమున నాటకము ప్రజాసంతోష ముద్దేశిం చును జాతీయసమస్యల నందికొనక కవినట విమర్శక ప్రేక్షక పత్రికాజనంబుల యన్యోన్యసహకార మేర్పడక రూపలావ ణ్యముల గోల్పడి రసవిహీనమై నీచదశ ననుభవించుచున్నది. ఫ్రించిదేశమున నాట్యకళ రసవత్కావ్య సౌందర్యమొప్పా చూ జాతీయజీవనములో ప్రధానసంస్కరణ పరిభావము ననుభ వించుచు వాఙ్మయదురంధురల గౌరవసహాయముల బొంది చక్కగ వికసించుచున్నది. ఆంగ్లేయుల నాట్యపతనమునకు ఫ్రెంచివారల నాట్యసిద్ధికిని గల హేతువులను బరికించి యున్నాము. ఇందువలన స్ఫురించుసూత్రములు ఆంగ్లనాటక సంస్కరణ కుపయోగించునని దిగువ నుదాహరించు చున్నాము.

(1) రూపకకవిత్వము వాఙ్మయపరిణామమని యెల్ల రుగ్రహించి వాఙ్మయములో ప్రధానాంశముగ జేసి యాదరిం పవలయును.

(2) సమకాలిక జీవితావస్థలను సాంఘికసమస్యలను నిరిపరిచారక సంస్కరణోద్దేశ్యములతో రూపకకథా సందర్భ

ములాదు విస్తరించెడి స్వాతంత్ర్యము నాటకకవులందరు అవలంబింపవలయును. చిత్తశుద్ధి, సమదృష్టి పరచింత, లేర్పరచు గభీరభావములను చక్కని సాత్త్విక రసానంద మొసంగు కథాసందర్భములను మానవవ్యాపార వైఖరులను తెన్నుగ గుర్తించి చక్కని చిన్నినాటకములను కావ్యాలంకార చిత్రికాంశులు దేజరిల్ల గల్పింపవలయును. ప్రాకృతసమాజ ముల సంతోషపెట్టు భావోద్రేకమును విపరీతసందర్భములను నాటక కవు లాశ్రయింప కూడదు ప్రకృతజీవితమునకు వీలైనంతవరకు సంబంధించి సాంఘికాదర్శముల నెలకొల్పు నుద్దేశ్యముతో నాటకము లేర్పడవలెను.

(౩) ప్రజావినోదమే నాట్యాదర్శముగ నుండగూడదు. ఉత్తమ లలితకళల నెట్టిలోతుతలపులతో విమర్శించిచూతురో అట్టి విచక్షణ రసవిచారణ నాటకములపట్ల జూపవలయును. ప్రేక్షకులకు అభినయింపబడు కథాసందర్భములను అందలి రసభావవిశేషములను తెలియజెప్పెడి పత్రికావిమర్శనలు కర పత్రములు విరివిగ నందించవలయును. సమాజికరుచులు మెరుగారినగాని నాట్యకళ బాగుపడనేరదు.

(4) నటులు నాటక కవులు సరసవిమర్శకుల సూచన లాదరించుచు నన్యోన్యసహాకారమున తెన్నుగ నాలోచించి పనిచేయవలయును. నటులు కవిహృదయమెరింగి రూపకోద్దేశ్యములను జక్కగ నభినయింపనేరవలయును. కవులు నాట్యనియమముల గుర్తించి యభినయావకాశముల నెరింగి ప్రదర్శనోచితమగు రూపకముల రచింపవలెను.

(౫) నటుల శిక్షించుటకును, నాటకకవుల సంస్కరించు

టకను నవీననాటకముల సరిజూచి పరిష్కరించుటకును నవ్య రూపకముల్ప్రయోగించి యందచందముల నిర్ణయించుటకును ఇంగ్లాండు అమెరికా దేశములలో నాట్యవిద్యాలయములు కావ్యపరిషత్తులు విమర్శకపత్రికలు ప్రయోగనాట్యమందిరములు వెలయవలసి యున్నవి.

(6) ఆక్సుఫర్డు మున్నగు ప్రసిద్ధవిద్యానికేతనములందు నవీననాటకముల పఠనీయగ్రంథములుగ నియమించు యాచార మేర్పడవలెను. ఇందువలన సాహితీరహస్యపారంగతులగు పండితోత్తములు నవీనరూపక కవిత్వమును పాఠము చెప్పెడి జాగరూకతతో పరిశీలించు యవకాశము లేర్పడును.

(ఆర్థరుజోన్సు ఆంగ్లనాటకములందు చూపినలోపములు నానాటి తెలుగునాటకములలో కూడనగుపడుచున్నవి. వాని నుద్ధరించుటకు నీతడుసూచించినమార్గములు తెలుగువారవలంబింపదగియున్నవి. అమెరికా యింగ్లాండులందువలెనే మనదేశములోకూడ విత్తవిద్యాప్రభావ ప్రతిష్ఠలొప్పెడి పెద్దలు నాట్యకళ నాదరింపకున్నారు. ఏయూరజూచినను మావంటిచిన్నలే నాట్యసభల కేగుచున్నారు. కాని పేరుప్రతిష్ఠలమరిన పండితులు, ధనవంతులు యూరిపెద్దలు వినోదమునకైన నాట్యసభాంగణములలో నగుపడరు. ఇట్టి యుదాసీనుల నుద్దేశించిఆర్థరుజోన్సుగారు నాటకకళాభిమానముప్పొంగ, నాటకళాసంస్కరణ మహాబాద్యతావేశమేపార నుపన్యసించిన వాక్యరత్నముల నీదిగువ సంతరించుచున్నాము.

సోదర సభ్యులారా!

నాట్యధర్మమగు అవస్థానుకరణము ప్రాణిలోకపు సా

మానస్య ప్రవృత్తిగ నగుపడుచున్నవి. పిల్లికూనలు తల్లుల చేష్ట లనుకరించి వేటాడ నేర్చుచున్నవి. కుక్కలు, పిల్లలకు వేట తెరవుల నభినయించి చూపుచున్నవి. పసిపిల్లలు తల్లి దండ్రుల పనిముట్లతో నాడుకొనుచు వారిచేతల ననుకరించుచు తరువాతి జీవనోపాయ సాధకంబగు వృత్తులయందు ప్రథమ శిక్ష లాటరూపమున బొందుచున్నారు. ఆట పసందులే జీవిత పద్ధతుల నేర్పు మొదటి పాఠము లగుచున్నవి.

నాట్యప్రవృత్తి మానవస్వభావమందు సహజముగ జేరి యున్నది. మన పలుకులు, నడతలు, మర్యాదలు, ఆచారాభిప్రాయములు, ఇవియన్నియు మన పెద్దల పద్ధతుల ననుకరించెడి స్వభావ ప్రవృత్తులవలన నేర్పడిన యలవాటులే. మన పిల్లలు మనచేతల ననుకరించుచున్నారు. అనుక్షణము యేదో యొక దృశ్యప్రబంధ మభినయించుచునే యున్నాము. ఒక నాటి కొకనాడు మీదపడిన కొద్దీ మన నాట్యప్రవృత్తులు బలమొంది నీడవలె వెన్నంటి యనుసరించుచుండును. ఈయభిలాష తప్పించుకొన నేరము. ఎన్నడో గతించిన జీవితావస్థలను స్మరించి యెచ్చటనో జరిగిన కథాసందర్భములను రేపుకొని మానసమందవ్వాని ననుభవించుచుందుము. ఇతరులతో మాటాడునపుడు చేష్టావాచికముల నభినయించుచుందుము. ఇవ్విధముగ మనజీవిత మనంతరూపకాభినయములతో మితిలేని విభావన పరంపరలతో, స్వప్నానుభవముల తో నిండియున్నది. ఆత్మప్రవృత్తులుకూడ ననంతమగు వేదనానుభవముల నొందుచుండును. మనలో కవిత్వమబ్బిన వారు మన మనోడిన మభినయించు అవస్థలను అనుభవించు

రసావేదనలను ఒక్కచోట కూర్చి నాటక కథాంశమును గల్పించుచున్నారు. నాటకము కవి మానసంబున నుత్పన్నమైనను, కవి కల్పితమగు నభూత విషయము కాదు. ప్రకృతిలోని జీవితావస్థలన్నియు కవిచిత్త మాశ్రయించి జగదుద్ధరణ సంకల్పమున రూపకరూప మందుకొనుచున్నవి. ఆటవేడుకలో పసితనపు చిలిపిచేష్టలలో మొలకెత్తు నాట్యతత్త్వము వికసిత మేధావులగు కవిపుంగవుల మతిపరిభావమున ప్రపంచ రహస్యముల విప్పిజెప్పెడి విజ్ఞాననిలయమై సౌందర్యరాసియై పరిణతరూపకంబుగ విస్ఫారి చెన్నొందుచున్నది.

నాటకములవలన జీవితరహస్యము తెలుకపడుచున్నవి. నాట్యశాలలో బ్రతుకు తెరవుల గరచుచున్నాము. గొప్ప గుణముల గౌరవింప నేర్చుచున్నాము. సదాదర్శముల దివ్య స్ఫురణ లందుకొనుచున్నాము. నీచసందర్భముల బరిహాసించి యేవగించుచున్నాము. ముచ్చటగా, కులాసాగా, సంకల్ప రహితముగ నిరుద్దేశ్యముగ (వినోదానందములననుభవింప నేగిన నాట్యశాలలో) నుత్తమజీవితాదర్శములను పరధర్మములను లోకానుభవమును సంపాదించుచున్నాము. చక్కని రమ్యావస్థలలో నుపదేశింపబడు ధర్మములు స్మృతివాక్యముల కన్న నీతిపరిబోధకోపన్యాసములకన్న నెక్కువ బలముతో మన చిత్తముల బంధించి మంచిదారుల నడిపింపగలవు.

రూపకప్రదర్శన మిట్టి యనూన నీతిబోధక సామర్థ్యమొప్పుచుండ నాట్యశాలలు నీతిబాహ్యములని దలంపనేటికి? జీవితరహస్యముల మరుగు పట్టుల విప్పిచూపెడి నాటకములు పనిలేని యువకుల వినోదపరచు విషయోపాయములుగ నెంచి

జూరనేల? షేక్సుపియరు, సాఫోక్లీజు, గెటే, హ్యూగో, ఘు
ష్నగు ఋషిపుంగవు లనంత శోభా విలాసవైభవ మేర్పరచి
పెంచిన నాట్యకళ మహాదర్శ విరాజితమై సద్ధర్మసూచకమై తా
రకమంత్ర ముపదేశించు మంచిపలుకుల కెడమిచ్చునేగాని యిట్టి
పవిత్రమానసంబుల నుదయించు భావములు నీచమర్యాద లల
వరచ నేర్చునే? ఏల మీకీ వెర్రి! నాటకకవులలో, ద్రష్టలు
న్నారు. లోకారాధన జీవనవ్రతులగు మహాత్ము లున్నారు;
శమదమంబుల కునికిపట్టులై విశాలవిశ్వానుకంపమున కరుణాస
ముద్రులై మానవకోటి నుద్ధరింప నల్లాడు తపస్సంపన్ను లు
న్నారు; కవులున్నారు; మహర్షులున్నారు; ధర్మనిర్దిష్టులున్నా
రు; యిట్టివారి యుపదేశములు, జీవితరహస్య తత్త్వోపన్యా
సములు మీ యుదాసీనత జేసి జనసామాన్యమున కందకున్న
వి. మీరు నాటకకళను నీచముగ నెంచి యభిమానింప కుండు
టచే నాట్యశాలలకేగి మీ యున్నతాదర్శములకును పరిణత
సంస్కారములకును అనుకూలమగు మంచి నాటకము లాడిం
చి యానందింప కుండుటచే సంసారలంపటంబున జిక్కి దుర్వ్య
త్తులవడిన జనసామాన్యమునకు రుచించు నీచనాటకము లే
దేశమందున హాసికెక్కి యభినయింపబడు చున్నవి. మీరు
అభిమానించినను వదలివేసినను నాటకసమాజము లాడక
మానవు. ప్రజలు చూడకమానరు. నాటకములవలన గలి
గెడి జాతీయమర్యాద నిర్ణాయిక వ్యాపారము ఎట్టులైన సా
గుచునే యుండును. మీ యభిమానము సంస్కరణ సూచ
నలు లభించెనేని నాట్యకళకు జాతీయ జీవితాదర్శముల యు
త్తమధర్మములను శాసించు వైభవ మేర్పడగలదు. మీ రు

దాసీనులై మిన్నకుండిరేని నాట్యకళ నీచరుచులాశ్రయించి
నీచమర్యాదల బాదుగొల్పుచు జాతీయ పతనమున కాధార
మగును.

లోభత్వమున కన్నుమూసి, లలితకళల బోషింప
కుండుట కడుహేయమైన పని. లోభపిశాచము లలితక
ళా వికాసమున కెంతయు విరోధముగ నాచరించుచున్నది.
మీబంగారు కుప్పలు, మీ రతనాల మూటలు, మీచేతిలో
మీసంతతుల యాధీనములో చిరకాల ముండునవికావు. ద్ర
వ్యబలమున, జగముల నేలజాలరు. లౌకికైశ్వర్యములు దశా
వైపరీత్యమున వాసిచెడి నామరూపము లగుపడకుండ నస్త
మించును. మన బలాలు మన గొప్పలు మన ద్రవ్యరాసులు
యివికావు నిలచెడివి. వీనితో జగముల నేలబూనకుము.
వీనిపై తమ జీవితాశయముల నాధార పరుపకుము. నిత్య
మై, సుందరమై, నిరంతర రామణీయకమై, శాశ్వతమనో
హరమై, వెలుగొందు, సత్కళాస్వరూపముల నుదయింపజేసి.
సత్కార్య సాధనంబున మీపేరు బింకముల నిల్పుకొనుడు.
కళాసామ్రాజ్య వైభవంబున ననంతమగు లోకఖ్యాతి ననుభ
వించ, మీ సౌధరాజములు నేలగూలిన భావికాలములలో మీ
కళాపోషక మహోదార సంకల్పముల కీర్తిజ్వాలలెల్లెడల
నిలచునట్లు గావించుకొనుడు. కాలవశమున నంతరింపక త
ప్పని మీ ప్రస్తుతవిభూతులకు కళాస్వరూపమున నిత్యమగు
స్మారకచిహ్నా మేర్పరచుడు. మిన్నంటు మిద్దెల గట్టుచున్నా
రు. ప్రాసాద గోపురముల దీపమాలికలు రిక్కతళుకుల వెక్కి
రించుచున్నవి. రమ్యోద్యాన విహార నిలయము లన్నివు

ముల వెలయుచున్నవి. వైకుంఠ పురవైభవ మతిశయించు పురరాజము లుదయించుచున్నవి. పలుదెసల వర్తకవ్యాపార పరిశ్రమాందోళనఝుంఝూరవము మిన్నుమన్నుల కెగ బ్రాకుచున్నది. కాని, మీపూర్వులు పోకడాలు లెరుంగని దరిద్రజీవనములో నాచంద్రతారార్కముగా నిలచునట్లు గల్పించుచుండిన పేటకళ లీనాడే యెడనూ గానరావు. మీజీవితార్థమును లెస్సగ బరికింపుడు; ధనార్జనముకన్న ఆచారవ్యవహారముల పూతడంబములకన్న నీతి నియమముల బడాయినడతలకన్న లౌకిక పదప్రతిష్ఠలకన్న నిత్యమగు సత్యమగు జగదుపకారంబగు మరియొక జీవితార్థము కలదని యోచింపుడు. భూతప్రపంచములో మానవజీవితమున కున్నతినొసంగు కళారచన నభిమానించి పోషింపుడు. షేక్స్పియరు పెంచి వికసింపజేసిన నాట్యకళ నుద్ధరింపుడు. మీ పురములలో సకల జనంబు లుచితముగ జూడగల నాట్యశాలల నిర్మించి వానిలో మీ రూపక కవిత్వమును శిల్పకౌశలమును చిత్రప్రభావమును నృత్య సంగీతాభినయములను వెలుగొంద జేయుడు. నటులకు చక్కని తరిఫీదు లొసంగుడు. కవులను గారవించి పెద్దలను జేయుడు. అక్షరలక్షలొసంగి నాటకకవుల నాదరింప నవసరము లేదు. దేశములోని సరసులు, పెద్దలు, బుద్ధిమంతులు, పెద్దపాయాల మేటిముగలు వచ్చి నాటకముల జూచి సంతసించిన చాలును. అదియే కవి నటలోకమునకు మీరొనర్పగల మహోపకారము. కవులకు నాటకములలో సమకాలిక జీవితావస్థలను చిత్రించు స్వాతంత్ర్య మొసంగుడు. రూపకరూపమున మీ జీవితమందలి మంచిచెడ్డలను తెలుపను

కొను ఔదార్యసమత్వము లలవరచుకొనుడు. నాటకమును జీవిత దర్పణంబుగ నొనర్పుడు. దురభిమాన మాయాతమిం స్రిమున జిక్కి దుస్తరంబుగ దోచెడి సంసార మహారణ్యమున దారిజూపెడి దివిటీగా సద్ధర్మముల నుపదేసించు స్మృతి సాధనంబుగ నాట్యకళ నుపయోగింపుడు. జాతీయ జీవనములో సంఘ సంస్కరణములో రూపకరాజము లొనర్పగల మేలు చింతించి విశ్వసించి యుపయోగింతురేని అవి మీజీవితముల నుద్ధరించి మీ యాదర్శముల సంస్కరించి మీ బ్రతుకుల వెలిగించి మీ ప్రభావమును విస్తరించి మీజాతి కమేయగౌరవ మేర్పరచి లోభాహంకార కలుషితంబగు మీ జాతీయజీవన నిశీథమున నిర్మలవిజ్ఞాన చంద్రికా తేజంబు లుదయింపజేసి రససౌందర్య పవనాంకురంబుల మొలపించి శాశ్వత కీర్తిసంపదల గాజిల్లు సుఖసంతుష్ట జీవన మేర్పరచగలవు.



# ఆటకుదురులు.

## నాట్యకళా పోషణము.

యూరపులో నాట్యకళ పలుతెరంగుల బోషింపబడుచున్నది. జర్మనీ, ఫ్రాంసు దేశములలో ప్రభుత్వనిధు లీకళకు దోడ్పడుచున్నవి. నాట్యశాలలు ప్రజలకు కళారహస్యముల దెలుపుచు వినోదవిశ్రాంతు లొసంగుచు జీవనమర్యాదలను సంస్కరించు విద్యాలయములుగ నభిమానింపబడుచున్నవి. జర్మనీలో పెద్దపట్టనముల నాట్యశాలలు ప్రభుపోషితములై గౌరవార్థము పనిసేయు రసికనియోగులచే బాలింపబడుచున్నవి. ఫ్రెంచిదేశపు ప్రభుత్వ నాట్యశాలలు సమర్థులును రసికులును ధనోత్సాహసంపన్నులును అగు పెద్దమనుష్యుల యాధీనమున బాలింపబడుచున్నవి. రాజ్యాధి యొసంగెడి యుపకారవేతనమున పాటకపుజనులు కూర్చుండు తరగతుల టిక్కెట్టుధరలను చవుకచేయుట కుపయోగింపబడుచున్నవి. అంగా ఫ్రెంచిదేశమున జనసామాన్యము మంచినాటకములను చూడగలందులకు ప్రభుత్వనిధు లుపకారవేతనము లొసంగి వీరిని

నాట్యశాలల కంపుచున్నవి. ఇంగ్లాండులో నాట్యకళ చాల వరకు వ్యాపారపద్ధతులనంటి నడచుచున్నది. మ్యూనుి చెష్టర్ మున్నగు కొన్ని యాంగ్లేయనగరముల స్థానికపరిపాలకత్వములు తమ విద్యాలయములు చిత్రశాలలు మున్నగు వానితోపాటు నాట్యమందిరములగూడ బోషించుచున్నవి. లండనునగరమందు కేవలము వ్యాపార పద్ధతులమీదనే నాటకము లాడబడుచున్నవి. లండనులో సుప్రతిష్ఠితములగు నాట్యవేశ్మలున్నవి. ఆంగ్లజానపదంబులకు సంచారిసమాజములు తిరుగుచు నాట్యవినోద మొనగూర్చుచుండును. ఈసమాజములు రాజనగరమును దాకరావు. లండనులోని పెద్ద కంపెనీలవారు పల్లెటిసీమల కరుగరు. అందుచే నింగ్లాండులో నాగరికనాట్యరుచులకును ప్రాకృతనాట్యాభీష్టములకునువిశేషభేదమున్నది. రషియాలో పేదసోదరులు నాట్యకళావిశేషములఁ జూచుకొరకు అభ్యాగతివలన వచ్చు ఆదాయమునుపయోగించి మిక్కిలి చవుకటిక్కెట్లతో దేశమందెల్లెడల నాటకము లాడబడుచున్నవి. ఇట్టి నాట్యసౌకర్యములు రషియాలోని యూరివల్లెలన్నిటియందు వెలసియున్నవి. అమెరికాలో మునుముందు క్రొత్తనాటకములు న్యూయార్కు పట్టణములో ప్రదర్శింపబడును. యుక్తమగు సమర్థనటులను ఆయానాటకములకు తగినవారిని ప్రత్యేకముగ వేతనమిచ్చి కూర్చుచుందురు. నాట్యశాలలు రంగపరికరములు మిగిలిన యవసరములన్నియు పెద్దమూలధనముగల షాహుకారులుగాని కంపెనీలుగాని కూర్చుచుందురు. ధనికనాట్య కళాభిలాషియొకడు నాట్యశాలను రంగపరికరములను అద్దెకుపుచ్చుకొని

యాడించు వాడుకకూడ కలదు. న్యూయార్కులో యీనాటకముల ముందుగా బ్రదర్శించి యచ్చటి జనామోదమనుభవించినయెడల అమెరికాలోని యితరపట్టణముల సంచరించి యాడనంపుదురు. అచ్చట న్యూయార్కులోని తొల్లిటిపెట్టుబడిదారులే నాట్యశాలలను తాత్కాలికోపయోగముకొరకు నిర్మించుచుందురు. లేక అదివరకాయూరనుండిన భవనమును అద్దెకు గైకొందురు. నాట్యసమాజములు అమెరికాదేశమంతయు చుట్టివచ్చుచు నానా ప్రాంతములందు దమ నాటకములాడుటకు వలయు ప్రయాణనివేశనాది సౌకర్యములన్నియు గూర్చియిచ్చెడి ప్రత్యేకవజన్సీలుకూడ కలవు.

## వ్యాపారనాట్యశాలలు

ఇవి యిటీవల మొలకెత్తినవి. పూర్వము రాజులు జమీందారులు, తమవినోదము కొరకు నాట్యశాలలేర్పరచి ప్రదర్శనములకు తగుపెద్దలను జేర్చుచుండిరి. ఇంకను వెనుక యవనరోమక పట్టణములలో నాట్యకళ ప్రభుత్వముల సహాయమున బరగుచు జనసామాన్యమెల్లరు నుచితముగజూచు నవకాశములు గలిగించుచుండెను. పైజెప్పిన రుషియా, జర్మనీ, ఫ్రాంసు, పద్ధతులలో ప్రభువేతనములు టిక్కెట్లవెలను తగ్గించుచు పేదలు నాటకములజూచు నవకాశము లమర్చుచున్నవి. ఇంగ్లండు, అమెరికాలలో ప్రభుపోషణము వుచిత ప్రదర్శనము అమలులోనికిరాలేదు. నాట్యకళ ప్రత్యేకాభిమానముగల సంపన్నవ్యక్తుల యుత్సాహమున వికసించినంతగ రాజపోషణములో బెంపొందనేరదని యాంగ్లామెరికనుల యభిప్రాయము. ఇందుకుతగినట్లు యీదేశములలో వ్యా

పార నాట్యశాలలు క్షేమముగ నభ్యుదయ మొందినవి. ఒక్క ధనికుడు గాని పెక్కు ధనికుల కంపెనీగాని వలయు నాట్యశాలను రంగపరికరములను గూర్చి, నాటకకవులు, నటులు, చిత్రలేఖకులు, భూమికాసన్నేతలు మున్నగు వారినందరను జేర్చి ఏదో యొక క్రొత్తనాటకము నభినయింప నిశ్చయింతురు. రాబడిసొమ్ము దామాషాగా వీరందరు పంచుకొందురు. అందువలన కవులు, రంగరచయితలు, నటులు, పరివారజనము, పెట్టుబడిదారులు, అందరు వంతుచొప్పున లాభనష్టములకు పాత్రులై యుందురు. ప్రతివాడు తన చేతనైనపని కష్టించి జనామోదకరంబుగ నిర్వహించినగాని ద్రవ్యసంపాదన మెక్కువగ జేకూరదు. వీరికి మంచి యాదాయములు రానేరవు. ఈపద్ధతిలో నాట్యకళావికాసమునకు సర్వాంగసౌకర్యసంపాదనమునకు అవకాశము లెక్కువకలవు. లాభనష్టములనందరు పంచుకొనవలసి యుండుటచే, యెప్పటికప్పుడు క్రొత్తనాటకముల బ్రయోగించిజూపవలయుటచే వాటి ద్రవ్యాకర్షకప్రభావమగమ్యముగుటచే టిక్కెట్లరేటులు మిక్కిలి హెచ్చుగనుండును. ఇంగ్లండు అమెరికాలలో రూపాయి మొదలు పదిరూపాయలవరకు టిక్కెట్లు అమ్మబడుచుండును. మంచి ఆటలకు ఒకవారములోనే పెట్టుబడిసొమ్మునూటికి 100 మొదలు 300 వరకు లాభము రావచ్చును. నష్టము వాటిల్లినచో పెట్టుబడి భర్తీకాకపోవచ్చును. సామాన్యముగ బ్రజలకురుచించు ప్రసిద్ధరూపకములే ప్రదర్శింప బడుచుండును. ఇంగ్లాండు అమెరికాలలో కలవారలే నాటకముల జూడగలుగుదురు. కాని. పేదలీప్రదర్శనాలయములకు బోజాలరు. నవ్యనాటక

ప్రయోగమునకు అవకాశములు కుదురవు. ఇందుచేత నీదేశములలో నవ్యరూపకముల బ్రయోగించి నాట్యకళా సంస్కరణమొనర్చుకొరకును, జనసామాన్యమందు నాట్యాభిరుచులేర్పరచుటకును, ప్రజానాట్యభవనములు, ప్రయోగనాట్యశాలలు, సకలకళా పరిణామరూపముల జూపెడి ప్రత్యేకనాట్యమందిరములు వెలయుచున్నవి.

## రాజ్యనాట్యాలయములు

పరాసు జర్మనీ దేశముల పట్టణములందిట్టి నాట్యసంస్థలు రాజ్యనిధుల సహాయమున బెంపెక్కుచున్నవి. రాబడియాలోచన, లాభచింత, వీని యుద్దేశ్యముకాదు. నిర్ణితకాలములో ఎన్ని క్రొత్తనాటకములు ప్రదర్శింపబడునో! వాని పారస్పతకళాప్రాశస్త్యమెట్టిది? వీనివలన ప్రజలకెట్టిసంస్కారము, రసవిచక్షణ, వినోదవిహారములు లభించుచున్నవి? అను తలపులే ముఖ్యముగ నెంచబడును. రాజకోశమునుండి ప్రతినాట్యశాలకు కొంత వేతన మీయబడును. వియ్యన్నా నగరములోని బర్గథియేటరు సాలుకు రూ.500,000 ల వేతనము పొందుచున్నది. పారిసునగరములోని నాట్యభవనముల పోషించుకొరకు ఫ్రెంచిప్రభుత్వము సాలుకు 15 లక్షలు వెచ్చించుచున్నారు. ఇతరపురముల నాట్యశాల లొక్కొంటికి 75—150 వేల రూపాయల సహాయమొసంగుచున్నారు. ఫ్రెంచి థియేటరుకు 175,000 రూ॥ వార్షికమున్నది. బర్లినుపురములోని జర్మను రాజ్యనాట్యభవన మిట్టి యుదార సహాయమునే పొందుచున్నది. జర్మనుపురములందలి స్థానికనాట్యశాలలలో ఒక్కదానికి 90-135 వేల రూప్యముల పారితోషిక మొసంగు

చున్నారు. ఈనాట్యశాలలలో అన్ని విధములగు రూపకములు చూపబడుచున్నవి. ఇచ్చటి టిక్కెట్లరేటులు రు. 0-12-0 మొదలు రు. 3-0-0 వరకు ను నుండును. కాని పేదవాండ్ర సౌకర్యమునకై రు. 0-4-0 మొదలు రు. 0-12-0 వరకు అమ్మబడుటిక్కెట్లు చాలాదొరుకును.

జర్మనీలో నాట్యశాలలను పాలించు అధికారులు, ఆ యా పురముల రసిక ప్రముఖులై యుందురు. వీరు గౌరవార్థము పని చేయుచుందురు. నవ్యనాటకముల ప్రయోగించుట వలనను టిక్కెట్లు చవుకగా పేదలకు అమ్మి నందునను గలుగు నష్టము భరించుటకు సర్కారు గ్రాంటుల నుపయోగించు చుందురు. ఫ్రెంచిమండలములలో ధనికులు ప్రభుత్వ నాట్యశాలలను కంట్రాక్టుకు తీసుకొని నిర్ణిత రూపకముల ను ప్రదర్శించుచు నిర్ణిత రేట్లకు టిక్కెట్లుఅమ్ముచుందురు. ఇందులకు వీరు ప్రభుపారితోషిక మనుభవించు చుందురు. ఇంతకుమించి కలిగెడి లాభనష్టములువారే అనుభవించవలెను. జర్మనీలో యిట్టిబాధ లేదు నష్టము హెచ్చుగా కలిగినయెడల తగు విచారణ చేసి మరికొంత గ్రాంటు నిచ్చుచుందురు. ఈరెండు దేశములలో నాట్యకళ విద్యాశాఖవలె ప్రభుత్వాంగమై చక్కని వ్యవహార దక్షతతో నిర్వహింప బడుచున్నది. పద్దు బడ్జెటులు అజమాయిషీ మున్నగు నదమాయింపు సంపూర్ణముగ జలాయింపబడుచున్నది. ఈ దేశములలో చిరకాలమునుండి రాజ్యనాట్య భవనములు పనిచేయుచున్నందున వీని పరపతి, కళాప్రతిష్ట స్వాతంత్ర్యము చక్కగ వేరుతగిలి యున్నవి. ప్రజలకు ఎట్టిరూపకము లుచితమో రుచికరమో

సంత్సంసాకర ప్రదాయక సమర్థముతో గుర్తించి, యుత్తమ కళాదర్శములు వెలుగొందునటుల రూపకములాడించెడి నేర్పు కలిగినది. మరియు నిదివరకు చెప్పినటుల ఫ్రెంచి జర్మను దేశముల ప్రేక్షకజనంబులు నాట్యకళా రహస్యముల లెస్సగ గుర్తించిన రసిక వివేకు లగుటచే వీరికి రుచించు రూపకములు వీరిని తృప్తిపరచెడి నాటక లక్షణములను విమర్శనమార్గమున శాలకు లెరుంగ గలుగుచున్నారు. ఇట్టికారణ సముచ్చయంబున పరాసు జర్మను దేశముల రాజనాటక సంస్థాపనలు నష్టములేకుండ మేలగు కళాదర్శముల నెలకొల్పుచు నాట్యవిద్యావధి బ్రియరించు రీతిలో మిక్కిలి జనోపయోగముగ బరిణమించి యున్నవి.

## ధర్మశాలలు.

ఏదో ఒకవిధముగు నవీనరూపక పద్ధతిని ప్రయోగించి చూచుటకుగాని, యిట్టి నవ్యప్రయోగము లొనర్చుచు నష్టపడెడి నాట్యసమాజముల పోషించుటకుగాని కొందరు విత్తవంతులు నాట్యధర్మము లొసంగుచున్నారు. గాని యిట్టి ధర్మశాలలు ఎక్కువ అభివృద్ధి నొందకున్నవి. యూరపులోని రాజ్యనాట్య భవనముల నభివృద్ధిజేయుటకు వానిలో కొన్ని ప్రత్యేక లక్షణముల బ్రయోగించుటకు కొందరుదారులు పెద్ద బహుమతు లర్పించుచుందురు.

## చందా కంపెనీలు

కొందరుజనులు చందాలు వేసుకొని ముఖ్యముగా తమవినోదము కొరకును వీలుకొలది ప్రేక్షకుల జేరనిచ్చుటకును కొన్ని నాట్యశాలల నేర్పరచుకొని యున్నారు. (చెన్న

పురనుగుణవిలాససంభవంటివి.) ఇందు నవ్యరూపకముల ప్రయోగించు స్వాతంత్ర్యమెక్కువ కలుగుచున్నది.

## ప్రజానాట్యమందిరములు.

ఆస్ట్రియా, జర్మని, ఫ్రాంసు దేశములందు ప్రజల సహకారమున పెద్దనాటకసమాజము లేర్పడియున్నవి. ఇందు లో గొన్నింట ఎబదివేలసభ్యులవరకుందురు. వీరు సమాజ పోషణముకొరకు కొద్దిచందాలనిచ్చుచు పరస్పరసహకార పద్ధతులమీద నాట్యశాలలగట్టించి వలయుసామగ్రి గూర్చి నాటకము లాడించుచుందురు బర్లిను నగరమునందలి వ్యాల్క్సుబ్యూనె నాట్యశాల ఆపట్టణములోనెల్ల యందమైనదై ఏబదివేలసభ్యు లగల్గియున్నది. ఈసభ్యులెన్నుకొనిన పాలకమండలి నాట్య శాలావ్యవహారముల జూచుచుందురు. సభ్యుల కుత్తమతరగతి టిక్కెట్లు ఒకరూపాయికమ్మబడును. బయటిప్రేక్షకులయిం కను ఎక్కువవెలనిచ్చి కొనవలసియుండును. సభ్యులకు నా ట్యశాలలోని నాట్యవాఙ్మయము చదువవీలగును. ఇట్టి కొన్నివసతులుకూడ దొరకుచున్నవి. ఇట్టిఏర్పాటు బెంగుళూ రు యామెచూరు కంపెనీయందు నిదర్శనమగుచున్నది. ప్రజా సహకారమున నేర్పడిన నాట్యశాలలు మిగిలినపద్ధతులన్నిటికన్న నెక్కువసుప్రతిష్ఠితములై నాట్యకళాభివృద్ధికి మేలొనరించు చున్నవి.

## నాట్యజీవుల వృత్తిసంఘములు.

నాట్యకళకుసంబంధించిన నానావిషయములందారితేరిన నటులు, వ్యవహర్తలు, రంగరచయితలు, భూమికానిర్ణేతలు, మున్నగువారు తమహక్కులాభముల గాపాడుకొరకు వృత్తి

సంఘముల నేర్పరచుకొనియున్నారు. అమెరికాలో నాటకములాడింపదలచినవారు తమకు కావలసిన కళానిపుణులను యా సంఘములకు వ్రాసి పిలిపించుకొందురు. ఎవరెంతకు తగుదురో వృత్తిసంఘముల కార్యనిర్వాహకు లెరుంగుదురు. కొన క్రొత్తయాటను తలపెట్టినంతనే అందుకుతగిన నటులను చిత్రలేఖకులను ఇక్కడ పరివారమును ఆనాటకప్రదర్శనమునకన్ని విధముల జయసిద్ధినొనగూర్పగలవారిని చేకూర్పింపగలరు. ఇట్లుకూర్పబడిన సమాజము ఆనాటకప్రదర్శనమును పూర్ణముగనందుకు పెట్టుబడిదారుని స్వాధీనములో నుండి యొకేనగరమునగాని దేశాటనమొనర్చుచుగాని యభినయించుచుండును. అనగా అమెరికాలో పెట్టుబడిసొమ్ము కూర్పవలయునే కాని సొమ్ముకోరికిన యెడల సాపువ్రాసి వస్తువులు తెప్పించుకొనవచ్చును ఆయానాటకముల ప్రదర్శనమంకారి జేరిన కళానిపుణులను వృత్తిసంఘములకు వ్రాసి నిర్ణీతవేతనములిచ్చి రావించి వెంటనే సర్వాంగసుందరమగు రూపకప్రయోగమారంభించవచ్చును. లండను, ప్యారిసునగరములలో నాట్యజీవుల వృత్తిసంఘములు లేవుగాని శాలాధికారులు వలయునపుడు ప్రత్యేకముగ చేర్పడిననటులను తక్కడు వారంగను కూర్చి యాడించుచుందురు. జర్మనీలో ప్రతి నాట్యశాలకు అంటుకొని ఒకనాటకసమాజము యుండును. వీరే సామాన్యముగ నాడుచుందురు. అప్పుడప్పుడు ప్రసిద్ధనటులను రావించి కొన్నియాటల నభినయింతురు. ఈపద్ధతి చెన్నపురి యాంధ్రసభను, సుగుణావిలాససభను జ్ఞప్తికితెచ్చుచున్నవి. ఇవి యామెచ్యూరు లేక నైచ్ఛికసమాజములు.

మన దేశములోనున్న మైలవరం, మోతేమున్నగు వ్యాపార సమాజములు తమ సభ్యులచేతనే నాటకములాడించుచున్నవి. ధనార్జనకు యీ పద్ధతియే మంచిది. కాని యివికూడ యూరొమెచ్యూరు కంపెనీలవలె నప్పుడప్పుడు ప్రసిద్ధనటులను రావించి, వారితోకూడి యభినయించుట కళాభివృద్ధికిమార్గమగును. జర్మనీలోని నాట్యశాలలు, అమెచూరు, వ్యాపారపద్ధతుల రెంటిని అవలంబించి వాసికెక్కుచున్నవి.

**శివర్టరీథియేటర్లు (సర్వసమర్థనాట్యసమాజములు)**

ఈ నాటకసమాజములు యూరపులోని ప్రభుత్వనాట్యశాలలవలె చక్కనికట్టుదిట్టములతో నడుపించబడుచున్నవి. నాటకములాడెడి కాలమందు పది పండ్రెండు క్రొత్త యాటలను కొన్ని పాతఆటలను చక్కగతయారుచేసి రెండురోజులకొకయాటమార్చుచు నభినయించుచుందురు. ఇందలి నటసామాజికసంఖ్య మామూలుగ నవసరమునదానికి రెండుమూడంతలు హెచ్చుగనుండును. అన్నివిధములగు పాత్రలనునేర్పుతో నభినయింపగల నటమండలిచేరియుండి నిరంతరము కళాభ్యసనమొనర్చుచుండును. ప్రతివారము మూడునాల్గురకముల ఆటలుఅనగా భావప్రధానమైనవి హాస్యప్రధానమైనవి సంగీతము రంగసౌందర్యము చమత్కారము మున్నగు నివిధావకాశముల గలిగించునాటకములు క్రొత్తవి పాతవి ఆడబడుచుండును. ఇందుచేత నవ్యప్రయోగములనష్టము పాతయాటలు దీర్చుచుండును. వారములోపుగా పురములోని ప్రజలందరు తమకెట్టి రూపకము రుచించునో దానినొకమారు చూడగలుగుదురు. ఇందుచే సకలజనాదరణము విశేషధనార్జనము నష్టపరిహారము

లభించుచున్నవి. మరియు ననేకవిధములగు నవ్యనాటకములు నష్టములేకుండ నభినయింపు అవకాశములు కల్గుచున్నవి.

ఇదేపద్ధతిమీాద అమెరికాలోని చిన్నయూరులందు స్టాకు కంపెనీలను నాట్యశాలలు స్థాపింపబడియున్నవి. రెపర్టరీ కంపెనీలలో మంచికొత్తఆటలు ప్రతియేటా నాటకప్రయోగ కాలమందు మునుముందు ప్రదర్శింపబడును. స్టాకుకంపెనీలలో వీరు ఆడిమానిన పాత ఆటలు అభినయించుప్రయోగాధికార మొంది నింపాదిగ యభినయించుచుందురు. వీరి టిక్కెట్లు పావలా మొదలు రూపాయవరకుండును. ప్రదర్శనము లంతరుచి కరముగనుండవు. స్టాకుకంపెనీలు దేశాటనమొనర్చు వాడుక కూడకలదు.

—♦ దీర్ఘప్రయోగ పద్ధతి ♦—

అమెరికాలోని నాట్యశాలాధికారులు ఒకేనాటకమును చిరకాలము ప్రదర్శించుచుందురు. విశేష ధనవ్యయమొనర్చి చక్కని నాటకముప్రాయించి అందుకు తగినసీనులు దుస్తులు కథాకాలపు వస్తుసామాగ్రి యలంకారములు మున్నగు వరికరంబుల సమకూర్చి నాటకమందలి వివిధపాత్రల నభినయించుటలో ప్రత్యేకవైదుష్య మేర్పడిన నటులను గావించి పెక్కునెలల ప్రయోగశిక్ష నొసంగి సర్వాంగసుందరమగు నాటకమును తయారుచేయుదురు. ఇందుపాల్గొను ప్రసిద్ధనటులు వారమునకు కొన్నివేలరూప్యముల వేతన మనుభవించుచుందురు. సామాన్యానుభవముగల నటులకే వారమునకు 400-1500 లొసంగుచుందురు. ఇక రంగపరికముల మీాద వెచ్చించుద్రవ్యమునకు లెక్కయేలేదు. మరియు దీనినుగ్గడించుటకు

ప్రసిద్ధవిమర్శకులకును పత్రికాసంపాదకులకును మితిలేని ధనము నంగుచుందురు. నాటకమింత పెద్దపెట్టుబడితో గద్దెనెక్కుట న్యూయార్కుపురములో నలుబదిలక్షలకు పైసంఖ్య జనులుండుట రోజుకు సుమారు పదిలక్షల మాండలికవాస్తవ్యులు పనులమీద నాపురమునకు వచ్చి పోవుచుండుట మున్నగుకారణములచే నొకేనాటకమును ప్రతిదినము అనేకమాసములు ప్రదర్శింతురు. ఇందువలన కోట్లకొలది యాదాయమువచ్చును. ప్రధాననటులు ఒకటిరెండు సంవత్సరములు ఆపాత్రనే యభినయించుచుందురు. శాలాధికారులకు వచ్చులాభ మమితమగుటచే నటులకుకూడ విపరీతవేతనము లేర్పడియున్నవి. కాని ఆదేపనిగ భావావేశ మొదవకుండ బలుమారు లొకే యాట వేయుటవలన కళాప్రాశస్త్యము చప్పబడి యిప్పుడప్పియున్నది. న్యూయార్కులో రాబడి తగ్గువరకు ప్రదర్శించి యావల మండలసంచారమునకు బోవుదురు.

ఈపద్ధతిలో నటులు ప్రయోగశిక్షనొందెడి యొకటి రెండుమాసము లుచితముగ శాలాధిపుని యాధీనమున మెలగుచుందురు. ఆవల ప్రదర్శన మారంభించినది మొదలు వారమునకు యింతజీతమను ఒప్పందముమీద పనిచేయుచుందురు. నాట్యాధికారి కొంతకాలము నటులా సమాజమున కంటియుండి చూడుచుండవలెను. కాని అధికారి యిష్టముచొప్పున వారముదినముల నోటీసుమీద నటులను విడుదలచేసుకొనవచ్చును. నటుడే కంట్రాక్టుపత్రమును వ్రాయును. కానియధికారి నటులకెట్టియొడంబడిక కట్టడిని వ్రాసియివ్వడు. ఇదిమామూలు న్యాయపద్ధతులకు భిన్నమైనను నాట్యవ్యవహారాచార

ములననుసరించి యీ వృత్తికి ప్రత్యేకమర్యాదగా సంగీకరింపబడుచున్నది. ఇట్టి శాలాధికారులు తమ సమాజములలో కొందరు ఆటరిక్కలను లోకఖ్యాత కళానైపుణ్యమేర్పడిన వారినుంచుకొందురు. వేషము ధరింపవలసినను లేకున్నను వీరి పెను జీతములు ముట్టుచునే యుండును. బొంబాయి కలకత్తాపురములందలి వ్యాపార నాట్యశాల లిట్టి పద్ధతినే యవలంబించి పెద్దపెట్టుబడితో నొకనాటకము తయారుచేసి పలురూపములద్దాని ప్రదర్శించుచుందురు. కాని వీరి నటవర్గము, హంగు, శాశ్వతనియుక్తులై యుందురు.

## టిక్కెట్ల ధరలు.

షేక్సుపియరు కాలములో 1-12 అణాలవరకు నాటకపు రేటులుండెను. క్రమముగా యివి హెచ్చినవి. అమెరికాలో ప్రస్తుతము 10, 7½, 5, 2 రూపాయల టిక్కెట్లు అమ్మబడుచున్నవి. యింగ్లాండులో కూడ నిట్టి రేటులే వర్తించుచున్నవి. పట్నసీమ [illegible] మొదటితరగతి నాల్గురూపాయలకు మించదు. నాటకముల మొదటిసీటులు మూడురూపాయలలో లభ్యమగును.

## నాట్యశాలల న్యాయపద్ధతులు

రూపక ప్రదర్శనమున కుపయోగింపబడు యిండ్లన్నియు థియేటరు లనుపించుకొనును. గొడ్లసావిడిలో నొకనాడు నాటకమాడినను ఆనాటి వ్యవహారములకది థియేట రనుపించుకొని యుందుకు సంబంధించిన న్యాయపద్ధతులకు లొంగియుండవలసి వచ్చును. పలువురు చూచుచుండ రంగవేదికపై యభినయింపబడిన వాచికాంగిక ఆహార్య నృత్యగీతాభినయ

ములఅన్నిటికిని నాటకాభిధేయ మొప్పుచున్నది. దిగుడు బసలు, హోటల్లు, పననాలయములు, మున్నగు వానివలెనే నాట్యశాలలుకూడ జాతిమత వర్ణవిచక్షణ లేకుండ సర్వజనుల కభిగమ్యములై యుండును. ఇట్టి కారణములచేత నేరిగానైన నాట్యశాలకు రానీయనియెడల నిట్లు పరిహరింప బడినవాడు శాలాధికారిపై యభియోగము తేవచ్చును. ఇందుకు శాలాధికుని శిక్షించి డామేజీ యిప్పించు వాడుక కలదు. కాని సామాన్యాన్వయములో శాలాధికారి శాలలో ఎడముండినను టిక్కెట్లనిష్టముచొప్పున నమ్ముటకును అమ్మకుండుటకును టిక్కెట్లుకొనినవారిలో నయిష్టులను కారణము సెప్పకయే వారి పయికము వాపసుచేసి బయటికంపుటకును అయిష్టులను లోనికి రానీయకుండుటకును ఆచారసమ్మతమగు నధికార మనుభవించుచున్నాడు. సామాన్యముగ టిక్కెట్లను ట్రాన్స్ఫరు చేసి కొనవచ్చును. కాని ముందుగా నిట్టిపని కూడదని శాలాధికారులు ప్రకటించినచో టిక్కెట్లు కొనినవాడే సభాసనముల నధివేష్టింప నర్హుడగుచున్నాడు. యెక్కువ జనసమ్మర్ద ముండునని యూహించి కొందరు ముందుగా నెక్కు టిక్కెట్లను మామూలు వెలలకు గొని కూడలివేళ హెచ్చుధరల కమ్ముచుందురు. ఇట్టిపని మన దేశములోకూడ కొన్నిసమయములందు జరుగుచున్నది. దీని యాచోకి తెలిసిన యెడల నాట్యాధికారులట్టి టిక్కెట్లనాదరింప నవుసరములేదు. అనగా లాప్రకారము రూపక ప్రాశస్త్యమునుబట్టి లభ్యమగు నాసనయోవకాశములబట్టి శాలాధికారులే యానాటకమునకు రేట్లు వివరమేర్పరచి తగుటిక్కెట్ల నమ్మవలయును. మామూలు

రేట్లపైని వచ్చులాభము నాటక సమాజమునకే చెందవల యును కాని టిక్కెట్లగుత్తముగకొని వ్యాపారము సేయనెంచెడి మధ్యస్తులకు యీలాభముపోకూడదు. ప్రేక్షకులు రసా వేశమున రూపకసందర్భ సూచితములగు రసభావముల ననుభవిం చునపుడుసహజముగ వెలువడు స్వీయానుభవములబ్రకటింప వచ్చునేకాని అనగా హాస్యసందర్భములందు హసింప వచ్చునేకాని పనివడియల్లరిసేయుటకు నవ్వియీలలిడి కూసి బొబ్బలెట్టకూడదు. విరోధవిమర్శకులు టిక్కెట్టుకొనినను, లో నికిరానీయని యధికారముశాలాధికారుల కొప్పుకొనుచున్నది. మరియు నాటక ప్రదర్శనముల విమర్శించి పత్రికలకువ్రాయుచు కళావిమర్శన మొకవృత్తిగా పెట్టుకొని ధనమార్జించు వ్రాయ సులను రానీయకుండు అధికారముకూడ శాలాధికారులు అనుభ వించు చున్నారు. అనగా నాట్యవేశ్మలో సిగరెట్లు తిను బం డారములు పానీయమును విక్రయించెడి వ్యాపారసులు ఏవిధ ముగ నాట్య భవనాశ్రితములగు వృత్తుల నవలంబించినట్లు దలంపబడి లైసెన్సు సొమ్మునిచ్చి యుద్దెలోసంగి విక్రయాధికా రమును సంపాదించుకొను చున్నారో అటులనే విమర్శన జీవ నులు కూడ నాట్యశాలాధికారి యనుమతి వడసి కొంతసొమ్ము చెల్లించి లైసెన్సు పొంది నాటకములజూచి వ్రాయవచ్చును. నాటకవిమర్శన మాకేశమందు నాట్యకళోద్ధారక సాహితీ ప్ర చారముగగాక నాట్యప్రదర్శనాంగమగు ప్రత్యేకవృత్తిగ నెంచ బడుచున్నవి.

నాట్యశాలలలో పోలీసుఅధికారము సంపూర్ణ ప్రభావమున చలామణియగుచున్నది. నాట్యశాలలకును రూపకప్రదర్శనము

లకును, స్థానికప్రభుత్వములే లైసెన్సునొసంగ దక్షులయ్యును ప్రదర్శనసందర్భమున గూడెడి ప్రేక్షకజనులకును శాంతవర్తన మందుంచుటకును ప్రదర్శనసందర్భమున గలిగెడి యితరవిష యముల గాచుటకును సర్వాధికారము రాష్ట్రపరిపాలనకు చెం దియున్నది. ప్రదర్శనమునకు ముందుగ నాటకములను విమ ర్శించి యందలియనిష్ట విషయముల దొలగించు అధికారము కొన్ని ప్రభుత్వములు స్వీకరించియున్నవి. మరికొన్ని రాష్ట్ర ములిట్టి యధికార ముపయోగింపవు.

## ఉచితనాట్యాలయము

ఫ్రెంచిదేశమున నాట్యకళకుత్తమ సౌందర్యమొసంగు చుండెడి ఫ్రెంచిజాతీయ నాట్యాలయమును గూర్చి పరిశీలించి యున్నాము. ఇదికాక 1887 లో యాంఢ్రీ ఆంటోయిను (Andre Antoine) అనువాడు ఏకాంక నాటకముల నుచితము గ ప్రదర్శించు నాట్యశాలనొకదాని నెలకొల్పెను. అక్టోబరు మొదలు జూనువరకు ప్రతిసంవత్సరము నెలకొకయాటచొప్పు న కొత్తనాటకముల ప్రదర్శించు చుండురు. ఇందుకు టి క్కెట్లమ్మబడవు. కొందరు నాటకాభిలాషులు చందాలువే సుకొని తల ఎత్తు మొదలిడిన శాఖకవులకును నవ్యనాటక రచయితలకును ప్రయోగావకాశము లమర్చిప్రోత్సహించుట కీ సమాజమేర్పరచ బడినది. మరియునాట్యకళ యొక్క నిండువి ప్లవము, అనంత రామణీయకమును సర్వతో ముఖముగ బెంచి వికసింపజేసి పరీక్షింపు నుద్దేశ్యముతో నీసమాజము పని సేయు చున్నది. ఇంతియేగాక నైతిక రాజకీయనిర్బంధనల యొత్తిడిచే

రాజ్యనాట్యాలయములందు బ్రదర్శింపనీయని భావప్రచారమిందు నజరుగుచున్నది. ఈవిషయమును కొంతజనవిరోధమునకు బాత్రైనను కళాపరిపాకమున నశేషయశస్సు సంపాదనమొనర్చియున్నది. నాట్యకళానియమముల నుల్లంఘించి స్వభావనిరూపణమే పరమసాధ్యముగ నెంచి నిర్ణీత కథాంశమును మాత్రముల్లమున నుంచుకొని సందర్భోచితముగ నప్పటికప్పుడు భావించిన పలుకుల నుచ్చరించుచు కథాసందర్భములు సూచించు జీవితావస్థలను విభావమునచే నూహించి జీవించి యనుభవించి యభినయించుచు నటులాత్మీయ కల్పనాచాతుర్యమున వాచికాభినయముల బ్రవర్తించుచున్నారు. ఎనిమిదేండ్లలో 150 క్రొత్తయాటలను వ్రాసియభినయించిరి. వీనినావల నితర సమాజములు గైకొని యభినయించుచున్నవి. జోలా, శాన్కోర్ట్సు, మొండా, బర్గరాట్, ఇబ్సెను, టాల్స్టాయి, యాంటోయిను, మున్నగు ప్రసిద్ధనాటక కవుల తొలకరి యాటలీ యుచిత ప్రయోగశాలలలో మున్ముందభినయింప బడినవి. దీనియనుకరణమున నితరదేశములలోకూడ నుచితనవ్యరూపక ప్రయోగాలయము లేర్పడుచున్నవి. నాటకకవులు, ప్రసిద్ధ నటులు, రసికపోషకులు, విఖ్యాతవిమర్శకులు మున్నగు నాటకకళాభిలాషులు యీసమాజముల ప్రదర్శనమున కాహ్వానింపబడుచుందురు. మరియు ప్రయోగపరీక్ష ముగిసి నాటకముచితరీతుల సంస్కరింపబడిన వెనుక వీలుచొప్పున పురములోని నాట్యాభిలాషు లుచితముగ నీక్రొత్తనాటకములజూచు నవకాశము లమర్పబడును.

## —ప్రయోగ క్రమము—

నటులను జేర్చిప్రయోగశిక్షనొసంగ వలసిన రంగ విర చనమొనర్చు రూపక ప్రదర్శన వ్యవహారమంతయు కొన్ని నాట్యశాలలలో సర్వాధికారహాస్య పారంగతుడగు సూత్రధా రునిచే వ్యవహరింపబడుచున్నవి. అన్ని విషయములు నడి పించు పెద్దతలకాయి సామాన్యముగా నుత్తమ నాట్యశాలల న్నిటియందు సర్వాధికార ప్రభావమున నేతయై ప్రత్యేకకళా కుశలురగు శాఖాధిపతుల నడిపించుచుండును. ఇప్పటి నా ట్యప్రయోగము రెండు పద్ధతులమీద నడచుచున్నది. నిత్యజీవన సందర్భములను స్వభావవైచిత్రముతో నగుపరచు పద్ధతియొకటి. కొన్ని యభినయ సాంప్రదాయముల ననుసరిం చిలక్షణసమర్థమగు నభినయరీతులలో ప్రియదర్శనంబుగ చి త్రాలంకార విరాజితంబుగ గూర్పబడిన విచిత్రరంగ స్థలంబున శ్రవణేంద్రియ కుతూహలముప్పతిల్ల గర్ణపేయముగ నమర్చబ డిన గీతికాచమత్కార సౌందర్యముతో నన్నిటి చిత్రబంధన స్వరూపము లతిశయిల్ల నభినయించెడి ప్రదర్శన పద్ధతులుకూ డ కలవు. అట్లగా స్వాభావికప్రదర్శన మొకవంకను కళా ప్రపూర్ణ నాటకవిలాస మొకవంకను పాశ్చాత్యసమాజముల గౌరవ మొందుచున్నవి. కళాప్రధానమగు కల్పనలు లక్షణ మర్యాదలను దాటించి స్వభావసాంగత్యమునకు దూరమగు చున్నవి. స్వభావప్రదర్శనములం దనేక తెరవు లగుపడును. కొందరు చిత్రాచిత్ర యవస్థల సమకూర్ప యత్నింతురు కొందరు అభినయాంశమున కనుకూలమగు పరిసరంబుల గూర్చి వాచికమందు వెలుగొందు ప్రధానభావ ముద్దీపింపు

రీతిగ రంగమమర్చుచున్నారు. అనగా ప్రతిసీనులోని దుస్తులు అభినయమునై ఖురులు, తెరలు, చిత్రములు వానిపై వ్రాసెడి లేవెలుంగులు ఆసీనులోని కథాంశమున రాజిల్లు భావముల కనుకూలముగ నేర్పరచబడును. యీ భావన ప్రభావమున వాచికాంగికముల కెక్కుడవకాశము లేర్పరచు షేక్సిపియరు మార్లోగు మున్నగు కవులనాటకములు ఎలిజబెతునాటి తెల్లతెర గద్దియపై నాడబడుచున్నవి. ఎట్లైనను రూపకలక్షణము ననుసరించియు అందలి ప్రత్యేక సందర్భముల బట్టియు రంగవిరచన మేర్పరచుచున్నారు. స్వభావప్రదర్శనమందున టులుజీవితావస్థలననుభవించిన తెరంగున స్వేచ్ఛమై జరించుబలనిజప్రతిభాసహాయమున విభావానుభవముల స్వతంత్రించుచునారు. రమ్యప్రదర్శనము లందు రంగవిరచనము గీతికాప్రయోజనము, వాచికాంగికములు వృచ్ఛాకాణము మున్నగు విషయము లన్నియు లక్షణమర్యాదలనుసరించి నడుపబడుచున్నవి. నాటకసమస్యలను జర్చించుటకును రూపకప్రదర్శనము శేషకళా విచిత్రవైభవంబున సర్వజనాదరణీయమై నిరుపమ రామణీయకమై వెలుగొందజేయుటకును వివిధకళలం దారితేరిన మహాసమర్థులు నాట్యసేవలోదమశక్తియుక్తుల గనపరచ నియమింపబడుచున్నారు.



# ఆటనెలవులు.

## నాట్యమందిరములు

యూరపులోని ప్రధాన నాట్యశాలలు శిల్పిచాతుర్యప్రమేయ బాహ్యాంతర శిల్పాలంకారములతో ...నీయసౌధరాజములుగ గట్టబడియున్నవి. అమెరికాలోని నాట్యశాలలు శిల్పాలంకారమందు కొఱవడినను ప్రేక్షకుల కెక్కుడు సౌకర్యమేర్పరచుచున్నవి. యూరపులోని శాలలు బెంగుళూరు దొడ్డన్నహాలువలె, చెన్నపురి మ్యూజియము థియేటరువలె విశాలమగు నావరణలో కట్టబడినవి. అమెరికాలోని నాట్యమందిరములు పెద్ద వీథుల వెనుకపట్ల నిండ్లమధ్యగున బెజవాడలోని సీతారామాంజనేయ నాటకశాలవలె కట్టబడియుండును. ఇందుచేత వీనిని బాహ్యాలంకారశోభితంబుగ నొనర్ప శిల్పసంకల్పములోడమలేదు. యూరపులో మిక్కిలి విశాలమైన నాట్యశాల మిలాన్ నగరమందలి స్కాలామందిరమైయున్నది. ఇందు 3500 ప్రేక్షకులు సుఖముగ కూర్చుండవచ్చును. న్యూయార్కు పురములోని హిప్పోడ్రోమ్ నాట్యశాలలో

5000 మంది చేరగలరు. కాని యివి రెండును గేయరూపకమున కనుకూలించినంతగ వాచిక ప్రదర్శనముల కనుకూలింపవు. నాట్యశాలల గట్టుటలో ప్రతిధ్వని స్వరవిభంగము శబ్దకాలుష్యము మున్నగు దురవస్థలు కలుగకూడదు, ప్రేక్షకులందరికిని చక్కగ వినబడునట్లు శాలాపరిమాణములు నిర్ణయింపబడవలెను. దీని లెస్సగ యోజించక కట్టిన నాట్యవేశ్మల నుపయోగములగుచున్నవి.

వాచికనాటకము లభినయించు శాలలు 1000—1500 ప్రేక్షకుల కాసనములగు నైశాల్యమున కట్టబడుచున్నవి. నాట్యకళాప్రయోగశాలలు 400 మంది కూర్చుండ నెలవిచ్చునవి చాలును. కొన్ని శాలలు 100 ప్రేక్షకులు కూర్చుండ నేర్పరుపబడుచున్నవి. ఇటీవల యమెరికా పద్ధతుల ననుసరించి యూరపు బహుళ ప్రదర్శనాలకు సౌధనిలయములు నిర్మింపబడుచున్నవి. ఆ పెద్ద మందిరములు 3000 జనుల కనుకూలముగ గట్టుచున్నారు.

నవీననాట్యశాలలలో రంగస్థలము, సభాంగణము, నడవలు, విశ్రమించు గదులు, ఉపాహారముల విక్రయస్థలములు మున్నగునవి ప్రధానాంశములై యున్నవి. సభలోని జనులందరు విశదముగా జూచుటకు కొన్ని నాట్యశాలలు గుఱ్ఱపునాడావలె కట్టబడి వీనిలో మంచెలుకూడ నమర్పబడియున్నవి. మంచెలు అనగా బాల్కనీలు లేక గ్యాలరీలు అర్ధవలయాకారమున పొడుచుకొను అనేక అంతస్థులుగ నమర్పబడియుండును. ఈపద్ధతి యిటలీదేశపు ఆపెరామందిరముల సామాన్యలక్షణమై యున్నది. ఆసనములు వలయావృత్తముల నమర్పబడి

యుండును. ప్రస్తుతము వలయాకారమున నాట్యమందిరముల నిర్మించు యాచార మంతరించుచున్నది. సభాంగణము, బాల్కనీలు, నిలువుగ కట్టబడి యాసనములు అడ్డముగ కూర్పబడుచున్నవి.

## సభాంగణము

దీనికట్టడి ప్రస్తుతము జర్మనుపద్ధతుల ననుసరించి జరుగుచున్నది. నిలువు హాలులలో అడ్డముగ సీటులనుర్చి ముందు నుంచివెనుకకు తరుచుగలేచు సోపానవేదిక లుండును. అనగా హాలులో వెనుకకూర్చుండు వారుప్రతి వరుసలోని వారికి విశదముగ నాటకమగుపడునట్లు రెండేసి వరుసల కొకయడుగు వాలుతో మెట్లుగా సభాంగణమునిర్మింపబడి యుండును. ఇట్టినాట్యసభలను ఆంఫీ థియేటరులందురు. ఈశబ్దము వలయాకారమున గట్టబడిన ప్రాచీననాట్యవేశ్మల సూచించునదయ్యు మపరిస్తుతార్థమున సోపాన వేదికా పరంపరలుండు నిలువు హాలులకుకూడ చెందుచున్నది. ఇదివరకు ఎక్కువఖరీదుగల్గి బంధు జనంబులు ప్రచ్ఛన్నముగ గూర్చుండు ప్రత్యేక వసతులు రంగపీఠమునకు అత్యంతకముగ నుంచబడెను. ప్రస్తుతమిది హాలువెనుకకు జరుపబడినది. అనగా సెనీమా కంపెనీల యందు వర్తించు పద్ధతి నాట్యశాలల ప్రవేశించినది. కాని మంచితరగతిసీటులు నాట్యశాలకు మధ్యగానుండినయెడల ప్రదర్శనము చక్కగనగుపడుటకును అభినయ విశేషములుగోచరించుటకును వాద్యఘోషకర్ణ కఠోరముగ నుండక శ్రావ్యమై వినుపడుటకును అలవియగును. గ్యాలరీలు సభావేదిక కన్న ఎక్కువ వాటముగనుండవలెను. నాట్యశాలల గోడలు

నూటిగను, సన్నగను, నుండవలెను. అలంకారము లెక్కువైనచో నానాభ్రంశమేర్పడును. వీలైనంతవరకు సభావేదిక కఱ్ఱ పలకలతో గట్టవలెను. నేలమీఁద తివాచులు, గోడలకు వస్త్రాలంకారములు ఉండకూడదు. ఇవి శబ్దమును మందగించి వినపడకుండ చేయును. నవీన నాట్యశాలలలో సభ్యులు వలయునపుడు విశ్రమించుటకు పచారు చేయుటకు ఉపాహారముల గైకొనుటకు ప్రత్యేక సౌకర్యము లమర్పఁబడి యుండును.

## రంగస్థలము

రంగస్థలములో పరికరముల నిలువజేయు గదులు వేషముల ధరించు గదులు, విమానాదులు సంచరించుటకును విపరీత రంగ విభ్రాంతినొనఁగూర్చుటకు వేదికక్రిందుగ నొకపెద్దగోయియు పైన విశాలమగు మంచెలు చేర్చియుండును. ప్రదర్శనము జరిగెడి ముఖ్యరంగస్థలము ప్రొసీనియము అనబడుచున్నది. ఇది 28–36 అడుగుల వెడల్పు 15–22 అ॥ ఎత్తు 20–25అ॥ పొడుగు కలిగియుండును. కొన్ని చిన్న నాట్యశాలలలో 10 అడుగుల పొడుగు మాత్రమే యుండును. ఇదివరకు 'రంగస్థలపు పైకప్పు' ప్రొసీనియము ఎత్తునకు రెట్టింపుగ నుండెను. తెరలు చక్రములు, చుట్టకుండ మీఁదికి లేపుచుండిరి. కాని యిప్పుడు అట్టి యధికతరపు ఎత్తు అవసరము లేదు. ఇప్పుడు సాధారణముగ రంగస్థలము రెండు పెట్టెలలో నమర్పబడుచున్నది. ఈ పెట్టెలు పైనుండి క్రిందికి, రైలుబండ్లవలె సద్దుముగ జరుపవచ్చును. ఒకరంగము ప్రదర్శించుచుండ రెండవది సైడువింగు లోపల మరుగుపడియుండును. దానిలో తరువాతిరంగము ముస్తా

చుందురు. మొదటిరంగము ఆడుటముగిసి నంతనే బండిని ముం దునకు త్రోయుదురు. అప్పుడు రెండవరంగము సపాత్రకముగ సభాముఖమున వచ్చినిలచును. ఇదివరకు రంగస్థలము వెనుక నుండి ముందునకు వ్రాలునట్లు చేయుచుండిరి. ఇందు వలన వెనుక భాగములో కూర్చుండియు, బండుకొనియు, నభినయించుపాత్రలు ప్రేక్షకదృగ్వీధిలో స్పష్టముగ నగుపడు చుండిరి. నానాటికిరంగస్థలము పెరుగుచున్నది. నవీనశా స్త్రోపకరణముల సహాయ మొందుటకు నాట్యయంత్రముల నుపయోగించు కొరకును రంగస్థలము కడువిశాలముగ నేర్పరచ బడుచున్నది. ఇప్పుడు ముప్పదైదుయార్డుగులకు తక్కువ గాకుండ రంగస్థలపుపొడుగు యేర్పరచుచున్నారు.

తెరలను, చుట్టుటకు చట్రములను లేపుటకు దిం చుటకు కప్పీలు, త్రాడులు, రంగోపరిభాగమున నమర్చ బడియుండును. సైడ్వింగులు జరుగుటకుయిదివరకు రంగ పీఠమున గుల్లపట్టాలు వేయబడియుండెను. ఇప్పుడు పెట్టెల లో వెనుకనుంచిగాని, ప్రక్కనుంచిగాని, తరువాతి రంగ మమర్చబడుచున్నదిగాన యిట్టిపట్టాలవసరములేదు. రంగ స్థలమునకు వెనుకభాగము వలయాకారమున నున్ననిసున్నపు గోడకట్టబడి దానిపై నొక విమానము కల్పింపబడును. దీని మీద వనచిత్రము రంగులతో వేయబడును. ఈ గోడవలన వాచికము స్పష్టముగ సభ్యులకు జేరగలదు. దీపముల వెనుక నుండు వలయదర్పణములు కాంతిని కూర్చి ముందునకు బంపు నట్లు గుండ్రనిగోడ వాచకశబ్దమును పెంచి ముందునకందిం చును. ఏదైన నొక దీర్ఘప్రయాణమును సేయునట్లు చూప

వలసినచో పాత్రలు చూచిన నిసర్గదృశ్యములు వరుసగ సభ్యులకు గోచరించుటకు తెరలుపోడుగాటి గుడ్డమీద చిత్రింపబడి యిరుప్రక్కల నమర్పబడిన నిలువు యిరుసుల మీద చుట్టుకొనుచు దృశ్య పరంపరను జూపునట్లు కల్పింపబడుచున్నవి. కొన్ని నాట్యశాలలలో ఎలెక్ట్రిక్కు లిఫ్టు పద్ధతిన మూడంతస్థులుగల పెట్టెలు రంగస్థలమును యేర్పరచుచున్నవి. వీనిని దింపి లేపుచుందురు. ఒకదానిలో ఆట జరుగుచుండ మిగిలిన కంటిలో తరువాతి రంగముల గూర్చుచుందురు. మరికొన్ని నాట్యశాలలలో రంగస్థలము నలుబది యైదు అడుగుల మధ్య కొలతగల వలయ పీఠముమీద నలువైపుగ ముల నమర్పబడియుండును. ఈపీఠము చక్రముల మీద రైలు యెంజనిను త్రిప్పెడి టరంటేబులువంటి గోతిలో పట్టాల మీద సులువుగ దిరుగగలదు. రంగ ముఖమునకు యిరువదైదడుగుల వెడల్పు మాత్రమే కావలయును. గాన యీ వలయ పీఠమున నలు ప్రక్కల నాల్గు ప్రత్యేక రంగములు అమర్చు స్థలావకాశ మేర్పడుచున్నది. ప్రయుక్త రంగము పూర్తి కాగానే పీఠమును త్రిప్పెదరు. క్రొత్త రంగము సభాభిముఖమై నిలచును. ఇట్టి యేర్పాటులవలన సావకాశముగ స్వభావ సిద్ధముగ నందముగ రంగముల గూర్చెడి యవకాశ మమర్చుచు నాటక రంగము లొకదానివెనుక నొకటి త్వరితగతిలో నరుదెంచి కథా సంధర్భ మవిచ్ఛిన్నముగ దోప జేసెడి యవకాశములు కలుగుచున్నవి. రంగ చిత్రములు ప్రకృతిలోని రమ్యావస్థలను స్వభావ వైచిత్ర్యమున ననుకరించు వేడుకతో గూర్పబడుచుండెను. ఇప్పుడు

క్రియముగ ప్రకృతి ననుకరించెడి వాడుక తగ్గి భావసూచకమగు కల్పిత చిత్రములు రంగ శేఖనమందు గారవింపబడుచున్నవి.

## వెలుగుసొబగులు

ప్రొసీనియము లేక రంగముఖమునకు ఎదుట నుంచబడిన ఎరుపు, ఆకుపసుపు, ఊదా, తెలుపురంగుల విద్యుద్దీపములు, సామాన్యముగ వాడబడుచున్నవి. వీనికాంతిని తగ్గించి హెచ్చించుటకు ఏర్పాటులున్నవి. రంగుదీపములవలన వాచిక భావమునకు సరిపోవు పరిసరమేర్పరచబడును. వీనిని ఫుట్టులైటులందురు. సైడువింగులలో నెకుప్పకప ప్రకాశముగల ఆర్కుదీపములు ఆడుచున్నటుల మోముపై వెలుగుసొనల గురుపించుచుండును. ఇవికాక గ్యాలరీలోను జ్వలసుధా ఖండదీపమొకటి వలయునప్పుడు కమనీయచంద్రికా ధావళ్యమొప్పెడి తేజః పుంజముల విసరుచుండును. ఈ పద్ధతులన్నిటిలో దీపముల కాంతి సూటిగ నటవర్గముమీద ప్రాలుచుండును. జర్మనీలో సభాంగణమును రేచీకటియందుంచి తెల్లని పటముపై విద్యుద్దీపముల వెలుగుపడనిచ్చి పటముఖంబున బ్రతిబింబించిన లేవెలుంగుల రంగస్థలముమీద వ్రాలునట్లు చేతురు. మరియు రంగమందచ్చటచ్చట గుప్తముగ మబ్బుటద్దముల చాటున వెలుగు విద్యుద్దీపముల వాడుచున్నారు. ఈరెండు పద్ధతులలో నాట్యరంగము పగటి యందమున లేతవెలుగున గాంభీర్య సౌందర్య మీనుచుండును.





# ఆట తెరవులు.

## బర్మాలోని నాట్యపద్ధతులు

షవేయో అను బర్మాదేశపు విమర్శకుడు, The Burman (బర్మాదేశీయుడు) అను పుస్తకపు 29 వ అధ్యాయమందు బర్మాలోనాడబడు Pewes పవేలను రూపకప్రదర్శనములగూర్చి విశదముగ జెప్పియున్నాడు. ఇవి బర్మీయుల జాతీయవినోదములుగ నాసికెక్కియు మహారూపకములుగ నాడబడుచున్నవి. జాట్ పవే అనురీతియాటలో అభినయము, సంగీతము, హాస్యము, నృత్యము, చేరి యుండి నటులచే నభినయింపబడును.

యోక్తేపవే లనురూపక ప్రదర్శనమందు నటులు తెర చాటునుండి పాడుచు వాచికముచ్చరించు చుండ బొమ్మలు, రంగస్థలంబున నృత్యాభినయముల సలుపుచుండును. ఈనుపవేలనురూపకములందు పలువురు యువతీయువకులు పాడుచునభినయించుచుండుదురు. అన్యీనుపవేలనురూపకములందు కొద్దిమందినటులభినయించు చుందురు. ఇవి రాత్రితొమ్మిదిమొదలు

తెల్లవారు జామువరకు ఆడబడును. ఈనుపవేలు పెద్దఅధికారుల వినోదముకొరకును, ఆలయోత్సవసందర్భములందును మాననీయ సురుచిరనిశా వినోదముగ ప్రదర్శింపబడుచుండును. మిగిలిన మూడురకముల బర్మీయనాటకములు వెన్నెల రాత్రులందు బర్మాలోని గ్రామ పట్టణంబు లన్నిటియందు నాటబడుట నాడబడుచుండును. ఈవినోదములు వరుసగా ననేక రాత్రులు జరుగుచుండును. మనదేశములో భాగవతము లాడించునట్లు నెవరో యొకధనికుడు నటుల బహూకరింపనేర్పరచికొనును. ఆటకు గ్రామస్థులందరు రుచితముగ వచ్చిచూచుచుందురు. ప్రేక్షకులు పెందరాడిభుజించివచ్చి తెల్లవారు దనుక ప్రదర్శనప్రదేశమందే గుమిగూడియుందురు.

The Burman అను పుస్తకము లభించినయెడల "రూపక రసాల" మందిబర్మీయ వినోదముల కథాకల్పనాదికముల విస్తరింప యత్నించెదము.

## చీనా దేశము

ఇచ్చట కావ్యము, చరిత్రము, వేదాంతము మున్నగు సారస్వత వైఖరులుచాల ప్రాచీనకాలమున మొలకెత్తి సుస్వరూపములంది జెన్నొందియుండినను A. D. 13, 14. శతాబ్దములలో మంగోలియనులు చీనాదేశము నాక్రమించుకొనిన కాలములో మాత్రమే నవలలు నాటకములు మున్ను మొదలే ర్పడినవి. మొలకెత్తి సత్వరముగ విస్ఫాంది పరిణతావస్థననుభవించినవి. ఈ కాలములో జనించిన ననంఖ్యాకములగు చీనా నాటకములందు The Story of the Western pavilion అను శృంగారప్రధానరూపకము మిక్కిలి వన్నెకెక్కియున్నది. ప్రాచీన

చీనానాటకము లీనాడా దేశమున నాడబడుట లేదు. ఇవి ఒక గంటలో ప్రదర్శింపదగిన పరిమాణమున నున్నవి. కొన్ని పెద్దనాటకములుకూడ నగుపడును గాని యవి సామాన్యముగ ప్రదర్శింపబడ లేదు. కడచిన 700 సంవత్సరములలో చీనాదేశపు సారస్వత విశేషములన్నిటితో బాటు నాటకములుకూడ చేవ తప్పి క్రమముగ హీనదశనొంది యున్నవి. ప్రస్తుతము చీనా దేశమందు బయస్కోపులున్నగు నవ్యరూపకపద్ధతులు, చీనాదేశపు ప్రాచీన జాతీయ రూపకవైఖరుల ననుసరింపని క్రొత్తరుచులు ప్రబలమై యున్నవి.

## జపాను

17 వ శతాబ్దములగాయతు జపాను దేశమున నాటక రచన నారంభించినది. ఇచ్చట మతవిషయము ప్రధానముగ గల ప్రాచీన నాటకములు కొన్ని ఇంకను ఆడబడుచున్నవి. వీనిని నో నాటకములందురు. మరియు ప్రజారంజకములగు నితర రూపకపద్ధతులు కొన్నియు కలవు. ఇవికాక మంచి కట్టుదిట్టములతో వ్రాయబడిన నాటకములు పురాణేతిహాస సాంఘికకథల నిరూపించునవి కూడ ఆడబడుచున్నవి. డాక్టరు కజన్సు The New Japan అను గ్రంథమందు జపానుదేశపు అధునాతనరూపక ప్రయోగరీతుల నభివర్ణించియున్నాడు. అందలి ముఖ్యాంశముల నిచ్చట నుదహరించుచున్నాము. జపానులో పాశ్చాత్యసారస్వత మశేషముగ ననువాదరూపమున వ్యాపించుచున్నది. వీనియాదర్శమైన జపానుల కావ్యరూపక విరచనము ప్రాచీనపద్ధతులకు భిన్నమగు క్రొత్త దారుల నవలంబించుచున్నది. ఈనాటి జపాను నాటకములందు స్త్రీపు

ఋషుల పరిణయవృత్తాంతము తెల్లమగ జేయుచున్నవి. ప్రాచీనరూపకములు యుదారేతివృత్తములు చక్కని విశుద్ధ రామణీయకమగు కథాంశములఁగూర్చుచుండ నిప్పటినాటకము లువిషయ విభావన భరితంబులై యున్నవి. నిసానే అచ్చుము వకోజీ అనుకవి వర్యుని నాయకత్వమున బౌద్ధసిద్ధాంతము లను ప్రతిపాదించు చిన్నిరూపకములు జపానుల జాతీయ సారస్వత రుచులతో గ్రమ్మర గల్పింపబడుచున్నవి. ఈప్రయత్నము దినదినమభివృద్ధినొందుచు భావికాలమున జపానీయ రూపకమునకు ప్రత్యేక జాతీయస్వరూపమును నవీనజీవనపద్ధతుల కనుకూలమగుదానిని గూర్పగలదని నమ్ముచున్నాము.

“నో” రూపకము జపనీయుల ప్రాచీన కావ్యాలంకారముల ననుసరించిన కట్టడిలో మత సంబంధమగు సిద్ధాంతములను గాథలను ప్రతిపాదించుచుండును. ఇందొక గానమేళము రసవత్సందర్భములందు హంగు గావించుచుందురు.

జపాను రాజధానియగు టోకియో నగరములోని యింపీరియలు థియేటరునందు ప్రదర్శింపబడిన రూపకవినోదము నొకదానిని డాక్టరు కజిన్సు వర్ణించియున్నాడు. అచ్చటి రంగసౌందర్యము దుస్తులు, తెరలు, మున్నగువాని వర్ణశ్రుతియు కథానురూపమగు పరిసరంబుల గల్పించు నేర్పు మిక్కిలి మనోహరముగ చిత్రకళారహస్యముల గుర్తించిన విచక్షణతో గూర్పబడి యున్నవి. ఇందు జపానీయుల రంగవిరచన సామర్థ్యము వివిధభంగముల చిత్రోచిత రూపములందు దాల్చెడి నటాభ్యాసము పాశ్చాత్య కళాసిద్ధిని మించుచున్నవి. నటులు గుంపులుగ గూర్చుండి చివాలునలేచి మరియొక సుందర వ్యూ

హ

హమున జేరుచుందురు. నీసులు అభినయము చాలవరకు
స్వాభావికముగ నున్నను కొన్నిపట్ల నాట్యమర్యాద లగుపడు
చుండును. రంగస్థలములో మార్పులు గావించుటకును నటుల
దుస్తులను సర్దుటకును పడలంతయు నల్లని ముసుగెట్టిన పరిచా
రకుడొకడు చల్లగ రంగస్థలంబును జేరివలసిన మార్పు
గావించి యొకప్రక్కకొదిగి నిలుచుండును. ఈతడు నటవర్గ
మున జేరనివాడు అదృశ్యుడు అని తెలియుటకు నల్లని
ముసుగుదాల్చి యున్నాడు. అప్పుడప్పుడు గాయకమేళము
కథారసమును పోషించుకొరకు నటులతో పాటు పాడుచుం
దురు. తెర వ్రాలునపు డొకమారపి రంగముఖమునకు ప్రా
కుచు వచ్చి రెండు చిత్రలతో తాళవినోద మొకింత సేపు జరపి
పోవును. జపాను నటులు ధరించెడి దుస్తులు మిక్కిలి రమ
ణీయముగ నున్నవి. కజిన్స్ చూచిన ప్రదర్శనములో మొ
దటియంకము చారిత్ర విషయికమగు భావప్రధాన రూపకమై
యుండెను. రెండవ యంకమందు జపానీయుల నవీన సాం
ఘిక జీవనమునకు సంబంధించిన హాస్యవినోదమై యుండెను.
జపాను కవులు పాశ్చాత్యనాటకముల ననుకరించినను అందలి
తత్వమును మాత్రమే స్వీకరించి కథాంశమును తమ జాతీయ
సమస్యల కనుకూలముగ మార్చి యభినయించుచుందురు.
ఇదివరకు జపానులో స్త్రీ వేషములు పురుషులచే దాల్ప
బడుచుండెను. యిందుకొరకు కొందరు బాలురు ప్రత్యేక
ముగ శిక్షింపబడుచుండిరి. ఇప్పుడు స్త్రీలు సర్వసామాన్య
ముగ నటీవృత్తి నవలంబించుచున్నారు. జపానులో వారి ప్ర
త్యేక చిత్రకావ్యలక్షణములు జీవనమర్యాదలు నాట్యరంగ

మున బ్రవేశించి విచిత్ర సుందరములగు రూపకముల నేర్ప రచుచున్నవి.

## ప్రాచీన ప్రాచ్య దేశములు.

ఇటులనే పరిషియా, అరేబియా, టర్కీ మున్నగు ప్రాచ్యదేశములలో బూర్వకాలమున నొక్కొకరీతి నాటక సారస్వత ముదయించి యుండెను. ప్రస్తుతము మనదేశమందువలెనే పాశ్చాత్యసభ్యతా సంపర్కమున నచ్చటి నాట్యపద్ధతులు కొంతదరి నవ్యవైఖరుల నడచినవి. నవీనజీవన పరిస్థితులకును, జగన్నాగరక సమ్మేళనమునకును, ప్రత్యేక జాతీయతా సంరక్షణమునకును, ప్రస్తుతమన్ని దేశముల కావ్యశిల్పాది ప్రయత్నములు మితిలేని యావేశన మొందుచున్నవి.

నాట్యప్రచార మన్ని దేశములలో కాలములలోగలదు గాని నాటకసాహిత్యము మాత్రము సార్వత్రికముకాదు. అనుకరణప్రవృత్తి సాహిత్యశాసనములకు లోబడునపుడు నాటకముల రూపపరిమాణ మేర్పడును. మానవనైజమగు నవస్థానుకరణతోపాటు కథోపకథనము వార్తాలాపము జేరినప్పుడే నాటకము సాహిత్యాంశమగును. నృత్యగీతముల నుండి నాటక ముత్పన్నమైనది. ఇవి రాసలీల భాగవతము యాత్రలు బర్మియుల వవేరూపకములందు ముఖ్యాంశములు మహాకావ్యములు, గీతకావ్యములనుండి, వాచిక ప్రధానమగు రూపకము లేర్పడినవి

చీనాదేశములో పంటకాలమున ధార్మికోత్సవము జరుగును. బర్మా జపాను దేశములలో నాటునమయమున నిట్టి దేవతారాధనలు అంకుకంగముగ నృత్యగీతములు జరుగుచుం

డును. ఇండియాలోని హోలీపండుగ గోధుమపంట తరువాత ప్రజాసంతోషమును తెలుపుట కేర్పడినది. కొన్ని దేశములందు పితృదేవతలగు మృతవీరులను చచ్చిన ప్రేతములను సంతృప్తిపరచుకొరకు కొన్ని విధములగు రూపకము లేర్పడినవి. జపానీయుల నోరూపకములు గతించిన జాతీయవీరుల సంస్మరించుకొరకేర్పడినవి. ఇవి దుఃఖాంతముగనో వియోగాంతముగనో బరిణమించుచుండును. పెరూ బొలీవియా, బ్రెజీలు దేశములలో పితృకార్యములపట్ల నృత్యగీతములు సలుపు యాచారము లున్నవి. ఇటులనే ప్రపంచములోని వివిధసభ్యతా వికాసము లనుభవించెడి సమస్తదేశములలో పండుగలపట్లను పితృదేవతోత్సవసందర్భములందును నృత్యగీతాభినయముల ప్రయోగ మగు పడుచున్నది. ఇందుచే నాట్యకళ మానవస్వభావమగు ననుకరణముదుదయించి నృత్యగీతములతో మొదలిడి కావ్యకలావైవిధ్యమేర్పడిన దేశములందు పరిణత రూపకస్వరూపముల దాల్చెనని నిశ్చయమగుచున్నది. తొల్లి దేవతారాధనమందంకురించిన రూపకబీజములు తరువాతి వికాసములో జాలనరకు దేవతాగణంబుల లీలావ్యాపారములను వీర పురుషుల మహోదారచరిత్రములను నిరూపించునవై యాపల గాలక్రమమున ప్రజాదర్శములు ప్రత్యేకవ్యక్తుల మహోన్నతిని గౌరవించుపద్ధతులు వదలి ప్రజాసామ్యమును గౌరవించెడి కాలమేర్పడ సామాన్య సాంసారిక సందర్భములను సాంఘిక సమస్యలను కథాంశముగ గైకొనుచున్నవి. నాటకచరిత్ర మిట్టి పర్యవసానము పొందుచున్నది. భారతభూమిలో

కూడ సాంఘికరూపకమే నవీననాట్యప్రియత్నముల పరమా వధి కాగలదు.

బాబూ శ్యామసుందర దాసుగారు హిందీభాషలో రచించిన

"సాహిత్యా లోచనము."

అను గ్రంథములోని ఆరవ ప్రకరణమునందు దృశ్య కావ్య వికాసమునుగూర్చి చెప్పబడిన ముఖ్యాంశములు యీ దిగువ నంతరించి జేర్చియున్నాము.

భారతీయుల నాట్యకళ వేదములనుండి వికశించినది. ఋగ్వేదము నుండి నాట్యసంభాషణ మేర్పడినది. సామవేదము నుండి గానము, యజుర్వేదమునుండి నాట్యము, అధర్వణవేద మునుండి రసము, ప్రభవించినవి. వీని సమ్మేళనమున భారతీయుల నాట్యవేద మంకురించి వైవస్వత మనువుకాలమునకే ప్రత్యేక కళాప్రాముఖ్య మొందియుండెను. రూపక రచన యందు ముఖ్యాంగములై వెలయు గీతము, కావ్యము, ఆఖ్యానము, కథోపకథనము, సంభాషణము మున్నగు నంశములు ఋగ్వేదములో నగుపడినను కాల క్రమమున దొల్లిటి బీజాంకురము లశేషకావ్య చాతుర్ విలసితములై వికసించి రూపక రూపమున బరిణమించినవి. పాణిని పతంజలుల కాలమునకే నాట్యశాస్త్రములు రచింపబడి యుండెను. పాణిని, శిలాలీ కృశాశ్వలను నాట్య శాస్త్రకర్తల నుదాహరించి యున్నాడు. అప్పటికె భావభంగీ, ఆహార్యము, వాచికము, మున్నగాగల యభినయరీతులు వికసించి యుండెను. కంసవధ, బలిబాధ మున్నగు రూపకములు, పేరొందె యాడబడుచుండెను. భారతాంతర్గతమగు హరివంశములో వజ్రనాభుని పురమున కావే

రంభాభి సారమను నాటకము ప్రదర్శింపబడినట్లును, అందు కైలాసదృశ్య మతి మనోహరముగ జూపబడినట్లును ప్రశంసింపబడినది.

మహావీరస్వామికి రెండువందల సంవత్సరముల తరువాత నివసించిన భద్రబాహుస్వామి రచించిన కల్ప సూత్రములలో నీక్రిందికథ నుదాహరించి యున్నాడు. ఒక సాధుశిష్యుడు గురుసన్నిధానమున కాలస్యముగ జేరెను. యేల నీజాగని గురు వడుగ దారిలో నాట్యావలోకనమున కొంతతడ వయ్యెనని యంతేవాసి సమాధానమిడెను. అందున గురువు నటులు ప్రయోగించెడి నాటకాదులను సాధకులు జూడకూడదని వారించెను. మరియొకసారి యిటులనే నటీప్రయుక్తరూపక మవలోకించి కాలయాపన మొనర్చి వచ్చినశిష్యుడు నటప్రయుక్త మైనను, నటీప్రయుక్తమైనను, రూపకవిలోకనము సాధువులకు గర్హ్యమగునని నారింపబడెను. ఇందువలన క్రీస్తుపుట్టుకకనేక శతాబ్దములకు పూర్వమే మన యార్యావర్తమున నట నటీ ప్రయుక్తమగు రూపకములు వీధులలో నాడబడుచుండెనని యు, విద్యార్థు లచ్చటికేగుట నిజవ్యాపారవిభ్రంశకంబుగ నెంచబడెనని యు దేలుచున్నది. ఇప్పటికి మూడువేల సంవత్సరముల వెనుక భారతభూమిలో సర్వాంగ సుందరమగు రూపకప్రయోగము లు జనాభీష్ట మనుభవించుచు సర్వసామాన్యముగా బ్రదర్శింపబడెనను నిదర్శనము లున్నవి. భరతముని తన నాట్యశాస్త్రములో తనకు పూర్వముండిన గ్రంథము లనేకముల బేర్కొనుచున్నాడు. కాని పాణిని యుదాహరించిన శిలాలి కృశాశ్వులవేరు లెత్తియుండలేదు. భరతముని

B. C. 4 శతాబ్దముల పూర్వముండెను. ఈతని నాట్యశాస్త్రములో నాట్యరంగము రంగోప కరణములు ప్రేక్షకసభలు మున్నగు వానిని నిర్మించుపద్ధతులు చెప్పబడియున్నవి. సర్గోజా రాజ్యములోని రామఘడులో రెండు గిరికందరములగు పడినవి. ఇందొకటి భారతీయ నాట్యశాస్త్రమందు చెప్పిన రీతిగ రాతిలోనుండి తొలవబడిన ప్రేక్షక గృహము. సుతను అను దేవదాశి కొందరు నర్తకీజనంబులకొరకీ నాట్యవేశ్మను నిర్మించినట్లగుపడును. ఇందలి గోడలు విచిత్రవర్ణాలంకారములతో వెలువొందుచున్నవి. యవనుల నాట్యకళావికాసము భరతముని తరువాత నేర్పడినది. యవనికా యవనికగా మున్నగు శబ్దములవలన భారతీయుల నాట్యకళ యవనదేశములనుండి తేబడినదని కొందరు చెప్పుచున్నారు. కాని యీపదములను యవనులే భారతీయుల వలన గ్రహింపలేదనుటకు తార్కాణములు లేవు. మనదేశములోకూడ ననేక వేల ప్రేక్షకుల కవకాశమొసంగెడి విశాల నాట్యభవనములుండెనను నిదర్శనము లున్నవి.

భారతీయనాటకములు మున్మొదలు కీలుబొమ్మలతో నాడబడుచుండెను. ఈ కీలుబొమ్మలకు (Puppets) పాంచాలికా, పుస్తలిక, పుత్తలి, మున్నగునామము లొప్పుచుండెను. ఇవి మిక్కిలి ప్రాచీనమగు కాలములో సద్భుత యంత్రవికాసమొందినట్లగపడును. పార్వతీదేవి మలయపర్వతమునకేగి యచ్చట లభ్యమగుచందన కాష్టంబులతో నొక కీలుబొమ్మను రచించెననియు శివుడద్దాని నేర్పుసొంపుల కానందించి యందున జీవసంచలన మేర్పరచెననియు కథాసరిత్సాగరమున జెప్పబడి

యున్నది. మహాశిల్పిమయుని కూతురగు సోమప్రభ మయు నిర్మితంబులగు కీలుబొమ్మల గొన్నిటిని కళింగసేనయను కాకో మరికిచ్చెనను కథ లగుపడుచున్నవి. ఈ బొమ్మలు దూరమున నుండు వస్తువులను తెచ్చుచు చెట్లకు నీళ్ళుపోయుచూ ఆంగి కాభినయముల జెలువొందుచుమాటాడుచు ద్విభాషాపాండిత్య మొదవి విచిత్రముగ నాడుచుండెను. రాజశేఖరుని బాల రామాయణములో రావణుడు కీలుబొమ్మలజూచి నిజమగుసీత సింధూరికలని భ్రమించినట్లు చెప్పబడియున్నది. కీలుబొమ్మల యాట తెరవుల ననుసరించి సూత్రధారుడు, స్థాపకుడు అను నటోద్యోగము లేర్పడినవి. సజీవనటులు కీలుబొమ్మల స్థాన మాక్రమించి స్వయముగ నభినయింప మొదలిడినదాది స్థాపక సూత్రధారుల యుద్యోగము నిరుపయోగమైనది. వీరు తరు వాత నాటకములలో కథాప్రస్తావనము సూచించువారలైరి. కీలుబొమ్మలు కాక ఛాయానాటకములను తోలుబొమ్మలుకూడ విరివిగ ప్రదర్శింప బడుచుండెను. సుభటుడు రచించిన దూతాంగదము — భవభూతి విరచితంబగు మహావీరచరితము జయదేవుని ప్రసన్నరాఘవము, రాజశేఖరుని బాలరామాయ ణము, ఛాయామూర్తులచే ప్రదర్శింపబడుచుండెను.

గీర్వాణనాటకముల క్రమబద్ధేతిహాసమును నిరూపింప నలవికాదు. కాని ప్రకృతమందు లభ్యమగుచున్న సంస్కృత రూపకము క్రిందిక్రమమున నమర్పవచ్చును.

1. భాసుడు, బి సి. 4 వ శతాబ్దము.
2. అశ్వఘోషుడు.
3. కాళిదాసు, బి. సి. 1 వ శతాబ్దము.

4. శూద్రకుడు, ఎ. డి. (భాసకవి రచించిన దరిద్రచారు దత్తము ననుసరించి మృచ్ఛకటిక రచించె)
5. భవభూతి, ఎ. డి. 6వ శతాబ్దము (ఉత్తరరామచరితము మాలతీమాధవీయము, మహావీరచరితము.
6. శ్రీహర్షుడు, ఎ. డి. 7వ శతాబ్దము, ప్రియదర్శిక, నాగానందము, రత్నావళి.
7. భట్టనారాయణ, ఎ. డి. 9వ శతాబ్దము, వేణీసంహారము.
8. విశాఖదత్తుడు, ఎ. డి. 9వ శతాబ్దము ముద్రారాక్షసము.
9 రాజశేఖరుడు ఎ. డి. 10వ శతాబ్దము, కర్పూరమంజరి, బాలరామాయణము, బాలభారతము.
10. కృష్ణమిశ్రుడు, ఎ. డి. 11వ శతాబ్దము, ప్రభోదచంద్రోదయము.
11. జయదేవుడు, ఎ. డి. 13వ శతాబ్దము ప్రసన్న రాఘవము.

ఇవియే సంస్కృతమునందు గల ప్రస్తుతము లభ్యమగుచున్న ప్రసిద్ధరసవత్ నాటకములు. భాసకవి నాటకరచనలో నట్టి యద్భుత కళాసిద్ధి నొందుట కతనిపూర్వము కొన్ని మంచి నాటకములు అథవా సద్రూపకరచన ప్రయత్నములు విరివిగ నేర్పడి యుండును.

12వ శతాబ్దము తరువాత హిందూ దేశములో స్వతంత్ర రూపకరచన మస్తమించినది. మహమ్మదీయుల ప్రభావ మిందునకు కారణమై యుండవచ్చును. అటుతరువాత భక్తి, భజనలకు సంబంధించిన నాటకరూపములు కూచిపూడి భాగవతము వంటివి హిందూ దేశములో నచ్చటచ్చట వెలసినవి. ఇందు ముద్రాభినయము తాళప్రస్తరణము

నృత్యము ప్రధానాంశములుగ నున్న హిందూ దేశములో నివి రాసలీలలను పేరుతో వంగదేశమున యాత్రలనియు మహారాష్ట్రమున కీర్తనలనియు ఆంధ్రదేశమున భాగవతములనియు బిలువబడుచున్నవి. సామాన్యముగ కృష్ణగాథలను భాగవత కథలను బ్రదర్శించెడి యీ నృత్త ప్రధానరూపకములే యాంగ్లేయుల నాగరక సంపర్క మేర్పడు వరకును హిందూదేశమున రూపకవినోద మొసంగుచుండెను. ప్రాచీన గీర్వాణ నాటకములు సాహిత్యగ్రంథములుగ బఠింపబడు చుండెనే గాని వీని నెక్కుడు అభినయించిన నిదర్శనములు హైందవ చారిత్రమున నగుపడవు. కడచిన ఏబదియేండ్లలో నాంగ్ల విద్యా సంపర్కమున నాటక సారస్వతమందును రూపక ప్రదర్శనమందును భారతీయుల కత్యంతాహార్ద్రి యేర్పడినది. దీని పర్యవసానముగ హిందూ దేశములోని ప్రధాన భాషలందు సంస్కృత నాటకముల ననువదించు నాచారము ఆంగ్లరూపక పద్ధతుల ననుసరించి హైందవ పురాణగాథలను యితిహాస విషయములను సాంఘిక సందర్భములను రూపకరూపమున గూర్చి ప్రదర్శించెడి యాచార మేర్పడినది. ఈనాటి నాట్యోద్యమము ఆంగ్లగీర్వాణ సారస్వత సంపర్కమున నేర్పడినదని చెప్పవచ్చును.

### హిందీ నాటకములు

అనేక శతాబ్దములక్రింద

(కవి) నేవాజ్ — శకుంతల

హృదయరాం — హనుమన్ నాటకము.

వ్రజవాసిదాస్ — ప్రబోధచంద్రోదయము.

మున్నగుకొన్ని సంస్కృత నాటకములను హిందీభాష లోరచించిరి. కాని యివి నాటకములనజెల్లవు. కాని హిందీ పూర్వకవులు రచించిన ఆనంద రఘునందనము, ప్రభావతీ మున్నగునవి కొన్ని నాటక లక్షణంబున కనువగునవి కూడ గలవు. హిందీషేక్స్పియరు అనదగు భారతేందు బాబూ హరిశ్చంద్ర కవివర్యుని తండ్రియగు గిరిధర దాసుగారు సుమారు నూరుసంవత్సరములక్రింద వ్రజభాషలో నహుష డను నాటకమును రచించిరి. ఇదియే హిందీలోని ప్రథమ స్వతంత్ర రూపక కల్పనము. వీని తరువాత రాజాలక్ష్మణ సింగు శాకుంతలము ప్రయోగార్హముగ ననువదించి యాడించెను. తరువాత బాబూ హరిశ్చంద్ర భారతేందుప్రభు వంగీ యాంగ్ల గీర్వాణ నాటకకథలకై కొని ఛాయానువాద ముగ స్వతంత్రకల్పనలతో విస్తరించుచు సుమా రిరువది నాటకముల రచించి యున్నాడు.

లాలాశ్రీనివాసదాసు రణధీర ప్రేమమోహిని అను నాటకములను; పండిత కేశవ రామభట్టు సంజ్ఞాతసంబుల్ శామ్షదు మున్నగు రూపకములను బదరీనారాయణ చౌదరి భారత సౌభాగ్య నాటకమును బాబూతోతారామ్ కేటో కృతాంతమును, బాబూరాధాకృష్ణదాసు మహారణా ప్రతాప సింగు నాటకమును రచించి యున్నారు. ఇవియే హిందీభాషలో మిగుల కెక్కిన రూపకములు. కొంచెమైనను స్వాతంత్ర వికాస మొప్పునవి. ప్రస్తుతము ఆంగ్లవంగీయ రూపకముల సంఖ్యాకముగ ననువదింపబడుచున్నవి. కాని వీనిలో తొల్లిటి

రుచులు తక్క ప్రత్యేక సంతరణ సౌందర్యమేమియు నగు పడదు. హిందీ రంగశాల కలకత్తా బొంబాయి నగరముల లోని పార్సీమున్నగు వ్యాపార నాట్యశాలల యాదర్శమున బైలిడినది. తెలుగుదేశ మందెట్టి నవ్యనాటకకవి కాన మగు పడుచున్నదో అట్టిదియే హిందీసీమలందు కూడ నేర్పడినది.

## వంగీయ రూపకములు

బెంగాళీ భాషలో ద్విజేంద్రలాల్ రాయ్, గిరీశఘోష్, బాబూజయశంకరప్రసాదు, రవీంద్రనాథఠాకూరు మున్నగు కవుల రూపకము లశేషప్రతిభా సమన్వితములై ప్రస్తుతపు హైందవ రూపకరచన పరిణామమును చూపుచున్నవి. అజాతశత్రు జనమేజయ విశాఖ మొదలగు రూపక రాజములు వంగ సారస్వతము నలంకరించుచున్నది

మహారాష్ట్ర దేశములో నాటక కవిత్వ మెక్కువగ నభివృద్ధి నొందెనని తెలియుచున్నది. సుమారు పదిమంది మేటికవులు మహారాష్ట్ర నాటక రచయితలై వాసిగని యున్నారు. ఆంధ్రులు కొంచెమైనను ఆదరింపవలసిన నవీన హైందవ రూపక కవిత్వము హిందీ, బెంగాళీ, మహారాష్ట్ర భాషలయందు లభ్యమగుచున్నది. తక్కంగల తమిళ, కర్ణాటక మలయాళ, గుజరాతీ, యుత్కళ, యుర్దూభాషలందు ఆంధ్రులకు దారి చూపగల నాట్య వికాసమగుపడదు. హిందీ, బెంగాళీ, మహారాష్ట్ర దేశీయుల నవీన నాట్యోద్యమము ఆంగ్ల సంపర్కమున నేర్పడి యాంగ్ల గీర్వాణ కళాదర్శనుల

సమన్వయంబున నడచుచున్నను లౌకిక కారణంబుల కతనను ప్రత్యేక ధీంశాలులాయెడ నుదయించి నందునను ముఖ్యముగ వంగదేశపు కావ్యరూపక చిత్రవికాసములు, ఆంధ్రులకు మానసనీయములై యున్నవి.





# తు ది చూ పు.

## —ఆంధ్రులు—పాశ్చాత్య రూపకములు—

విదేశముల సారస్వతరీతు లశేషముగ నాంధ్రభావకు జేర్పవలసి యున్నది. పరరాజ్యనాగరిక పద్ధతు లరయు నందున, దేశమం దిదివరకు నాదుకొనియున్న యాచారాభిమానములు కదలబారి, తత్పాటమువలన పాతవేరులు తెగి నవ్యసజీవమూలము లంకురించి చెట్టు చిగురించి మొగ్గలిడు నట్లు, వ్యక్తులుగాని జాతులుగాని అప్పుడప్పుడు విశాలవిశ్వావలోకన మొనర్చి యన్యసాంప్రదాయముల గుర్తించి తమ యభిమానముల విజ్ఞానజ్వాలనమందు కాల్చి, కిలుమొదలించి మెరుగెట్టవలసియుండును. ఆంధ్రదేశపు ప్రాచీనసారస్వతారంభములు గీర్వాణపురాణముల ననువదించుటలో, సంస్కృతకావ్యముల ననుకరించి స్వతంత్ర ప్రబంధముల నల్లుటలో నుదయించినవి. గీర్వాణవృత్తాంతములు హిందూమతావంశముల్తై విలసిల్లు కతన, తొల్లిటి తెలుగుకైత లెత్తుకొనిన యితి

వృత్తములే యిప్పటికినీ యాంధ్ర సారస్వతపు ప్రధానాంశము లయియున్నవి. నన్నయగారి నలుడు, పోతనగారి ప్రహ్లాద కుమారుడు, గోపికాగీతములు, ఇవియే మన నాటకములకు కావ్యములకు వలయు సామగ్రినేర్పరచుచున్నవి. ఇటీవలి యాంగ్లవిద్యా సంపర్కము దవిన తెలుగు కవులు పాశ్చాత్య సారస్వతరీతులను తెలుగున జేర్చియు, ఆంగ్లవాఙ్మయావలోకనమున నేర్పడిన భావావేశమునను క్రొత్తదారుల ద్రొక్కుచున్నారు. కాని సమగ్రముగ నేపాత్తమును సంతరింపలేదు. ముఖ్యముగా రూపక కవిత్వమం దీపని జరుగవలసియున్నది.

ఇదివరలో మేము చెప్పినరీతి పాశ్చాత్యు లనేకరీతుల రూపకములను రచించి సర్వాంగ ప్రయోగపరీక్షల జరుపుచున్నారు. ఈరూపములు తెలుగున జేరినచో నాట్యకళకమేయప్రోద్బల మేర్పడగలదు. అందుచేత అట్టి ప్రయత్నమెవ్వరైనను చేయుటకిందుల కిదిగువ రూపకముల సంతరణానుకూలమయినవిగ జేర్కొనుచున్నాను.

| కవి | రూపకము |
|---|---|
| ఇస్కిలను | Promethins Bound. |
| సాఫాక్లీజు | Aedipus. |
| యూరిపిడీసు | Alcestis. |
| ప్లాటసు | Captives. |
| టెరెన్సు | Eunouchs. |
| మార్లో | Tamburlanc. |
| జాన్సను | Every man in his humour. |

| కవి | రూపకము |
|---|---|
| బోమాన్ ఫ్లెచ్చరు | Philaster. |
| షేక్స్పియరు | All. |
| కాల్డెరాన్ | Life is a dream, |
| కార్నెల్లీ | La Cia. |
| మోల్యేరు | La Tartruffe, Alcestes, Misanthrope. |
| రాసీను | Iphigene. |
| గోల్డుస్మిత్తు | She stoops to Conquer. |
| షెరిడను | Rivals. |
| బోమర్ కేయసు | The Barbar of seville. |
| వాల్టేరు | Oedipe. |
| లెస్సింగు | Nathan the wise. |
| షిల్లరు | Wiiliam Tell, Mary Stewart. |
| గెటీ | Faust. |
| ఆన్స్లైగరు | Alladin. |
| హెర్డ్జు | King Rene's daughter. |
| గ్రిల్ ప్రేజర్ | Waves of lone, dream of life. |
| హ్యూగో | Mary tudor. |
| పెద్దడ్యూమాయా | Henry III, Latour De Nesle. |
| చిన్నడ్యూమా | Dame of Camelia, |
| గోగాల్ | Revior. |
| క్రాసింస్కీ | Undevine Comedy. |
| ప్రేటాగు | Debit and Credit. |
| ఆగేయు | Les Effrontes. |

| కవి | రూపకము |
|---|---|
| అస్ట్రొవిస్కీ | The storm. |
| అచాగరే | Mariana. |
| ఇబ్సెను | Wild duck, Pillars of society, When we dead awaken, Peer Ghynt. |
| పినేరో | Profligate. |
| ఆర్థరుజోన్సు | The silver king. |
| మాటర్లింకు | La Princes Melene,Betrothal. |
| హాటమన్ | Atlantes,Q uint. |
| బర్నార్డుషా | Cleopatra, Man and Superman, Back to Methusaleh. |
| గ్లాసువర్దీ | Strife. |
| బారీ | Peter Pan. |
| సింగా | Play boy of the western world |
| బ్యోర్న్సన్ | King Severre, Ligurd the Bastard. |
| హార్డీ | Dynasts. |
| ఈట్సు | Countes Catteeleen. |

పైజాబితాలో ప్రాచీననాటకకవులలో మహామహులగు వారిపాత్రములను నవీనకవులలో నన్ని దేశములందు పేరెన్నిక గనిచిన వారియందరి పాత్రములను పేర్కొనియున్నాము. ప్రాచీనుల కళాసంప్రదాయములు నవీనులందు సంక్రమించి యుండును. నవీనులు ఈనాటి రుచులనెరింగి నవ్యకాలోచిత నాట్యసమశ్యల నందికొని వాస్తవికమగు రూపకముల రచించు చుందురు. అందుచే నవీనుల నాట్యాదర్శములు మున్ముందు

గారవింపదగియున్నవి. పాశ్చాత్యనాటక రాజములలో ప్రధానమగువానిని వలయుమార్పులతో, నవసరమైనచోట మనదేశమున కన్వయమగునట్లు మార్చి తెలుగులో సంతరింపవలసియున్నది. ఈపని నాధునికకవు లందుకొనెదరుగాక. నేనకవిగాని కతన నీపని చేయజాలక "రూపక రసాలవను" తరువాతి పుస్తకములో ప్రపంచములోని ప్రసిద్ధ రూపకకర్తలను వానికల్పిన విశేషములను తెలియజేసి యాంధ్రనాటకసారస్వతవికాసమునకు నాచేనగు గద్యసేవ నొనర్పదలచినాడను. కవి సోదరులు రూపకములనే నిండుయందమున సంతరించి యాంధ్రనాటకకళ కశేషకల్పన వైభవ మొనగూర్ప వేడుచున్నాను.

## నాట్యకళనుగూర్చిన ప్రసిద్ధగ్రంథములు.

| | |
|---|---|
| A. W. Schlegel (1846) | Lectures on Dramatic Art and Literature. |
| C. Magnin (1862) | History of marionettes in Europe. |
| Hazlitt (18:5) | Dramatic essays. |
| Royer (1878) | History cf Universal theatre. |
| Haigh (1896) | The tragic drama of the Greeks. The Attic Theatre. |
| Ward (18:9) | —History of English drama to the deathtof Queen Anne. |
| Maindron (1900) | Marionnets et Gaiglons. |
| Pischel (190:) | The home of the puppet play. |
| Chambers 1903 | History of Theatrical art in anicient and modern times. |

| | |
|---|---|
| Warsage (1905) | History of celebrated theatre. Leigols of marionnets. |
| Friedlawder (1908) | Roman life and manners under the Empire. |
| Rowche (1910) | The modern theatrical art. |
| Sidney Lee (1916) | William Shakespeare. |
| Dickinson (1920) | The Contemporary drama of England. |
| E. O. Sachs (1899) | Modern opera houses and theatres. |
| Barnett (1900) | The Greek drama. |
| Adams | Dictionary of the drama. |
| Archer (1856) | The poets of the younger generation. |

*English dramatists of to-day.*

| | |
|---|---|
| Brunetiere | Conferences of Olodeon. |
| Diderot | On dramatic poetry. |
| Du Meril | The Latin origins of modern theatre. |
| Edwards (1852-1915) | English theatrical manager of gaiety theatre, Famous first representations (1666-1850. |
| Freytag (1896-95) | History of dramatists in France. |
| Gottchall (182?-1909) | Modren dramatic criticism. |
| Green | Dramatic criticism, |
| Gubernatis (1840-191?) | The story of Dramatic theatre, |
| Harden (186?) | Literature and theatre. |
| Hennequein | The art of play writing. |

| | |
|---|---|
| Hutton (1843-1904) | Actors and actresses of Great Britain & America, plays & players. |
| Larbournet | Studies in dramatic criticism & studies in dramatic history. |
| Lemaitre (1853—1914) | Cornelly & the poetics of Aristotle. |
| Lessing (1729—1781) | Dramaturgie. |
| Lowe | Biographical account of English theatrical literature |
| Pougin | Historic and Picturesque Dictionary of the Drama. |
| Karl mantzius | History of theatrical Art in Ancient & Modern Times. |
| Moderwell | The Theatre of to day. |
| | The Exemplary Theatre. |
| Mackaye | The Civic Theatre. |
| Suchs & Woodrow | Modern Opera houses & Theatres. |
| Gordon Craig | On the Art of the Theatre |
| | Towards a new Theatre. |
| Carter | The new spirit in Drama & Art. |
| Cheny | The new movement in the Theatre. |
| Dowden | Shakespeare, his mind & Art. |
| Bradley | Shakesperian Tragedy. |
| Sidney Lee | Sh. & Modern Stage |
| Ulrice | Sh's Dramatic Art. |
| Mathews 1852 | The development of the drama, French dramatists of the 19th Century. A book about the theatre. |

| | |
|---|---|
| Mezzeinie 1805-72 | On the historical drama |
| Meridith 1828-19.9 | Comedy and the uses of .comic spirit. |
| Moultan 1849 | Shakespeare as a dramatic thinker and artist. |
| Price | Technic of the drama. |
| Tree (185?-1917) | Some fallacies of the modern stage. |
| Tunision | Dramatic traditions of the dark ages, |
| Ward 18 7 | English dramatic literature. |
| Woodbridge | Drama its lawso and technic. |
| Brander Mathews | A study of the drama, The theatres of Paris. |
| Talma—1915 | Reflections of the actors art: |
| Russel | Representative actors. |

ఇవికాక, ఆపెరా, మెలోడ్రామా, ట్రాజెడీ, కామెడీ, బొమ్మలాటలు, నానాదేశముల నాట్యవైఖరులు నాట్యసంగీత మందిరముల కట్టడిశిల్పరీతులు, రూపకకవులు, నటశేఖరులు, మున్నగు ప్రతివిషయమును గూర్చియు వేనవేల ప్రత్యేక గ్రంథములున్నవి. ఇవికాక రూపకవిమర్శనము నాట్యవిమర్శనము నిరంతరముగ పత్రికాముఖమునను, గ్రంథరూపమునను వెలువడుచుండును. పాశ్చాత్యులు సర్వవిషయముల నభివృద్ధినొందుటకు ముఖ్యకారణము వారిలో ఇది ప్రాచీనమనియు, ఇది నవీనమనియో, ఇది గొప్ప ఇది తక్కువ, ఇది ప్రమాణ లక్షణ నిబద్ధము ఇది స్వతంత్రభావ వికాసము అనెడి తారతమ్యము లేదు. "గుణాః పూజాస్థానం గుణిషు న

-చలింగం నచవయః" "బాలాదపి సుభాషితం" మున్నగు వాక్యములు మనదేశములో పుట్టినను; వీనియాచరణ మాత్రము పాశ్చాత్య విజ్ఞాన సాధకులదే అయియున్నది. ఆంగ్లేయులొక్క అమరావతీస్థూపము మీద తమకు సంబంధించని దూరదేశపు ప్రాచీన శిల్పవృత్తాంతము మీద, ఎబది పుస్తకములు రచించియుండ, మనదేశభాషలలో లలితకళల గూర్చి యొకటిరెండు పుస్తకములుకూడ వెలువడకున్నవి. స్వతంత్రభావ వికాసమునకు ఎడమిచ్చినగాని యావద్విశ్వ విజ్ఞానవిభూతిపై చూపునిలపి జాతీయాహంకారముల ద్రుంచి భావవికాసమె ప్రధానముగనెంచి గౌరవించినగాని కళాస్వరూపమును నిర్ణయించు (వర్ణించి వేర్పరచు) గ్రంథజాల మనంతముగ వికసించినగాని మన దరిద్రము తీరదు. ఇట్టిప్రయత్నములకు హృదయపూర్వకముగ స్వాగత మొసంగుచున్నాము.

నాట్యోత్పలము సంపూర్ణము.



# రూపక రసాలము.

[ 480 పుటల క్రౌనుసైజు గ్రంథము. ]

ఇది నటులకు, నాటకకవులకు, విమర్శకులకు, నుప యోగకరముగునట్లు రచింపబడినది. రూపకవిరచనంబును, ప్రదర్శనమును, రసవిచక్షణతో బరిశీలించి మంచి విమర్శక వ్యాసముల వ్రాయుటకు సాధన సంపత్తులేర్పరచును. నాటక కవులకనేక క్రొత్తకల్పనల నందించును. వేషాచారములను పాత్రస్వభావములను దేటపరచి, నటుల కమూల్యప్రయోగ సౌకర్యము లొసంగును. ఇందలి ముఖ్యాంశములివి.

1. రూపకరచనము, ప్రదర్శనము విమర్శించుటయందుపయోగించెడి యాంగ్ల గీర్వాణ పరిభాష:—

2. భారతీయ నాట్యశాస్త్రము, దశరూపకము, ప్రతాపరుద్రీయము, సాహిత్యదర్పణము, రసగంగాధరములలో నిర్వచింపబడిన రూపకలక్షణము, విమర్శకపద్ధతులు, రస విచారణము.

3. పాశ్చాత్య విమర్శక శేఖరులు పై విషయముల గూర్చి చెప్పిన యభిప్రాయములు, ప్రసిద్ధవిమర్శనముల కనువాదములు

4. నవీన హైందవ విమర్శకుల నాటకాదర్శములు; ఆంధ్ర విమర్శకుల రూపకప్రశంస.

5. నా సమన్వయము, ప్రమాణములు సిద్ధాంతములు.

6. శాకుంతలము, ఉత్తరరామచరితము, రత్నావళీ, మృచ్ఛకటికా, ముద్రారాక్షసము, వేణీసంహారము, స్వప్న వాసవదత్త అను గీర్వాణరూపకములను వీని యాంధ్రీకరణ

ములను, విమర్శించుచు నటులకు వలయు సూచనలందించును.

7. ప్రస్తుతము ఆంధ్ర దేశములో ఆడబడుచున్న సుమారు యిరువది ప్రసిద్ధరూపకముల విమర్శనము, నటోపయోగ సూచనలు.

8. సుమారు ముప్పది లోకోత్తర పాశ్చాత్యరూపకముల కథాసంగ్రహము, కల్పనపరీక్ష.

9. కొన్ని ప్రసిద్ధ బెంగాలీ, హిందీ, మహారాష్ట్ర రూపకములు.

10. నాట్యరంగమున చిత్రింపదగిన భారతీయ శిల్పరీతులు

11. భారతదేశమం దనేక కాలములలో వివిధ పాత్రలు ప్రయోగించిన యాహార్యపరికరణంబులు.

12. ఆంధ్ర రూపకరచనము, నాటక ప్రదర్శనములందు గావలసిన భావికార్య సూచనలు; వుపసంహారము.

ఇందువచ్చిన కొన్నొకరీతిగా ననేక విమర్శకవైఖరుల జూపబడినవి. రూపకపాత్ర నిరూపణమందు సంస్కృతాంధ్ర మహాకావ్యములు పురాణేతిహాసములు విరివిగ నుపయోగింప బడినవి. శాస్త్రీయ పరిశోధన పద్ధతులను నిండార వికసింప జేయుచు రూపకప్రపంచమందలి పాత్రపోషణము కథ సంవిధానము రసౌచిత్యములను సరసముగ బ్రకటించున.

ఈ గ్రంథము నాంధ్రనాటక పరిషత్తువారి 'రూప సంస్కరణోద్యమమున కనుకూలముగ రచించియున్నాము.

పురాణం సూరిశాస్త్రి.

# కావ్యసంతానము

( 320 పుటల క్రౌను సైజు పుస్తకము )

ఇందు నానాభాషల కావ్యవైఖరులు దేశకాలావస్థలబట్టియు, జాతీయత ననుసరించియు పొందిన మార్పులు, సర్వదేశకాలావస్థలకు సామాన్యమగు కావ్యరీతులు, కవిజీవితములు, కావ్యోద్యమములు, విస్తరింపబడును.

**ప్రథమభాగము:— యూరపులోని కావ్యవిన్యాసము.**

గ్రీసు, రోము, యిటలీ, స్పెయిను, స్కాండినేవియా, ఫ్రాన్సు, జర్మనురాజ్యములు, రష్యా, స్లావురాజ్యములు, ఇంగ్లాండు, అధినివేశనములు యొక్క జాతీయత, కావ్య చరిత్రము, కళాసంప్రదాయములు.

**ద్వితీయభాగము:— ఆశ్యాలోని కావ్యవిన్యాసము.**

అస్సీరియా, ఈజిప్టు, యూదురాజ్యము, పర్షియా, అరేబియా, చీనా, జపాను, బర్మా మొదలగు దేశముల కావ్యచరిత్రము, కళాసంప్రదాయములు.

**తృతీయభాగము:— గీర్వాణ సాహిత్యము.**

ఋగ్వేదము, ఉపనిషత్తులు, మహాపురాణములు, కాళిదాసు, భారవి నైషధకారుడు మున్నగు గీర్వాణకావ్యప్రశంస.

**నాల్గవభాగము:— భారతీయదేశ భాషాసాహిత్యము.**

హిందీ, బెంగాలీ, మహారాష్ట్రి, కర్ణాటక, తమిళ, ఉర్దూ, తెలుగు భాషల కావ్యవికాసము.

**అయిదవభాగము:— కావ్యప్రపంచ చరిత్రమువలన తేలిన సారాంశము.**

ఆంధ్రసారస్వత వికాసమును యీవెలుగున పరీక్షించుట — నవీనాంధ్ర కవులకు సందేశము.

( 480 పుటల క్రౌను సైజు గ్రంథము.)

1. యూరపురాజ్యముల చరిత్రాంకములు.
2. పాశ్చాత్యవిమర్శక మహర్షులు, వారిజీవితములు.
3. చిత్రము, శిల్పము, సంగీతము, కావ్యము, నాటకము, రసము, మానవస్వభావము, గురించి వీరొనర్చిన వి[illegible]ంసలకు, వాదములు.
4. పాశ్చాత్య విమర్శక నియమములు[illegible] సమన్వ[illegible]
5. మానసశాస్త్రము,—Psychology
6. రసవిచారణ—Æsthetics.
7. యూరపులోని నానాదేశములందు వివిధకాలములలో నేర్పడిన కావ్యరీతులు, చిత్రసాంప్రదాయములు.
8. కావ్యప్రకాశిక, సాహిత్యదర్పణము, రసగంగాధరము, ధ్వన్యాలోకము, చిత్రమీమాంస, ఔచిత్యవిచారచర్చ మున్నగు గ్రంథములందలి కావ్యప్రయోజనము, కావ్యతత్త్వము. గుణదోషములు, కావ్యసంధానమును గూర్చిన వ్యాఖ్యానములకు, సరియగు ననువాదములు.
9. భారతీయుల అలంకారశాస్త్రాదులందు గుపడు మానసశాస్త్ర రసవిచారణ.
10. నవీనహైందవ కవులయొక్కయు విమర్శకులయొక్కయు, పోక
11. కావ్యవిమర్శనకు సంబంధించిన యాంగ్లగీర్వాణ పరిభాష.
12. సమన్వయము, ఉపసంహారము, భావప్రయత్న సూచనలు, [illegible]తములు.

ఈ పుస్తకము ఆంధ్రసారస్వత సభవారు తెలుగుకవిత్వమును మెట్టేర్పరచిన విమర్శకపరిషత్తులోని సభ్యుడనై యద్దాని యుద్దేశ్యము నెరవేర్ప నెంచెడి నా ప్రథమ గ్రంథముగ సమర్పించుచున్నాను.

విద్యానిలయము,
పురాణం సూరిశాస్త్రి.